జర్మన్ నాటక కర్తలలో సుప్రసిద్ధుడు బెర్టోల్డ్ బ్రెష్ట్. 1933 లో హిట్లర్ అధికారానికి వచ్చిన తర్వాత, ఆయన జర్మనీ విడిచిపెట్టి పదిహేను సంవత్సరాలు అజ్ఞాతవాసం చేశాడు. ఆ రోజుల్లో లైఫ్ ఆఫ్ గలీలియో, మదర్ కరేజి వంటి ప్రశస్త నాటకాలు రచించి ఆయన జర్మన్ సాహిత్యానికి వినూత్నాలంకారాలు సంతరించాడు.

1948 లో జర్మనీకి తిరిగి వచ్చిన తర్వాత బ్రెష్ట్ ఒక థియేటరు స్థాపించి తద్వారా తన నాటకాలను ప్రదర్శించడంలో నిమగ్నుడైనాడు.

పుట్టుకతో మానవుడు దైవాంశ సంభూతుడైనా, దేశ కాల పరిస్థితులు స్వార్థం మొదలైనవాటివల్ల అతడు ఎలా ఉక్కిరి బిక్కిరి అవుతున్నదీ అభివర్ణించే యీ మదర్ కరేజి నాటకమును జర్మను మూలం నుంచి డా. వి. యన్. శర్మగారు తెలుగు చేశారు. దీన్ని తెలుగు పాఠక లోకం ఆదరిస్తుందని ఆశిస్తున్నాము.

రూ. 10-00

# మదర్ కరేజి

## (ముప్పయి ఏండ్ల సమర గాథ)


జర్మన్ మూలం :

బెర్టోల్డ్ బ్రెస్ట్

తెలుగు అనువాదం :

వి. ఎన్. శర్మ





సాహిత్య అకాడెమీ

న్యూ ఢిల్లీ

MOTHER COURAGE—German play by BERTOLDT BRECHT. Telugu Translation from the original by V. N. Sharma,
Published by Sahitya Akademi, New Delhi, 1976.
Price Rs. 10.


First edition—1976

Cover Photo—Courtesy—Consulate General of the Federal Republic of Germany at Madras.

*Available at :*
SAHITYA AKADEMI
Rabindra Bhavan, New Delhi-1.

*Regional Offices :*
Madras-6, Calcutta-29, and Bombay-14.

ముద్రణ :
ఫ్రీడమ్ ప్రెస్,
మద్రాసు-600021.

వెల : రూ. 10-

# అనువాదకుని మనవి

"మదర్ కరేజి" ఆధునిక జర్మను సాహిత్యరంగంలో అగ్రస్థానము పొందిన నాటకం. రచయిత బెర్‌టోల్డ్ బ్రెస్ట్. మానవత్వం బాగా ఆకళింపు చేసుకున్నవాడు. పుట్టుకతో మానవుడు దైవాంశ సంభూతుడు. దేశకాలపరిస్థితులు ఒకవైపు. తరతరాలనుంచి వస్తున్న స్వార్థం ఇంకొకవైపు అతనిని ఉక్కిరి బిక్కిరి చేస్తూ అతని సహజత్వానికి పెనుభూతాలుగా మారుతూవుంటాయి. "మదర్ కరేజి" ఇలాటి ఘట్టాలను చిన్ననాటినుంచీ ఎలా ఎదుర్కోవలసి వచ్చిందో బ్రెస్ట్ తన కళానైపుణ్యాన్ని ఎలా వుపయోగించిందీ స్పష్టంగా గుర్తించవచ్చు. అంతులేని కష్టాన్ని ఎదుర్కొంటున్న మదర్ కరేజికి భవిష్యత్ మీద ఆశ పోలేదు.

రచన జర్మనుభాషలో వున్నా దానికి 'కరేజి' అనే ఆంగ్ల పదాన్ని రచయిత వాడటంలో కొంత విశిష్టత వున్నదనవచ్చు. తెలుగులో ఆ మాటకు అనుగుణమైన పదం దొరకలేదు. అంచేత రచయిత యిచ్చిన పేరునే వుపయోగిస్తున్నాము.

ఇలాటి అమూల్యమైన జర్మను రచనని జర్మను మూలము నుంచి తెలుగులోకి అనువదించి ఆంధ్ర పాఠకలోకానికి సమర్పించే అవకాశము కలిగించిన సాహిత్య అకాడెమీవారికి నా ధన్యవాదాలు.

—ఏ. యస్. శర్మ.

# రంగం, పాత్రల వివరణ

## రంగం :

మొదట అయిరోపాఖండంలో ఉత్తరదేశాలు. తరువాత మధ్య, దక్షిణ అయిరోపా దేశాలు. ముఖ్యంగా జర్మనీదేశం మధ్యభాగం వాతావరణంలో.

మధ్యయుగం ముగుస్తూ, ఆధునికయుగానికి దోహదమిస్తుందే 17 వ శతాబ్దం. ఆ కాలంలో జరిగిన యుద్ధాన్ని, ముప్పదిఏండ్ల యుద్ధం అవి చరిత్రకారులు పేర్కొన్నా ఆ నియమితకాలానికి మించిపోతుంది.

### ముఖ్యపాత్రలు :

మదర్ కరేజి : కథానాయిక. గుండె నిబ్బరంలో ఈమెకు పెట్టింది పేరు. అంచేతనే వీరమాత అని పేర్కొంటారు. పుట్టింది తూర్పుదేశాల్లో అయినా మదర్ కరేజి అనే పేరు సంపాదించుకున్నది, ఉత్తర దక్షిణ అయిరోపాదేశాలలో. అసలుపేరు అన్నా ఫియర్‌లింగ్ (Anna Fierling), యుద్ధభూముల్లో చిల్లర వ్యాపారం చేసుకొనటానికి స్త్రీలకు ఆ రోజుల్లో అనుమతి ఈయబడుతుండేది. అక్కడి భీభత్సానికి తట్టుకుంటూ ధైర్యసాహసాలతో ముందుకు నడవడంలో ఆమెదే పై చెయ్యి కావటంమూలాన మదర్ కరేజి అనే పేరు సార్థకమైంది.

క్రాటీన్ : మదర్ కరేజి కూతురు. పుట్టుకతో మూగ. యుద్ధం ఆ పిల్ల ముఖం వికారం చేస్తుంది.

అయిలిఫ్, స్విస్‌కాస్ : స్వంతపిల్లలు కాకపోయినా, పెంచి పెద్దవాళ్ళను చేస్తుంది మదర్ కరేజి. అంచేత ఈ ఇద్దరూ మదర్ కరేజి సొంత కొడుకులుగానే చలామణి అవుతుంటారు.

మిలిటరీ పాదరీ : జర్మనుదేశపు మనిషి. జర్మనీ మత మూఢవిశ్వాసాలు బాగా అలవడిపోయాయి. ఈయన మదర్ కరేజికి సహాయం చేయడానికి వస్తాడు.

# నాంది

యుద్ధం ఒకటి రెండు రోజుల్లో ముగిసేది కాదు. యుద్ధం గురించి క్షుణ్ణంగా అవగాహన చేసుకున్నవారు దానికి ఆద్యంతాలు లేవనే అంటారు. శత్రుసైన్యాలు చుట్టి ముట్టడిచేస్తున్న పరిసరాలు కూడా ఆ కోవకు చెందినవే. మదర్ కరేజి చిల్లరవ్యాపారం చేయడంలో చాలా దిట్ట. ఆమెది చిన్నకుటుంబం - ఒక కూతురూ, ఇద్దరు కొడుకులూ - యుద్ధరంగాలలో వ్యాపారం సాగించుకొనటానికి చాలా శిథిలావస్థలో ఉన్న బండిలో సరకులు పెట్టుకుని వెడుతూ ఉంటారు. అలా వెడుతూన్న సమయంలో అందరూకలిసి లోకంలో వ్యాపారసరళిని గురించి పాట పాడుతూ ఉంటారు. వాళ్ళపాటకు ప్రక్కతాళం వేస్తున్నవా అన్నట్లు బండిచక్రాలు సందడి చేస్తుంటాయి. బండి ముందు భాగంలో మదర్ కరేజి కూతురు - కాట్రీన్ - మూగపిల్ల - కూర్చుంటుంది. చేతిలో నోటితో ఊదే వాద్యం. దానితో వాళ్ళపాటకు అనుగుణమైన ప్రక్కవాద్యం మోగిస్తుంటుంది. ఆ పిల్లకు ప్రక్కనే తల్లి మదర్ కరేజి కూర్చుంటుంది.

మదర్ కరేజి పాట మొదటిభాగం పాడుతూంటుంది. బండిని లాగుతూన్న కొడుకులు ఇద్దరూ రెండవభాగం పాడుతూంటారు. ఎప్పుడూ తిరగడంవలన మదర్ కరేజి బాగా అలసిపోయినట్లు చూడగానే తెలుస్తుంది. పిల్లలుకూడా చాలా అలసినట్లు కనిపిస్తున్నారు. ఎంతోదూరం ఎండ వానలకు తట్టుకుంటూ ప్రయాణం చెయ్యాలి. గమ్యస్థానం అనేది ఒకటి ఉంటేగా !

"ఓహో అయ్యల్లారా, ఓహో పెద్దల్లారా !
సాగిపోక నిలవండి ! సేద తీర్చుకోండి !
ఓ సేనాపతులారా ! ఓ సమరప్రియులారా !
మీ రణదుందుభి నాపండి ! మా మనవి వినండి

రుచికర ఫలహారాలూ
రమ్యమైన బూట్లూ

చవిగల పాపీయాలూ
చక్కని మేజోళ్ళూ
మీరు కోరుకునే దినుసులన్నీ
విరివిగా సంతోషముగా
సరసమైన ధరలకు
ఓహో అయ్యల్లారా ! ఓహో పెద్దల్లారా
సాగిపోక నిలవండి.
సేద తీర్చుకొండి.
మీ రణదుందుభి నాపండీ.
మా మనవి వినండీ.
వసంతకాలం వచ్చింది.
ఆశలు చిగురిస్తాయి.
ఆనందం అందరకూ ఆనందం
ఇక యిది హెచ్చిస్తుందీ
వ్యవసాయం వ్యాపారం
వృద్ధిపొందుతుందీ
జగతిని క్రైస్తవధర్మం
జయం పొందుతుందీ
వసంతకాలం వచ్చింది.
ఆశలు చిగురిస్తాయి
ఓహో అయ్యల్లారా ! ఓహో పెద్దల్లారా !
సాగిపోక నిలవండి.
సేద తీర్చుకొండి
దుందుభి నాపండీ
మా మనవి వినండి.



# మొదటి రంగం

మదర్ కరేజి పేరుతో వ్యవహరింపబడుతున్న అన్నా ఫియర్‌లింగ్ చిల్లర వ్యాపారం చేసుకుంటూ తన మూగకూతురు కా(ట్రీన్, ఇద్దరు కొడుకులు, అయిలిఫ్, స్విజ్‌కాప్‌ల సహాయంతో ఉత్తరప్రాంతాలని చుట్టుతూంటుంది. అవి యుద్ధం రోజులు, 17 వ శతాబ్దంలో చరిత్రలో ప్రసిద్ధిగాంచిన ముప్ఫయిసంవత్సరాల యుద్ధ కాలం అది. 1624 సం॥ ప్రారంభములో. స్వీడనురాజుది అప్పుడు పై చెయ్యి. యుద్ధరంగం ఉత్తర అయిరోపాలో పోలండుదేశంలో. యుద్ధం జయప్రదంగా సాగించటానికి మనుషులు కావాలి. మిలిటరీ దళాధిపతి కెప్టెన్ ఓక్సెన్ తన అధి కార్లతో డాలర్నే అనే పట్నంలో మకాం చేస్తూంటాడు తన దళానికి అవసరమైన మనుషుల్ని సేకరించుకొనటానికి. ఇప్పుడు మదర్ కరేజి రావటం మిలిటరీవాళ్లు ఉన్న ఈ పరిసరాలకు వస్తుంది వాళ్ళతో పేచీ పెట్టుకోవలసి వస్తుంది.

[పట్టణానికి చేరువనేఉన్న రహదారి. ఆ పరిసరాలలోఉన్న వాడవాడలను చుట్టి వస్తూన్న మిలిటరీ దళవాయి, ఆయనమీద పెత్తనం చేస్తూన్న హవల్దారు చలి బాధకు ఆగలేక గడగడ వణికిపోతూ దోవప్రక్కన నిలబడివుంటారు.]

దళవాయి. ఇటువంటిచోట్ల మనం పనిచేయడం చాలా కష్టం. ఇంతకన్నా ఆత్మ హత్య చేసుకోడం మంచిదని మీకు నా సలహా. మన కెప్టెన్ వచ్చే పన్నెండో తారీఖునాటికి నాలుగుదళాలకు అవసరమైన మనుషుల్ని తప్పని సరిగా చేర్చమని హుకుం, ఈ చుట్టుపక్కలజనం ఉన్నారే ఇల్లాంటివాళ్ళని నా జన్మలో ఎప్పుడూ చూడలేదు. వాళ్ళని తలుచుకుంటూంటే రాత్రులు నిద్రపట్టదు. అయితేనేం ఇలాటి క్లిష్టపరిస్థితుల్లో నా పని తూ. చ. తప్ప కుండా చేస్తూన్నా ..ఒకడు దోవలో తారసిల్లాడు. వాడిని మంచిమాటల్తో బుట్టలో వేసుకున్నానని ఉబ్బి తబ్బిబ్బై పోయాను. అలాటివాళ్ళకి కావాల సినమందు మనకు తెలుసుగా. ఆ కబురూ ఈ కబురూ చెబుతూ తిన్నగా సారా దుకాణానికి తీసుకొచ్చాను. తనివితీరా తాగాడు. ఆ మైకంలో కాగి తాలమీద సంతకం చేశాడు. ఇచ్చినసొమ్ము చొక్కాలో భద్రపరుచు కున్నాడు. వాడు ఖాళీచేసిన బుడ్లు ఒకటిరెండు అయితేగా ! దుకాణంవాడికి డబ్బు ఇచ్చేందుకు వెళ్ళి తిరిగి వచ్చేటప్పటికి నాకళ్ళల్లో కారంకొట్టి పారి

పోయాడు ఆ భడవ! ఈ అలగా జనం యింతే! ఇలాటివాళ్ళమీద నమ్మకం ఎలా వుంటుందో మీరే చెప్పండి.

హావల్దారు ఈ వెర్రిబాగులవాళ్ళకి యుద్ధం అంటే ఏమిటో అసలే తెలియదు. ఇక వాళ్ళదగ్గర నుంచి నీతీ నిజాయితీ ఎలా ఆశించడం? నాలుగయిదు దశాబ్దాలనుంచి ఈ ప్రాంతాలలో యుద్ధాలు లేకపోవడంమూలాన వీళ్ళంతా కాళ్లుచాపుకొని హాయిగా కాలక్షేపం చేస్తున్నారు. అంచేత వీళ్ళబద్ధకం మితిమీరిపోయింది. యుద్ధం వాళ్ళబద్ధకాన్ని పోగొడుతుంది. అది సంపాదించాలనీ ఇది కూడబెట్టాలనీ ఆకాంక్ష ఎక్కువై పోతూన్నది. యుద్ధాలు లేకపోతే జనం దాడిచేసేది చెట్లు చేమలమీద! జంతుజాలంమీద! ఇంక పనిలేనట్టు అడవుల్లో, కొండల్లో, లోయల్లో తిరుగుతూ ఉండటం! పది డబ్బులు లభిస్తే దాంతో పొట్టనింపుకుని తృప్తిపడటం. ఈ పరిసరాల సంగతి కళ్లార చూస్తూనే వున్నాంగా! మిలిటరీ దళాలకి బాగా పనికివచ్చే కుర్రవాళ్లు. వాళ్ళకన్నా, ఎక్కువ ఉపయోగపడే గుర్రాలు ఇవన్నీ గమనించే పెద్దలు ఎవళ్ళయినా ఉన్నారా చెప్పండి? ఇలాటి చోట్లల్లోనే ఢంకాలు మ్రోగించాలి. అప్పుడే ఉత్సాహం పెరుగుతుంది. జనానికి సులభంగా అర్థమవుతుంది. అందుకు సంబంధించిన జాపితాలు తయారు చేసుకోవచ్చు. బూట్సులు ఎన్నో అవసరం ఉంటాయి. వాటికి కావాలసిన వస్తువులు తెచ్చేవాళ్ళకి, వాటిని కుట్టేవాళ్ళకీ ఊపిరాడకుండా పనివుంటుంది. కావలసినంత ధాన్యం, ఇతర భోజనసామగ్రి బస్తాలలోనింపి తీసుకువస్తారు. పుష్కలంగా చేతికి సొమ్ము లభిస్తుంది. అప్పుడు ఈ సన్నాయిలగొడవ చూసుకోనక్కర లేదు. వాళ్ళే ఎప్పుడూ మనల్ని ఆశ్రయించుకోవలసి వుంటుంది. యుద్ధమే లేకపోయిందా? అరాజకం! అంతా అరాజకం! అలాటప్పుడు జనాన్ని కట్టుదిట్టాల్లో పెట్టడం మనతరమా?

దళవాయి: ఊ! మీరన్నది నిజం. అక్షరాలా నిజం!

హావల్దారు: అన్నిటిలోలాగే ప్రారంభంలో యుద్ధపరిస్థితులు కొంచెం క్లిష్టంగానే ఉంటాయి. అయితేనేం? క్రమేణా వాటికి జనం అలవాటుపడిపోతారు. అలాటివాళ్లు యుద్ధం ముగిశాక ఇళ్ళకు తిరిగివచ్చారంటే వాళ్ళల్లో పెల్లుబికి పోయే అశాంతికి అంతూ పంతూ ఉంటుందా మరి?.... ప్రభుత్వాలు అది

శాంతికాలమని ఎంత ప్రచారం చేసినా సరే! జీవితం జూదం వంటిది. శాంతికాలంలో అందరిద్యాస యుద్ధాలు కావాలనే!

(మదర్ కరేజి బండి వస్తూఉంటుంది.)

దళవాయి : (చప్పున దోవకేసిచూస్తూ) హవల్దార్! హవల్దార్! అలా చూడు! బండి! అది ఇటుకేసే వస్తున్నది. (బండికేసి తదేకంగాచూస్తూ) ఇద్దరు ఆడవాళ్ళు! ఇద్దరు కుర్రవాళ్లు. బండి ఆపండి! ఇక్కడకూడా మనపథకం పారలేదా ఈ చలిలో ఉత్తచేతులతో తిరిగిపోవలసి వస్తుంది.

(బాకా శబ్దం వినబడుతుంది. కుర్రవాళ్ళు ఇద్దరు శిథిలావస్థలో ఉన్న కట్టెబండి లాక్కుంటూ ఇటుకేసి వస్తూంటారు. బండిలో కూర్చున్నది మదర్ కరేజి. ఆవిడ కూతురు మూగపిల్ల కాట్రీన్.)

హవల్దార్. (నిలుచున్నచోటినుంచి ముందుకు అడుగు వేస్తుంటాడు. బండి దగ్గరకు రావటంతో) ఆగండి! ఆగండి!

మదర్ కరేజి : ఏమండోయ్ హవల్దార్‌గారూ! ఎందుకు ఆగమంటున్నారు?

హవల్దార్ : (దారికి అడ్డంగా నిలబడుతూ) ఆగాలి! మిమ్మల్ని చూస్తూంటే అనుమానంగా ఉంది. ఎవరు మీరు?

మదర్ కరేజి : వ్యాపారస్థులం. ఎందుకు అనుమానం?

హవలార్ ఆ సామానేమిటి? ఎవరితాలూకు మీరు?

పెద్ద అబ్బాయి : రెండో ఫిన్‌రీజమెంటు* తాలూకు.

హవల్దార్ మీ కాగితాలు చూపాలి.

మదర్ కరేజి : ఏమంటున్నారు? కాగితాలా?

చిన్న అబ్బాయి : ఆమె మా అమ్మ. మదర్ కరేజి.

హవల్దార్ : ఎప్పుడో ఆ పేరు విన్నాం? మదర్ కరేజి అని ఎందుకు పిలుస్తారు ఆవిడని?

ఇద్దరు అబ్బాయిలు : కరేజి అని ఎందుకు పిలుస్తారా! రీగా* దగ్గర రేగుతూన్న

* స్వీడనురాజుకు సంబంధించిన దళం.

* రీగా పోలండుదేశానికి దగ్గరలోఉన్న దేశం ముఖ్యనగరం.

ఫిరంగుల మంటల్లోంచి సాహసంచేసి ముందుకు సాగింది బండిలోఉన్న రొట్టెలు కాపాడ్డానికి.

మదర్ కరేజి · కాలిపోయాయి. కాలి మసికాకుండా ఎలా వుంటాయి ఆ మంటల్లో నుంచి వెళ్లాలసి వచ్చినప్పుడు? అలాటిసమయంలో వేరేదారి ఏముంటుంది మీరే చెప్పండి?

హవల్దార్: (అసహనంతో) ఏమిటా అధికప్రసంగం? కాగితా లెక్కడ? మాకు చూపాలి?

మదర్ కరేజి: (తను కూర్చున్నచోటికి ప్రక్కనున్న తగరంపెట్టె తెరుస్తూ, లోపలి సామాను తిరగవేస్తూ) చూడండి ఇది బైబిల్! బయలుదేరటానికి ముందు కొనుక్కున్నవి. ఇవి దోసకాయ ముక్కలు, అది మోరాన్ దేశం* పటం. అది మా సొంతదేశం. తిరిగి ఈ రోజుల్లో అక్కడికి వెళ్ళే అదృష్టం ఉంటుందో ఉండదో ఆ దేవుడికే తెలియాలి. అంచేత పటం ఇప్పుడు మాకేం ఉపయోగించదు. ఇవి చూడండి. పిల్లులకు పెట్టే మందు. ఎంతో జాగ్రత్తగా సీలుచేసి వుంచా. పొరబాటున మా గుర్రం రుచి చూసిందా ఇంకేం ఉంది? మా దురదృష్టవశాత్తు అది విప్పులకి ఆహూతి అయిపోయింది లెండి! దానికోసం పదిహేను గూల్డన్లు* తగులబెట్టాను. అయినా ఆ నష్టం మాదికాదు లెండి!... ఇవి చాలా మరి?

హవల్దార్: ఏమిటా వేళాకోళం? నేనేం వెర్రివాణ్ణి అనుకున్నారా? ఈ కల్లి బొల్లి కబుర్లకు మోసపోయేందుకు? ఆ కాగితాలు మాకు పనికిరావు. మిలిటరీవాళ్ళదగ్గర వ్యాపారం చేసుకోటానికి లైసెన్సు కావాలి. ఆ సంగతి మీకు తెలుసా?

మదర్ కరేజి: ఏమిటా మాటలు? మా పిల్లలముందు మంచీ మర్యాదా లేకుండా? మీలాటివాళ్ళతో మాట్లాడటం అంటే నాకు తలనొప్పి. ఏమడుగుతున్నారు? లైసెన్సుసంగతి నాకు తెలుసా లేదా అనేనా? రెండో ఫిన్‌రీజిమెంటు వాళ్ళకు నా సంగతి బాగా తెలుసు. (లోపలినుంచి ఒక కాగితం తీస్తూ)

---

* తూర్పు ఐరోపాలో ఉన్న ఒక చిన్నదేశం.
* పశ్చిమ ఆయిరోపాలో చలామణిలోఉన్న నాణ్యాలు, ఒక గూల్డన్ (Gulden) మన లెక్కప్రకారం పదిరూపాయలు.

వాళ్ళ వ్రాత బ్రహ్మరాత! మీరు చదవలేరు. దానిమీద మీవాళ్ళ ముద్ర వేయటానికి ఎంతమాత్రం ఒప్పుకోను.

దళవాయి: హవల్దార్! ఈ మనిషి వాలకం ఆ గొడవ చూస్తూంటే మీరు అడిగిన ప్రశ్నలకు సరియైన జవాబు ఇచ్చేటట్లు కనబడటంలేదు. మన క్యాంపుకు తీసుకునివెళ్ళి చేయాల్సినపని చేస్తే అంతా చక్కబడిపోతుంది.

మదర్ కరేజి. (అతను చెప్పేది తనకు అర్థం కానట్లు నటిస్తూ హవల్దార్‌తో) ఆ మనిషి అంటూన్న దేమిటి?

హవల్దార్: అదంతా మీ కెందుకు? పేరు చెప్పు!

మదర్ కరేజి: అన్నా నా పేరు. ఫియర్‌లింగ్ ఇంటిపేరు.

హవల్దార్: ఈ పిల్లల ఇంటిపేరుకూడా అదేనా?

మదర్ కరేజి. ఆ ప్రశ్న ఏమిటి? అయోమయంగా ఉందండి. నన్ను ఫియర్ లింగ్ అని పిలుస్తారు. వాళ్ళ ఇంటిపేరు అది కాదు.

హవల్దార్: వీళ్ళంతా మీ పిల్లలు అని అనుకుంటున్నానే!

మదర్ కరేజి. తమాషాగా ఉన్నాయి మీ మాటలు! (పెద్ద అబ్బాయికేసి చూ పెడుతూ) ఇదిగో, వీడు ఉన్నాడే, వీడిపేరు అయిలిఫ్‌నోయొక్కి! ఎందు కంటే వాళ్ళనాన్న తన ఇంటిపేరు ఏ కోయొక్కొ మోయొక్కొ అని చెబు తూండేవాడు. వీడికి మంచి జ్ఞాపకశక్తి వుంది వీడి నాన్నకుమల్లే. ఆయన ఫ్రెంచిదేశపు మనిషి. పొడుగుపాటి గడ్డం ఉండేది. రైతుకుటుంబానికి చెందిన మనిషి. రైతాంగం చాకచక్యం వీడికి అబ్బకపోయినా లాగు తిర గేసి తొడుక్కోటం బాగా అలవాటు చేసుకున్నాడు. అలాగే ఆ రెండో వాడికీ ఈ పిల్లకూ వాళ్ళ ఇంటిపేర్లు వేరే ఉన్నాయి.

హవల్దార్: ఓహో! ఓహో!

మదర్ కరేజి. ఊ! ఊ! మీకు ఇదంతా క్రొత్తగాని వాళ్ళకు వాళ్ళపేర్లు బాగా తెలుసు.

హవల్దార్: (చిన్న అబ్బాయికేసి చూస్తూ) సరే, సరే. ఈ అబ్బాయి కళ్ళు చూస్తూంటే చీనావాళ్ళ పిల్లవాడిగా కనబడుతున్నాడే!

మదర్ కరేజి : మీ ఊహ శుద్ధ తప్పు. వీడు స్విస్* కుర్రవాడు.

హవల్దార్ . ఫ్రెంచివాళ్ళ అబ్బాయి ఎందుకు కాగూడదు మరి?

మదర్ కరేజి . ఏమిటా ప్రశ్న? వాడు ఫ్రెంచివాళ్ళ అబ్బాయి కాదన్నసంగతి నాకు బాగా తెలుసు. ఏ పిల్ల లెవరో గుర్తు పట్టలేక మీరు తికమకపడుతుంటే సాయంకాలంవరకు ఇక్కడే ఉండిపోవాలసి వస్తుంది. వీడు స్విస్‌వాళ్ళ అబ్బాయి. ఫియో వీడి ఇంటిపేరు వీళ్ళనాన్న ఇంటిపేరుకాదు అది. ఆయనిది మరోపేరు. కోటలూ, మేడలూ కట్టడం ఆయన వృత్తి. కాని తన తెలివితేటలు పనిపాటల్లో కాక తాగడంలో చూపెడుతూ ఉండేవాడు ఆ మహానుభావుడు! (ఆ మాటకు స్విస్ పిల్లవాడు కొంచెం ముఖం ముడుచుకుంటాడు. మూగఅమ్మాయి వీళ్ళనుచూస్తూ నవ్వుతుంటుంది.)

హవల్దార్ : వీడిని ఫియో అని ఎందుకు పిలుస్తారు?

మదర్ కరేజి క్షమించాలి. మీకు కోపంవస్తే రానీయండి. మీ బుర్రలు మందకొడిగా పనిచేస్తున్నాయని చెప్పటానికి విచారిస్తున్నాను. ఓం ప్రథమంలో వీడిని చూపింది హంగేరీదేశంలో, వీళ్ళ నాన్నతో నాకు పరిచయమైనప్పుడు. అప్పు డాయన సారాయివంక కన్నెత్తి చూసేవాడుకాదు. మంచి మాటకారి. ఆయనే వీడిని ఫియో అని పిలుస్తూండేవాడు. ఆ పేరే స్థిరపడిపోయింది.

హవల్దార్ : అంటే ఆ మనిషి ఈ అబ్బాయి తండ్రి కాదన్నమాట.

మదర్ కరేజి· తండ్రి కాకపోయినా ఆయన అలవాట్లు వీడికి బాగా వచ్చాయి. నేనుమాత్రం స్విస్‌కాస్ అని పిలుస్తుంటాను బండి లాగడంలో గట్టివాడు గనక. (కూతురిని చూపెడుతూ) దీనిని కాట్రీన్ హౌప్ట్ అంటారు. సగం జర్మనుపిల్ల.

హవల్దార్ : మీదంతా వింతకుటుంబంగా ఉందే!

మదర్ కరేజి : ఊ! అంచేతనే ఈ నా బండితో ప్రపంచమంతా సునాయాసంగా చుట్టి రాగలిగాను.

హవల్దార్ అదంతా నా నోటుపుస్తకంలో వ్రాసుకోవాలి. (చొక్కాలోనుంచి నోటుపుస్తకంతీసి ఏమేమో గబగబ వ్రాసుకుంటూంటాడు.)

---

* స్విట్జర్లాండ్‌ను సాధారణంగా స్విస్‌దేశం అని పేర్కొనటం అలవాటు.

దళవాయి : బండి లాగడం వీళ్ళకు బాగా తెలుసు కాబట్టి జాకోబ్ ఈశావ్ ఎద్ల జత* అని పిలిస్తే భేషుగ్గా ఉంటుంది. వీళ్ళఉత్సాహం చూస్తూంటే బండి కాడినుంచి వీళ్ళకి విముక్తి అక్కర్లేదనుకుంటా.

పెద్ద అబ్బాయి అయిలిఫ్ : అమ్మా! ఆ మనిషి అతివాగుడు ఆపాలంటే చెంప పగలగొట్టాలనిపిస్తోంది.

మదర్ కరేజి : (అడ్డువస్తూ) ఒరే అబ్బాయి! నోరుముయ్యి పెద్దవాళ్ళను అలా అనరాదు. (దళవాయికేసి నమ్రతతో చూస్తూ) మీరు గొప్ప ఆఫీసర్లలా కనిపిస్తున్నారు. మీవంటివాళ్ళకు పిస్తోళ్ళు అంటే ఇష్టం అనుకుంటా. నాదగ్గర మంచిసరుకు ఉంది. (హవల్దార్ బెల్ట్‌కేసి తదేకంగాచూస్తూ) ఏమండోయి ఆ పటకా అరిగిపోయిందే, బహుశా పాతవి వాడటం మీకు ఇష్టం కాబోలు! అయినా ఈకాలంలో అలాటి బెల్ట్ ఏం బాగుంటుంది? నాదగ్గర కొత్త బెల్ట్ ఉంది, చూస్తారా?

హవల్దార్ : (నవ్వుతూ) మాకు కావాలసిన సామాన్లు అవికావు. (పిల్లలవంక వ్రేలుచూపుతూ) వీళ్లు, వీళ్లే మాకు కావాలి. ఇద్దరు కుర్రవాళ్ళు! చేకు మానులకుమల్లే బాగా పొడుగ్గా ఉన్నారు. ఆ ఛాతీని చూస్తుంటే రాక్షసుల కన్నా బలవంతులుగా కనబడుతున్నారు. ఇలాటివాళ్లు యుద్ధానికి బాగా పనికి వస్తారు. ఇంతకాలం ఎందుకు తాత్సారం చేశారో అర్థం కావటంలేదు.

మదర్ కరేజి : (ఉద్రేకంతో) మా పిల్లల్ని యుద్ధానికి ఏమైనాసరే పంపను! ఫిరంగులకు ఆహుతి చెయ్యడానికి వాళ్ళని పెంచి పెద్దవాళ్ళని చెయ్యలేదు.

దళవాయి : ఏమిటమ్మా అలా అంటారు? యుద్ధానికిపంపితే ఏం తప్పు? వాళ్ళకు లాభం ఉంటుంది. పేరూ ప్రతిష్ఠలూ తెచ్చుకుంటారు. జోళ్లూ అవీ అమ్ము కోడం ఆడవాళ్ళపని. (పెద్దబ్బాయి అయిలిఫ్ భుజంతడుతూ) అబ్బాయి! ఇలా ముందుకు రా, నీ ఛాతీ చూస్తా.

మదర్ కరేజి : (ఆత్రుతతో) మా వాడిని చెడగొట్టకండి. వాడిగుండె చాలా బల హీనమైంది. ఎవరయినా వాడికేసి ఎగాదిగా చూశారా హడలి మూర్ఛ పోతాడు.

---

* బైబిల్ పాత నిబంధనగ్రంథంలో ,ముఖ్యపాత్రలు జాకోబ్ ఈసావ్. చాకిరివని చేయటంలో ఆ ఇద్దరూ పేరు పొందారు.

దళవాయి ఏ జంతువునో బలియిస్తే సరి, దాంతో ఆ మూర్ఛ గిర్ఛ మాయమై పోతుంది, లేచి నిలబడతాడు. (అయిలిఫ్‌ని ప్రక్కకు తీసుకుని నడవ బోతాడు.)

మదర్ కరేజి : ఏమండోయ్! ఉత్త భయస్థుడు. కొంచెం ఊపిరి పీల్చుకోన వియ్యండి, ...మీపనికిమాత్రం సుతరాం పనికిరాడు.

దళవాయి : ఊపిరి పీల్చుకోనిస్తానా? నన్ను అవమానపరిచాడు. ఆ ప్రక్క పొలం లోకి నడిచి మా బలాబలాలు చూసుకోవాలి. మాకు బాగా తెలుసు. ఇలాటి విషయాలు ఎలా పరిష్కరించాలో. . .

అయిలిఫ్ అమ్మా! అమ్మా! నువ్వు ఇందులో కలుగజేసుకోకు. నాకూ తెలుసు ఆ మనిషితో ఎలా మాట్లాడాలో.

మదర్ కరేజి : ఒరేయ్! నువ్వు ఇక్కడినుంచి కదిలావా?. . నేను ఎటువంటి దాన్నో నీకూ తెలియదు. ఆ మనిషిదగ్గర కత్తివుంది, దాంతో ఏం చేసినా చేస్తాడు.

దళవాయి : మీవాడిగురించి భయపడకండి. ఎలా దోవలోకి తీసుకురావాలో మాకు తెలుసు. (అయిలిఫ్‌తో) ఓయ్ అబ్బాయి! రా! వెళదాం.

హవల్దార్ : (దళవాయితో) వాడిని ఏం చేయకండి. (మదర్ కరేజితో) సైనికు డిగా చేర్చమంటే ఎందుకు భయపడతారు? వాళ్ళతండ్రి సోల్జరుగా! వీరు డిగా మరణించాడు కూడా! ఆ సంగతి మీరే చెప్పారు.

దళవాయి మిలిటరీలో మొట్టమొదట మంచి డ్రస్సు, టోపీ ఇస్తారు. కాళ్ళకు వేసుకోటానికి ఒకటోరకం బూడ్సులూ లభిస్తాయి. అవునా అబ్బాయి!

అయిలిఫ్ మీరిచ్చేవి నా కక్కరలేదు.

మదర్ కరేజి . చేపలు పట్టేవాడు తనదగ్గరఉన్నా ఎరతో అంటాడు 'తొందరగా గాలం పుచ్చుకుని వెళ్ళాలి. ఆలస్యంచేయక కదులు' అని (చిన్న అబ్బాయి స్విస్‌కావ్‌తో) ఒరే చిన్నవాడా! అటుకేషి త్వరగావెళ్ళి కేకవెయ్యి. వీళ్ళు మీ అన్నయ్యని బలవంతంగా తీసుకుని వెడుతున్నారని (తన ఒడిలో కత్తి ఒరలోనుంచి పైకి తీస్తూ) దీనిని బాగా చూడండి! మీ మీదికి విసిరేస్తా ఇలా చేశారంటే. వ్యాపారం చేసుకునేవాళ్ళం. చొక్కాలు, బట్టలు ఆహార

పదార్థాలు మంచివాళ్ళకు న్యాయమైనధరలకు అమ్ముకుని పొట్ట పోసుకుండే వాళ్ళం....

హవల్దార్ : హా, హా, మీ రెంత శాంతిప్రియులో ఆ కత్తిని చూస్తూంటేనే అర్థ మవుతున్నదిగా! దానిని వెంటనే దింపకపోయారా ఏమవుతుందో. ఆలో చించుకోండి. ఇంతకుముందు ఏమన్నారు! యుద్ధంమూలాన్నే జీవిస్తూ వుండేవాళ్ళమని. ఆ మాటకు కట్టుబడివుండాలి. యుద్ధం యథాతథంగా సాగుతూండకపోతే మీ పొట్ట గడవడం కష్టం. మీ వ్యాపారం సాగాలంటే వీరభటులు అవసరమన్నసంగతి మీరు గ్రహించాలి.

మదర్ కరేజి ఊ! మీరు అన్నది నిజమే. కాని మావాళ్ళే యుద్ధానికి కావలసి వచ్చారా?

హవల్దార్. (మందహాసంతో) ఆలా దోవలోకి రండి యుద్ధం అంటే భాగ్య లక్ష్మి! మీవాడికి పుష్కలంగా తిండి దొరుకుతుంది. మీ బేరాలూ చీకూ చింతా లేకుండా చక్కగా సాగిపోతాయి. ఆ సంగతి నేను చెప్పటం ఎందుకు? మీవాడినే ప్రత్యక్షంగా చూడనియ్యమ్మా....వీపేరు కరేజి అనేగా అన్నది. అటువంటి వీరమాతల పిల్లలు యుద్ధాలకు భయపడుతారా? వీళ్ళకేసి చూస్తూంటే వీళ్ల వీరపుత్రులని స్పష్టంగా తెలుస్తోంది.

అయిలిఫ్ ఊ! నాకేం భయంలేదు యుద్ధం అంటే.

హవల్దార్ ఎందుకో తెలుసా? నన్ను చూసేసరికే నాలోని వీరత్వం నీలో పొంగింది. పదహారేళ్ళ చిన్నవయస్సులోనే నేనూ మిలిటరీలో చేరాను.

మదర్ కరేజి. (నవ్వుతూ) ఇప్పుడుకూడా వయస్సు మీరినట్లు కనబడ్డంలేదే .. చూస్తూంటే దెబ్బయికూడా విందినట్లు లేదు.

హవల్దార్ : ఊ! అంతవరకు వోపికపట్టి వుండగలుగుతానులే!

మదర్ కరేజి. (మరింత నవ్వుతూ) ఆ! ఆ! గోతిలో పాతిపెట్టాకనే వోపిక మీకు లభించేది.

హవల్దార్ (మండిపోతూ) ఎమిటా మాటలు! నన్ను చావమనేగా ఆశీర్వ దించడం?

మదర్ కరేజి. నిజం చెపుతున్నందుకు ఇలా నామీద మండిపడడం బాగా లేదు.

మిమ్మల్ని చూస్తూంటే. ఆ సంగతి మీ నొసటిమీద స్పష్టంగా వ్రాసివున్నట్లు తెలుస్తూనే వుంది. మీ విగ్రహం స్వయంగా తాపీగా చూసుకుంటే అది ఎలాటి శవాకారమో మీ రే గుర్తించగలుగుతారు.

**స్విస్‌కాస్.** ఏమండోయ్! మా అమ్మసంగతి మీకు బొత్తిగా తెలియనట్లుంది. ఆవిడకి గొప్ప యోగదృష్టి వుంది. జరిగినసంగతులు జరగబోయేసంగతులూ మొహాలు చూడగానే చెప్పగలదు

**దళవాయి:** మీ అమ్మకే అంత అద్భుతశక్తివుంటే మా హవల్దార్ భవిష్యత్తు ఎలావుంటుందో చెప్పమను

**హవల్దార్,** ఇలాటి కట్టుకథలమీద నాకేమాత్రం నమ్మకం లేదు.

**మదర్ కరేజి** (మందహాసంతో) ఇది కట్టుకథో లేక నిజమో మీరు ఇప్పుడే తెలుసుకుంటారు .. మీ టోపి ఇలా ఇయ్యండి కొంచెంసేపు.

**హవల్దార్:** (తలమీది ఇత్తడిటోపీ తీసి ఇస్తూ) ఇందులో ఏముందని అలా అడుగుతున్నారు? ఉత్త ఇత్తడి రేకు. మీకు ఏమాత్రం పనికివచ్చేది కాదు. ... (నవ్వుతూ) అంత యిదిగా అడుగుతుంటే నాకు నవ్వు ఆగడంలేదు.

**మదర్ కరేజి:** (తన తగరం పెట్టెలోనుంచి దళసరి కాగితంతీసి ముక్కలు ముక్కలుగాచేస్తూ పిల్లలవంక చూస్తూ) యుద్ధం అంటే అంత ఉబలాటం పడిపోతున్నారా? చూడండి ఈ గట్టి కాగితంలాగే మీ ఉత్సాహమంతా ముక్కలు ముక్కలై చెల్లాచెదరై పోతుంది. ఇప్పుడే ఆ విషయమై మిమ్మల్ని హెచ్చరించటం మంచిది. (హవల్దారుతో) ఇది ఒక తంత్రవిద్య. పైసా ఖర్చుపెట్టకండా దీంట్లో మీరు పాలు పంచుకోవచ్చు. వీటికేసి చూడండి. జాగ్రత్తగా చూడండి ఈ ముక్కల్ని! ఒక ముక్కమీద నల్ల రంగుతో శిలువ* చిత్రిస్తా నల్లరింగు అంటే చావుకు సిద్ధంగా ఉండాలనిగా!

**స్విస్‌కాస్:** అమ్మా! అంటే ఇతరముక్కల్లో అలాటిరంగు ఉండదన్నమాట కదూ!

---

* శిలువ (క్రాస్) క్రీస్తు మరణచిహ్నం నల్లరంగుతో దానిని చిత్రించటంలో అశుభానికి సూచన అని క్రైస్తవదేశాలలో జానపదుల నమ్మకం.

మదర్ కరేజి : ఊ! . మీరంతా నాకేసి చూస్తూండండి. ఇవిగో ముక్కలు. వీటిని మడుస్తున్నాను ఆ! ఇప్పుడు మడిచినముక్కలు కలిపివేస్తున్నాను. అన్నిటిని ఆయన ఇచ్చిన టోపీలో ఉంచా. ఇలాగే వేరువేరుచోట్లలో పుట్టినా, ఒకేకంచంలో తింటూ కలిసిమెలసి వుండటం అవసరం. కొంచెం ఓపికపట్టండి. ఇప్పుడు చూస్తారుగా ఏమవుతుందో ?

(మదర్ కరేజి అంటూన్నమాటల అర్థం తెలుసుకోలేక హావల్దారు తికమక పడుతుంటాడు )

దళవాయి (ఒకమూల విలుచుండి అయిలిఫ్‌ని కబుర్లలోకి దింపుతూ) అబ్బాయి ! ఎవళ్ళనంటే వాళ్ళని మాపనిలోకి తీసుకోం. నేను ఎటువంటివాడినో మిలిటరీవాళ్ళకంతా బాగా తెలుసు.

హావల్దార్ : (మదర్ కరేజి చేతిలోఉన్న టోపీలో కలపబడివున్న ముక్కల్ని తట పటాయిస్తూ చూస్తూ ఒకదానిని తీసుకుంటాడు. దానిని విప్పిచూస్తాడు.... అయినా మేకపోతుగాంభీర్యం చూపుతుంటాడు) ఈ ఆట చూస్తుంటే మమ్మల్ని పిచ్చి పుల్లయ్యలుగా కట్టివేస్తూ ఉన్నట్లుంది

స్విస్‌కాస్ అంత తొందరపడకండి. మీరు తీసుకున్నది ఏమిటో తెలుసు అది నల్లశిలువ ముక్క ! ...(కొంచెం దూరంలో దళవాయితో నిలుచున్న అయిలిఫ్‌కేసి చూస్తూ) వాడు వెళ్ళిపోయేటట్లు ఉందే !

దళవాయి . (అయిలిఫ్‌తో) నువ్వుగనక తెలివిగా మసులుకున్నావా పైచెయ్యి నీదే అవుతుంది.

హావల్దార్ · (స్విస్‌కాస్ మాటలకు రేగిపోతూ) ఏమిటి అంటున్నాడు ? నన్ను అలా భయపెడతాడా ?

మదర్ కరేజి ఎందుకంత కోపం ? మీరు మిలిటరీలో చేరిననాడే అదంతా నిర్ధారణై పోయిందిగా ! దానిని ఇక తప్పించుకోటం మనతరమా మరి ? యుద్ధం యథాతథంగా నడుస్తూనే వుంటుంది. మనపని ప్రక్కతాళం వేయడమే ! ఇప్పటికే చాలా ఆలస్యమయిపోయింది. మన పని చప్పున ముగించుకోటం మంచిది.

హావల్దార్ . ఈ కల్లిబుల్లి కబుర్లతో మా పనినంతా చెడగొట్టేశావమ్మా. మీరు

ఎన్నితత్వాలు ఎన్నిమాటలు చెప్పినా సరే. మీ అబ్బాయిని మాతో తీసుకు పోతున్నాం. మంచి సై నికుడుగా తరిఫీదు ఇప్పిస్తాం.

అయిలిఫ్. (తను ఉన్నచోటినుంచి వాళ్ళదగ్గరకు ఉత్సాహంతో వస్తూ) నేను వాళ్ళతో వెడుతానమ్మా.

మదర్ కరేజి : నోరు మూస్తావా లేదా ఛడవా! ఈ పిచ్చి నీకూ పట్టిందా!

అయిలిఫ్ : నేనే కాదమ్మా, తమ్ముడుకూడా సోల్జర్ అవాలని ఉబలాటపడు తున్నాడు.

మదర్ కరేజి : (మండిపోతూ) ఈ పిచ్చివేషాలు ఎప్పటినుంచి? మీరూ ఇలా గంతులువేస్తూంటే మిమ్మల్ని ముక్కలు తీసుకోనమని చెప్పాలనివస్తుంది. (అక్కడినుండి బండి వెనుకకు గబగబ నడుస్తుంది. చీట్లమీద శిలువగుర్తు వేయటానికి )

దళవాయి : (అయిలిఫ్ని తనకేసి పిలుస్తూ) మా దళాలకు రాత్రింబగళ్లు చచ్చేటంత పని వుంటుందని మామీద అసత్యప్రచారాలు చేస్తూంటారు. అవన్నీ అబద్ధం. ఉత్త అబద్ధం. మాపేరు చెడగొట్టటానికి అలా కాకమ్మకథలు చెప్పటం వాళ్ళకు అలవాటు ఆదివారం వచ్చిందా చర్చికి వెళ్ళాలి. కాని అక్కడ వుండాలసింది కొంచెం సేపేలే! మన కంఠాలు బాగా ఉన్నాయో లేవో చూసుకోటానికి ఒకటి రెండు పాటలు పాడాలి. అంతే! అంతే! ఇతరసమయాల్లో యథేచ్ఛగా తిరుగుతూ ఉండవచ్చు.

మదర్ కరేజి. (వెనుకనుంచివస్తూ, కొత్తగా చింపిన ముక్కలు జాగ్రత్తగా మడుస్తూ టోపీలో ఉంచుతుంది. వాటిని కదలిస్తూ పిల్లలతో) వీళ్ళ మత్తు మందు మీమీద బాగా పనిచేస్తూ ఉన్నట్టుంది. జాగ్రత్త. యుద్ధం మిమ్మల్ని ముక్కలు ముక్కలుగా చీల్చివేస్తుంది. ఉండండి, ఉండండి, ఈ ముక్కలే మీ భవిష్యత్తు చెపుతాయి. "అబ్బాయి! అబ్బాయి! యుద్ధంలో మీ అవసరం మాకు చాలా ఉంది" అని లోకం మిమ్మల్ని ఎంతో ఆప్యాయంగా పిలుస్తోంది అనుకుంటున్నారు. (అయిలిఫ్ని పిలుస్తూ టోపీలోనుంచి ముక్క తీసుకొనమని పురమాయిస్తుంది.) అయిలిఫ్. తీసుకోరా. చూద్దాం నీ భవిష్యత్తు ఎలా వుంటుందో! (అయిలిఫ్ ముక్క తీసుకుని మడత

విప్పుతుంటాడు. దానిని చూడటంతో హడలిపోతూ, వాడిచేతినుంచి అమాంతంగా లాక్కుంటుంది ఆ ముక్కను దానినిచూస్తూ) అనుకున్నంత పనీ అయింది. వీడికే శిలువ వచ్చింది. వీడే సోల్జర్ అయ్యాడా. గడ్డి గీరవడంతప్ప మరి గత్యంతరంలేదు. అది తెలతెల్లంగా కనబడుతూనే వుంది. తండ్రికిమల్లే వీడిలోనూ పుట్టినప్పటినుంచే వీరత్వం పెల్లుబికివస్తూ ఉంది.

దళవాయి : (ఆమాటవింటూ దగ్గరకువస్తూ) ఇప్పుడు ఆ మాటమీద నిలిచివుండాలి. (చిన్నవాడితో) మీ అన్న కోరికని తూ. చ. తప్పకుండా తీర్చేబాధ్యత వీదోయ్.

మదర్ కరేజి : (చిన్నవాడిని పిలుస్తూ) ఒరే అబ్బాయ్! నువ్వుకూడా ఒక చీటి తీసుకో. వట్టి మాటకారివి! అందుకే నిన్ను చూస్తూంటే నాకెంతో దిగులుగా ఉంటుంది.

(స్విస్‌కాస్ టోపీలోనుంచి ముక్కతీసుకుని విప్పి, దానికేసి వింతగా చూస్తూంటాడు.)

ఎందుకలా విస్తుపోతున్నావు? అది వుత్తచీటే. క్రాసు వుండదని నాకు తెలుసు. (చీటి లాక్కుంటూ) అమ్మయ్యో! నీకూ ఈ శిలువచీటి వచ్చిందే. ఒరే అబ్బాయ్, నువ్వు ఎవళ్ళదగ్గర ఎలా మెలగాలో ఇప్పటినుంచి అయినా నేర్చుకోకపోతివా, నీ నోరే నిన్ను నట్టేట్లో ముంచివేస్తుందిరా. పసితనం నుంచి నేను హెచ్చరిస్తూనే ఉన్నాను ఈసంగతి. (హవల్దార్‌తో) మీరూ ఒకసారి చూడండి. ఇది క్రాసుచీటి అవునో కాదో!

హవల్దార్ : (చీటీ చూస్తూ) ఊ! క్రాసుచీటీ. నేనూ అటువంటిచీటీనే ఎందుకు ఏరుకున్నానో అర్థం కావడంలేదు. ఎవళ్ళకూ చూపకుండా దాచిపెట్టుకున్నా. (దళవాయితో) ఈవిడ ఈ తంత్రవిద్యతో మనల్ని మోసపుచ్చుతోంది. ఆవిడ పిల్లలమీదకూడా ఇది బాగా పని చేసినట్లుందే.

స్విస్‌కాస్ : ముందే చెప్పాగా నాకూ ఇలాటిచీటే తప్పక వస్తుందని.

మదర్ కరేజి : (కూతురుతో) నువ్వు ఒకదానివే మిగిలిపోయావు. నీ మొహం చూస్తూంటేనే తెలుస్తున్నదిగా నీకూ క్రాసు తప్పదని! అయినా నీ మనసు

మంచిది (టోపీ పైకి ఎత్తుతూ కదలిస్తూ తనే కూతురుకోసం ఒకచీటి ఏరుకూంటుంది) ఇలా పీకూవస్తే భయపడాలసిందే. నీ భవిష్యత్తు ఎటు వంటిదో ఇదే స్పష్టంగా చెప్పివేస్తున్నది. అయినా, కాత్రీన్ ! నువ్వు జాగ్రత్తగా మసులుకోవాలే ఇక మనం బండి ఎక్కాలి ఆలస్యం చేశామా మనం చేరుకోవలసినచోటు చేరుకొనటానికి చాలా ఆలస్యమవుతుంది.

(టోపీ తిరిగి హవల్దారుకు ఇస్తూ బండిలోకి ఎక్కుతుంది )

దళవాయి. (హవల్దారు చెవిలో) మనపని అయినట్లేగా!

హవల్దార్ : (భుజం తడుముకుంటూ మెల్లగా) ఇదంతా నాకు అయోమయంగా ఉంది నువ్వే ఆ గొడవ సరిచూసుకోవాలి

దళవాయి (చెవిలో) ఆవిడతో బేరం మొదలుపెట్టండి. (బిగ్గరగా) హవల్దార్ ! ఆ బెల్టు సంగతేమిటో కొంచెం చూసుకోండి. కొనుక్కోకపోయినా ఆవిడ దగ్గరనున్న వస్తువులు చూడాలి. వీళ్ళు న్యాయమైనవ్యాపారస్తుల్లాగే ఉన్నారు. (మదర్ కరేజితో) మీదగ్గరున్న పటకా మావాడి కొకసారి చూపండి. మావాడికి నచ్చితే కొంటాడు.

మదర్ కరేజి. వెల అర్ధ గూల్డన్.* ఇతరచోట్ల గూల్డన్‌కు పైగానే ఉంటుంది. (లోపలికి నడిచి సామాన్లు కదలిస్తూ ఆదరా బాదరాగా మిలిటరీబెల్టు ఒక దానిని చేతబుచ్చుకుని బయటికివచ్చి హవల్దార్‌కు అందిస్తుంది.)

హవల్దార్ : (బెల్టుకేసి ఎగాదిగాచూస్తూ) ఇది పాతసరకుగా ఉంది. ఆ ప్రక్కకు నడిచి జాగ్రత్తగా పరీక్షించాలి. (బెల్టుతో బండివెనుకకు నడుస్తూ) మీరు అనేధర న్యాయమే అనుకుంటా. కాని ...

మదర్ కరేజి · (అక్కడికి వస్తూ) అలా ఒప్పుకున్నందుకు సంతోషం. ఇలాటి సరుకు ఈరోజుల్లో దొరకటమూ చాలా కష్టం.

దళవాయి. (అయిలిఫ్‌తో) మనలో మన మాటోయ్ అబ్బాయ్. నిన్ను చూస్తూంటే సోల్జరుకు కావలసిన లక్షణాలన్నీ ఉన్నాయి. ఇదిగో కొంచెండబ్బు నీదగ్గర వుంచుకుంటే మంచిదోయ్.

(డబ్బు పుచ్చుకోటానికి అయిలిఫ్ తటపటాయిస్తూంటాడు.)

---

* అయిదు రూపాయలు.

మదర్ కరేజి : (బండివెనుక హవల్దారుతో) దీన్లో బేరాలు పనికిరావు. అర్ధగూల్డెన్. ఆ వెలకు తీసుకుంటే తీసుకోండి. లేకపోతే అంతకన్నా ఎక్కువ ఇచ్చి కొనేవాళ్ళు ఉన్నారు దమ్మిడీ తగ్గించను.

హవల్దార్ : ఆ సంగతి అలావుంచి ఈ క్రాసుగుర్తు నాకెందుకు వచ్చిందో ఇంకా అర్థం కావడంలేదు అలాటి అవాంతరాలు నాకు ఎన్నటికి రావని నొక్కి చెప్పగలను. నేనసలు యుద్ధరంగానికి పోవలసిన అవసరమే లేదు. ఇప్పటి ఈ నా ఉద్యోగం అటువంటిది. నా పని అంతా యుద్ధభూముల కవతలనే యుద్ధంలో పేరు ప్రతిష్ఠలు తెచ్చుకోవాలనుకునేవాళ్ళనే అక్కడికి పంపుతుంటాను మీతో ఇలా మాట్లాడుతుండటంమూలాన్ని ఈ వేళ పనంతా చెడిపోయింది ఇకనైనా మేము బయలుదేరడం మంచిది. మధ్యాహ్నం భోజనాలవేళకూడా కావస్తున్నది. ఏమంటారు? మీ బేర సారాలు చెడిపోయాయని తరువాత మామీద మండిపడితే ప్రయోజనం లేదు.

మదర్ కరేజి. ఎందుకలా తొందరపడడం? కొంచెం ఓపిక పట్టినంతమాత్రాన్ని మీ పనిపాటలు చెడిపోతాయా? ఆ! కొంచెం కొంచెం ఆగండి!....మా మూలాన మీరు అలసిపోయారు. ఒక గుక్కెడు మా సారాయి పుచ్చుకోండి. అలసట తీర్చుకోండి. (గ్లాసునింపి పానీయం ఇస్తుంది.)

(హవల్దార్ పుచ్చుకుంటాడు ఎంతో తృప్తిపడ్డట్టూ నటిస్తూ అక్కడే కొంతసేపు వుండిపోతాడు. ఆ మత్తులో జేబులోనుంచి దబ్బుతీసి ఇయ్యటానికి కష్టపడుతూన్నట్లు తాత్సారంచేస్తూ ఉంటాడు.)

దళవాయి (అయిలిఫ్ చెయ్యిపుచ్చుకుని ఒకప్రక్కకుతీసుకుని నడుస్తూ) ఈ పది గోల్డర్లు* ప్రస్తుతం నీ దగ్గర ఉంచుకో. నీ అదృష్టం పండిందోయ్ అబ్బాయి! పుట్టుకతోనే నీకు ధైర్యసాహసాలబ్బాయి. ఇప్పుడు వాటిని మా మహారాజుకోసం ఉపయోగించు. నీ ధైర్యానికి రాజనగరం ఆడవాళ్ళంతా ఉబ్బి తబ్బిబ్బైపోయి నీకోసం పెనగులాడుతూంటారు కూడా!

(మరోక్షణంలో అక్కడినుంచి ఇద్దరూ అదృశ్యమైపోతారు.)

---

* వందరూపాయలు.

(ఇంకా బండిలో కూర్చున్న కాట్రీన్ ఇదంతాచూస్తూ అమాంతం క్రిందికి దూకుతుంది. ఇటు అటూ కాలుగాలిన పిల్లికిమల్లె పరుగెత్తుతూ కేకలు వేస్తూంటుంది.)

మదర్ కరేజి అమ్మాయి! అమ్మాయి! ఏమిటే ఆ కేకలు! కొంచెం ఓపిక పట్టు. వస్తూన్నా, వస్తూన్నా ఈయన ఇచ్చే డబ్బు పుచ్చుకుని. (హవల్దార్ డబ్బు ఇస్తాడు అతను ఇచ్చినదానిని పరీక్షిస్తూ) డబ్బు అంటే మాకు కొంచెం అనుమానం. పుట్టినప్పటినుంచి ఇలాటి అనుమానాలే. .. ఊ ఈ నాణెం చెల్లుతుంది ఇక మేము బయలుదేరాలి. అమ్మాయి పిలుస్తున్నది. పెద్దబ్బాయి ఏడీ?

స్విస్‌కాస్: ఆ పెద్దమనిషితో ఎప్పుడో వెళ్ళిపోయాడే!

మదర్ కరేజి, (ఆమాటకు స్తంభించిపోతూ) అంత దద్దమ్మవై పోయావా? వాళ్లు వెళ్ళిపోతూంటే చూస్తూ ఊరకున్నావా? (కాట్రీనుతో) విన్నంటే ఏం ప్రయోజనం? మూగదానివి. వాడు పారిపోవటం చూస్తూన్నా నోరువిప్పి ఎలా చెప్పగలుగుతావు?

హవల్దార్: (కరేజివెంట బండి ముందుకువస్తూ) మీరూ ఈ బేరంమూలాన బాగా అలసిపోయారు. ఒక్కగుక్క పుచ్చుకోవాలి. అప్పుడు అంతా చక్కబడుతుంది. మిలిటరీపని అంత చెడ్డది కాదమ్మా. మీరూ యుద్ధం ద్వారా జీవనోపాధి సంపాదించుకోవాలి. అలాంటప్పుడు మీ పిల్లలని దాని నుంచి ఎలా దూరంగా ఉంచగలుగుతారు చెప్పండి?

మదర్ కరేజి: (కూతురుతో) నువ్వూ, మీ తమ్ముడూ ఇక కలిపి బండి లాగాలే. (కూతురు, స్విస్‌కాస్ కాడిపుచ్చుకుని బండిని లాగుతుంటారు. మదర్ కరేజి వాళ్ళవెంట నడుస్తూంటుంది. బండి ముందుకు పోతూంటుంది.)

హవల్దార్: (బండి ముందుకు కదులుతూండటం చూస్తూ) యుద్ధంద్వారా జీవించదలచేవాళ్లు కొంత త్యాగం చేయాలసి ఉంటుంది. అంతకన్న గత్యంతరం లేదు.....

•

# రెండవ రంగం

మదర్ కరేజిని, ఆవిడ పిల్లలను మొదటిరంగంలో మనం కలుసుకున్న తరువాత రెండు సంవత్సరాలు కాలచక్రంలో దొర్లుకుని పోతూంటాయి. ఇప్పుడు మదర్ కరేజీ జట్టును కలుసుకొనటం 1625-26 సం॥ మధ్యకాలంలో. స్వీడిష్ దళాలవెంట కరేజి తన వ్యాపారం చేసుకుంటూ యుద్ధవాయువులు ఇప్పుడు ప్రవేశిస్తూన్న పోలండుప్రాంతాలకు వస్తుంది. ఆమె వ్యాపారమంతా స్వీడనురాజు దళాలు మకాం చేస్తూన్న శిబిరాలదగ్గర. మిలిటరీ దళవాయితో పరారయిపోయిన పెద్దకొడుకు అయిలిఫ్‌ని ఇక్కడి మిలిటరీక్యాంపులో తిరిగి చూస్తుంది. ఇక్కడి శిబిరం వంటమనిషితో ఆవిడకు పరిచయమవుతుంది దాంతో వ్యాపారం అతి చాకచక్యంతో చేసుకోగలుగుతుంది.

[యుద్ధదళం కెప్టెన్ మకాం చేస్తూవచ్చి దేరా. దానికి చేరువనే వాళ్ళ వంటశాల. చుట్టుప్రక్కల ఫిరంగుల రణగొణధ్వనికి అంతే వుండదు. మదర్ కరేజి కోడిపుంజు వంటమనిషికి చూపుతుంది. పుంజు బేరంవిషయంలో తర్జనభర్జన జరుగుతూంటుంది ]

వంటమనిషి (కరేజి తెచ్చిన కోడిపుంజు బాగా బలిసింది. దానిని పుచ్చుకుని పరీక్షిస్తూ) ఎంత అంటావు? అరవై హెల్లర్లా?* ఇది పనికిమాలింది. ఎంత వెలా?

మదర్ కరేజి: ఏమిటీ? ఇది పనికిమాలిందా? ఇంత బలిసినపుంజు ఈ రోజుల్లో ఎక్కడ దొరుకుతుందో చెప్పండి? మీ ధోరణిచూస్తే దీన్ని కారు చౌక ధరకు కొట్టెయ్యాలని చూస్తున్నారు...ఊ! మీ కెప్టెన్‌ని చూస్తూనేఉన్నాను. పాపం! సరియైన తిండిలేక మాడిపోతున్నాడు. సరిగా సమయానికే వచ్చా. మధ్యాహ్నం భోజనానికి ఇదీ ఆ పెద్దమనిషికి బాగా సరిపోతుంది. అరవై ఇచ్చుకోటానికి ఆయన పిసినారి అనుకుంటున్నారా?

వంటమనిషి: నన్ను ఏమార్చాలనుకుంటున్నావా? ఇక్కడికి దగ్గరనే కొట్టు ఉంది. అక్కడ పదికి సునాయాసంగా తెచ్చుకుంటా.

---

* పోలండుప్రాంతం దబ్బు వేరయింది. హెల్లర్ అనే నాణెం అక్కడ చలామణిలో ఉంది. ఒక హెల్లర్ ఇంచుమించు ఇప్పటి మన రూపాయ విలువంత.

మదర్ కరేజి. ఆః తః నాతో చెబుతున్నావా ఆ మలుపులో కొట్టు ఒకటివుంది అనే కాకమ్మ కథ. దేశమంతా మీవాళ్ళ అజమాయిషీలోనే ఉంది. జనం ఇక్కడ వుంటేగా! వాళ్ళంతా మలమల మాడిపోతూ ఆకుఅలాలు తింటూం డటం, అడవుల్లో కలదాచుకోడం కళ్లార చూస్తూనే వున్నాను. చౌకబారు తిండిసామాన్లు చేత చిక్కించుకోవాలంటే విశేషంగా అక్కడికే నడ వండి. పందికొక్కులు పట్టుకోండి. ఆ పనికీ అయిదారుగురు మనుషుల బలం ఉండాలి'...చూస్తే ఏదో పెద్దమనుషుల్లాగే ఉన్నారు. అంచేత ఏదయి ఇచ్చుకోండి.

వంటమనిషి: అదేం లాభం లేదమ్మా. ఈ దేశమంతా ఇప్పుడు మాది. మా ఇష్టం వచ్చినట్లు అన్నీ ఏర్పాటు చేసుకుంటాం.

మదర్ కరేజి. నాకా ఆ సంగతి చెబుతూండటం? ఇక్కడివాళ్ళసంగతి నాకు తెలుసు. ఇటుకేసి మీరు ప్రత్యక్షమవటంతోటే వాడవాడలజనం వాళ్ళ వాళ్ళసామానుగట్రా ఇతరచోట్లకు తరలించుకున్నారు. ఇప్పుడు అక్కడ ఏం లేదు. నేను వస్తూన్నది చాలా దూరాన ఉన్న రైతులదగ్గరనుంచి. ఇప్పుడు వాళ్ళదగ్గరా ఏం దొరకదు.

వంటమనిషి: వాళ్ళకి పుష్కలంగా ఉంది. ఇతర్ల కంట పడకుండా దాచేస్తున్నారు.

మదర్ కరేజి: (తనదే ఇక పైచెయ్యి అనే విజయగర్వంతో) దాచేస్తున్నారా? అసలు ఉంటేగా దాచెయ్యటానికి. యుద్ధం వాళ్ళని ముంచివేసింది. కళ్ళారా చూస్తూనేవున్నాను వాళ్ళ యమబాధలు. ఈ పుంజుని మీకోసం సంపా దించా. ఇలాటిది ఈరోజుల్లో మీకు ఎక్కడ దొరుకుతుందో చూస్తాగా.... ఆలస్యమవుతున్నది. ఎంతసేపని ఇక్కడ ఉండటం? సరే! సరే! వల బైకి పుచ్చుకోండి.

వంటమనిషి: ఒకటే ఒకమాట. ముప్పయికి ఇస్తే తీసుకుంటా. లేకపోతే తిన్నగా బయటికి నడు.

మదర్ కరేజి: మధ్యాహ్నం భోజనం బాగా వండిపెట్టకపోయారా ఆ పెద్దమనిషి మీ తల నరికివేస్తాడు.

(బేరం చేస్తూన్న ఆసమయంలో వంటాయన పుగాకు గొట్టంతీసి ముట్టిస్తూ పొగ విడుస్తూంటాడు.)

ఏమయ్యోయి! ఇప్పుడు పైపు ముట్టించావేమిటి? ముందు బేరం పూర్తి కానియ్యి.

వంటమనిషి: పైపులో ఉన్నంత హుషారు మరి దేన్లోనూ లేదు. (పైపు గొప్పతనం చెప్పుకోటానికి తన పైపుపాట పాడుతాడు)

"పైపు పైపే. ఇంకోటి ఎందుకు అది ఉన్నంతవరకు?
రాజకీయాలన్నీ అందులోనే వున్నాయి!
అన్నీ బుర్రల్లోకి దొర్లుతాయి పైపు పుచ్చుకుంటే
పుగాకు, పుగాకు, పుష్కలంగా దొరకాలి
పెళ్ళి, పెళ్ళి, అప్పుడే ఆలోచిస్తా
సొమ్ము! సొమ్ము! బోలెడు చేరుస్తా
మాటామంతికి,
ప్రేమకలాపానికి
దోహదమిచ్చేది అదే, అదే!
నేస్తాలని చేరదీసేది అదే, అదే,
యౌవనం ఇచ్చేది అదే, అదే,
ప్రాజాన్ పట్నంలో ఉంటున్న రోజుల్లో
ఆ గొడవ ఎంతో కాలం క్రిందటనే,
ఒకావిడ మండిపడింది నామీద
ఆవిడ కోపతాపం ఇంతంతా మరి?
ఆ రోజుల్లో ఎంతో బుద్ధిమంతుడ్ని
పుగాకు కొనడం మానేశా
మంచివాళ్లు, ముఖ్యంగా క్రైస్తవులు
చేయాలసింది అదేగా
అదేగా చేయాలసింది!
అంత త్యాగం చేసినా
ఆవిడనోరు కట్టివేస్తేనా మరి?
అప్పుడు అనుకున్నా
ఈ పైపే మంచిమందు అని.

పైపు పుచ్చుకున్నా తిరిగి,
ఆవిడ ముఖంకేసి ఓపశాన చూశా
నోరువిప్పా. చప్పున విప్పా;
'నా పైపుచూడు', అన్నా ఆవిడతో,
పైపు ఎప్పుడు పుచ్చుకుంటా
అప్పుడే యౌవనం వస్తుంది
తెలివి తేటలకూ దోహమిస్తుంది.''

నా గొడవ నాదీ, దాంతో విమ్మ ఆపటమెందుకు? ముప్పయి; అంతకు మించి ఒక కాసూ ఇవ్వను.

(మదర్ కరేజి ఆ ధర నచ్చనట్లు తల అడ్డంగా త్రిప్పుతుంది వంట మనిషి పుంజు అక్కడేవుంచి దగ్గర వంటసామాన్ల పెట్టెలో సామాన్లు తిరగవేస్తూ మాంసంముక్క ఒకటి పైకి తీస్తాడు. కొయ్యపలక ముందు వేసుకుని కత్తితో మాంసం చిన్నచిన్న ముక్కలుగా చేస్తూ)

ఇవ్వాళ ఇదే భోజనానికి. గొడ్డుమాంసం; ఎప్పుడు కొంటేనేం? బాగా వేయిస్తే భేషుగ్గా ఉంటుంది. భోజనాలవేళ కెప్టెన్ ధ్యాస బల్లమీద నేమ అమర్చే భోజనం వస్తువులమీద ఉండదు. అంతాయుద్ధం మీదే. తిండి జ్ఞాపకం వచ్చినప్పుడు ఒక్కొక్కముక్క పుచ్చుకుని నములుతూ ఏదో విధంగా కాలక్షేపం చేస్తూండగలడు.

మదర్ కరేజి: (అతను చేస్తూన్న పనికేసి చూస్తూ) ఆ మాంసం ఆకారం చూస్తూంటే సంవత్సరం, రెండు సంవత్సరాలక్రిందట కొన్నట్లుంది. గట్టి కొయ్య; వేయిస్తే సరిపోతుందా?

వంటమనిషి: ఏమిటన్నావు? సంవత్సరంక్రిందట కొన్నానా? నిన్న సాయంకాలం సప్లయి చేశారు. ప్రక్కపొలాల్లో గొడ్డును కళ్ళారా చూశాను. దాన్ని పట్టి చంపటంకూడా చూశాను.

మదర్ కరేజి: అలా అయితే బ్రతికివున్న రోజుల్లోనే దాని ఒళ్ళు గట్టి కొయ్యగా మారిపోయి ఉండాలి.

వంటమనిషి. ఇలాటివి బాగా ఉడికేదాకా పొయ్యిమీద ఉంచుతా....

మదర్ కరేజి: (మాటకు అడ్డువస్తూ) నాకూ ఇలాటి వంటా గింటా అలవాటే. పూర్తిగా ఉడికేదాక ఉంచటం ఎందుకు? ఒకే చిటికె; కొంచెం మిరి

యాలపొడి కలపండి. పవిలో పవిగా వెల్లుల్లిపాయలనుకూడా కలపండి. ఈ పాడుకంపు కనుక్కోలేరు...పరధ్యానంగా ముక్కతరవాత ముక్క తింటా రన్నారుగా.

(ఆ సమయంలో కెప్టెన్ డేరాలో సందడి. లోపలికి కెప్టెన్, మిలిటరీ ఫాదరీ, అయిలిష్ ప్రవేశిస్తూంటారు. బయట ఫిరంగులశబ్దం. శిబిరంలోని వాళ్ళని హెచ్చరించటానికి బాకాలు ఊదుతూంటారు.)

కెప్టెన్: (అయిలిష్ వీపు ఆప్యాయంగా తట్టుతూ) అబ్బాయి! ఇవ్వాళ నువ్వు నాకు అతిథివి. నా కుడిప్రక్కన కూర్చోవాలి. యుద్ధంలో నువ్వు చూపిన శౌర్యం చాలా గొప్పదోయ్. నీ వ్యక్తివిశ్వాసాలు స్పష్టంగా ప్రదర్శించావు. ఈ యుద్ధం అంత సామాన్యమైంది కాదు. మన ధర్మాలకు అడ్డం వస్తున్న శత్రువులనుంచి జనాన్ని రక్షించటానికి సాగిస్తున్న యుద్ధమోయి ఇది. భగవంతుడే నిన్ను ప్రేరేపించాడు ఈ మహత్కార్యంలో నువ్వు నీ ప్రతాపం చూపాలని. ఇక్కడికి దగ్గరగాఉన్న పెద్దవూరు పూర్తిగా స్వాధీనం చేసుకున్నాక బంగారు చేతికడియం నీకు బహుమతిగా ఇయ్యా లని నిశ్చయించుకున్నా. మనం ఈ ప్రాంతాలకు వచ్చింది వీళ్ళ ఆస్తి పాస్తులేకాక, వీళ్ళ ఆత్మలనుకూడా కాపాడటానికి...కాని ఈ భడవలు మనరాకకు కారణం అర్థం చేసుకుంటేగా! వీళ్ళబుర్రలు పశువులకన్నా అధ్వాన్నం. మనం రావటం తెలుసుకుని గొడ్లని పరాయిచోట్లకి తరిమి వేశారు. స్థిరాస్తులు ఎక్కడ దాచారో మరి? ఇలాటిమాయల్లో వీళ్ళకన్నా వీళ్ళ ఫాదరీలే రెండు ఆకులు ఎక్కువ చదివినట్లున్నారు. పైకి నీతి, ధర్మం బోధిస్తున్నామని చెప్పటం, లోపల వీళ్ళ అవినీతిపనులకు దోహదమిస్తూ ఉండటం...అబ్బాయి! ఇలారా...ఇక్కడ కూర్చో. ఈ విజయంకోసం మంచిపానీయాలు అప్పుడే తయారుచేసి వుంచారు. చీకూ చింతా లేకుండా వీటిని రుచిచూద్దాం రా. (బల్లదగ్గర కూర్చుని గ్లాసులు, గ్లాసులు పూర్తి చేస్తూంటారు ఒకవైపు కెప్టెన్. ఇంకోవైపు అయిలిష్.) అయిలిష్! మన ఫాదరీ మనతో పుచ్చుకోటంలేదని బాధపడవద్దు. ఆయనికి ఇవి అట్టే ఇష్టం లేదు. మనకు దూరంగా ఆ మూల కూర్చోటం అందుకే. భోజనం వస్తుంది ఇంకో క్షణంలో. ఏదేది ఇష్టమో సంకోచంలేకుండా పుచ్చుకో.

అయిలిఫ్ : మాంసం ఏదైనా ఫరవాలేదు... అంతకన్నా మరేం దొరుకుతుంది ఈ రోజుల్లో.

కెప్టెన్ : (వంటమనిషిని పిలుస్తూ) మాంసం ! మాంసం ! మంచిది వండి తీసుకుని రా.

వంటమనిషి : (మదర్ కరేజితో) ఆయన హుకుం వింటున్నావు కదూ ! ఎవళ్ళనో భోజనానికి పిలుచుకుని వచ్చినట్లుంది. మంచి భోజనం అమర్చటానికి వీలైన సరంజాం ఏదీ ఇవ్వాళ లేదే.

(కరేజి మౌనం వహిస్తుంది. దాంతో వంటమనిషి ఏమీ తోచక ఉక్కిరి బిక్కిరై పోతుంటాడు.)

అయిలిఫ్ : రైతులమీద దాడి చెయ్యడంమూలంగా నాకు ఆకలి ఎక్కువైంది.

మదర్ కరేజి : (కొడుకుకంఠం వినటంతో కూచున్నచోటినుంచి చప్పున లేస్తూ) ఊ ! ఊ ! అది అయిలిఫ్ గొంతు.

వంటమనిషి : ఎవరా అయిలిఫ్ ?

మదర్ కరేజి : మా పెద్ద అబ్బాయి. రెండేళ్ళక్రితం నన్నేమార్చి పత్తాలేకుండా మాయమయ్యాడు...ఇక్కడ, మీ కెప్టెన్ డేరాలో వాడిగొంతు వినడం ఆశ్చర్యంగా ఉంది. వాళ్ళమాటలు వింటూంటుంటే కెప్టెన్ వాడిని భోజనానికి పిలుచుకుని వచ్చినట్లుంది. ఇవ్వాళ విందు బాగా ఉండాలి. ఈ పాడు కొయ్యముక్కలతో అతిథుల్ని విందుకు పిలవడం అవమానం. ఇప్పుడైనా కోడిని తీసుకుని వండు. వచ్చిన అతిథి మావాడు కాబట్టి ధర తగ్గిస్తా. ఒక్క బంగారుకాసు* ఇచ్చినా చాలు.

కెప్టెన్ : (అయిలిఫ్‌ని, మిలిటరీ ఫాదరీని భోజనాల బల్లముందు, తనకు కుడివైపున ఎడమవైపున కూర్చుండబెట్టి గావుకేకలతో) వంటబ్బీ ! చప్పున రుచిగా ఉండే మాంసం తీసుకురా. ఆలస్యం చేశావా చావదంతా.

వంటమనిషి : (ఆ కేకలు వింటూ) చిత్తం, చిత్తం. (కరేజితో) అటు గొయ్యి. ఇటు నుయ్యి. ఏం చేద్దాం. ఏదో ఒకధరకు ఒప్పుకోవాలి. లేకపోతే చంపి వేస్తాడు.

---

* 50 హెల్లరులు ఒక బంగారు నాణెం.

మదర్ కరేజి : అలా దోవలోకి రావాలి.

వంటమనిషి : ఇంకేం చేయగలుగుతా? ఇలా ఇయ్యి దానివి. ఈ పాపపరిహారార్థం ముప్పయి ఇచ్చుకుంటాం.

మదర్ కరేజి ఆ పప్పు నాదగ్గర ఉడకదు. చెప్పాగా బంగారుకాసు అవి. ఇవ్వాళ మావాడు మీ కెప్టెన్ అతిథి. ఒక్క బంగారుకాసు ఇచ్చుకోడం ఆయనకు అంత కష్టంకాదు కూడా!

వంటమనిషి : నీ పట్టేపట్టు! ఇంకేం చేస్తా. దానిని వండటానికి నువ్వొ సహాయం చేయాలి పొయ్యి అంటిస్తా.

మదర్ కరేజి. (కోడి రెక్కలు పీకివేస్తూ) ఈ కొత్తవేషంలో మావాడు ఎలా వుంటాడో కళ్లార చూడాలి. తెలివిగలవాడు. ఎలాటివాళ్ళనైనా దబాయించ గలడు. వయస్సులో చిన్నవాడే. అయితేనేం? కూతురు అమాయకురాలు. అదీగాక మూగది. అది ఒకవిధంగా నాకు మంచిదే అనుకుంటా. అదే మాటకారి అయివుంటేనా ఇంకేం వుంది?

కెప్టెన్. ఏమిటోయ్ అలా సిగ్గుపడతావు? ఇలాటి పావీయమంటే నా పంచ ప్రాణాలూ లేచివస్తాయి. నా పవిపాటలకి అది బాగా సహకరిస్తుంది.

(ఫాదరీవంక ఒక్కక్షణం చూస్తూ) ఫాదరీ అంతవిచారంగా ఉంటే మనమేం చేయగలం? అది ఆయన స్వభావం. ఆయన ధ్యానంతా ఎలాటి కబుర్లుచెప్పి మనవాళ్ళని అదుపాజ్ఞల్లో ఉంచుకోవాలి-అనే! కొన్నిసమ యాల్లో పప్పులో కాలువేయటంకూడా ఆయనకి అలవాటే! ఆ గొడవంతా ఇప్పుడు మనకెందుకు చెప్పు? ఏదీ హుషారుగా చెప్పు. ఆ రైతుల్ని ఎలా హతమార్చావో. వాళ్ళ పశువులవి ఇంత సులభంగా ఎలా స్వాధీనం చేసు కున్నావో. నువ్వు స్వాధీనం చేసుకున్న గొడ్లూ గోదలూ త్వరలో మన కొట్టాలలోకి చేరుతాయని అనుకుంటా.

అయిలిఫ్ : ఊ! రేపు, కాకపోతే ఎల్లుండి ఇక్కడికి మనవాళ్ళే తోలుకువస్తారు.

మదర్ కరేజి. మావాడు చాలా గట్టివాడు. రేపో ఎల్లుండో వస్తాయంటున్నాడు. ఇవ్వాళే వచ్చివుంటే ఈ అపరూపమైన పుంజుమాంసం రుచిచూచే అదృష్టం ఉండేదికాదు మీకు.

అయిలిఫ్ : అసలు కథ ఇది. ఈ ప్రాంతాలరైతులు వాళ్ళ పశువులని పశ్చిమ ఐరోప దేశాలకి తరలిస్తుంటారు రాత్రిళ్ళల్లో-దగ్గరలో ఉన్న అడవుల్లో జాగ్రత్త పరచటానికి, అంతులేని రహస్యస్థలా లున్నాయి అక్కడ. అలాటిచోట్లల్లో దాచటానికి మంచి కట్టుదిట్టాలు చేయటంలో గట్టివాళ్ళు ఇక్కడిరైతులు. పట్నవాసాల దళారులు చీకటిపడేటప్పటికే అటుకేసి నడుస్తూ వాటిని వాళ్ళ కొట్టాలలోకి తరలించుకోటంకూడా చాలా చిత్రంగా ఉంటుంది ఇలాటి తతంగంలో నేనూ వాళ్ళకన్నా రెండాకులు ఎక్కువే చదివాను అటుకేసి వెడుతున్నసమయంలో ఈ గుట్టంతా కనుక్కున్నా నాతో వస్తూన్నవాళ్ళ ఆలోచనలంతా వాటిని చూడగానే అక్కడే వాటిని మాయంచేయాలని. అలాటి ఆలోచనలు వాళ్ళకి సహజమేగా! ఎన్నాళ్ళయిందో అలాటి గొడ్లను మాసి. ఈరోజుల్లో మాకంతా రేషనేగా! అదీ ఇక్కడికివచ్చాక నీళ్ళమీద కూడా! మామూలు తిండీ తిప్పల అదృష్టం లేకపోయినా రెండు మూడు చెంబులతో తృప్తిపడిపోవాలని ఆర్డర్లు! ఇంకేం! గొడ్లను చూడగానే విందుభోజనం రెండురోజులు ...

కెప్టెన్ : నీ ఎత్తు అతిహాస్యం చవిపెట్టడం అద్భుతం

అయిలిఫ్ అదంతా గొప్పపనేం కాదు. కాని ఆ రైతుల అఘాయిత్యంమాటల్లో చెప్పలేం. మమ్మల్ని చూడగానే బందిపోటుదొంగలకిమల్లె అమాంతం మామీద పడ్డారు నలుగురు నామీద వస్తారు. ఇనుపదువ్వలతో బాదసాగారు. అప్పుడేం చేయాలి? ఆ శిక్షలకు లొంగటమా? లొంగానా ముక్కలు ముక్కలు చేస్తారు నన్ను. అలాటి హత్యాకాండలకు వాళ్ళకి పెట్టింది పేరు.

కెప్టెన్ (ఆతృతతో) అప్పుడు నువ్వేం చేశావు?

అయిలిఫ్ : నొప్పితో బాధపడుతూఉన్నా వాళ్ళకేసిచూస్తూ పొట్ట పగిలేటట్లు నవ్వాను.

కెప్టెన్ : ఎందు కలా నవ్వావు?

అయిలిఫ్ : నవ్వక మరేం చెయ్యాలి అలాటి ప్రమాదావస్థలో వాళ్ళకీ ఆశ్చర్యం వేసింది. నాకేసి విస్తుపోయి చూడసాగారు. "దద్దమ్మల్లారా! దొంగను కాను. మీ పశువులు కొనటానికివచ్చిన దళారిని" అన్నాను దాంతో వాళ్లు కొట్టడం ఆపేసి క్షమార్పణ కోరారు. పశువు ఒక్కొక్కటి ఇరవై బంగారుకాసులు అంటూ బేరానికి దిగారు. అంతసొమ్ము అడగడం న్యాయం

కాదని వదిహేనుకన్నా ఒక దమ్మిడీ ఎక్కువ ఇయ్యనన్నా. ఇక వాతో బేర మాడటం మంచిది కాదనుకుని. వాళ్ళ అలవాటుప్రకారం రెండుచేతులతో తలలు గోక్కోడం ప్రారంభించారు. వాళ్ళు వాడిన ఇనుపసువ్వలు క్రింద పడివుండడం చూశా. ఆ తరువాత ఆలస్యం చేయకుండా ఒకదానివి పుచ్చు కుని ఆ నలుగురిని చావమోదాను. అలాటిసమయాల్లో అవేగా బ్రహ్మాస్త్రాలు వాళ్ళరోగం కుదర్చటానికి!

కెప్టెన్. (ఫాదరీతో) ఈ అబ్బాయి చూపిన ధైర్యానికి మీరేమంటారు?

ఫాదరీ: బైబిలులో ఇలాటిఘట్టాలు సమర్థించటానికి ఇదమిత్థమని ఏం చెప్పక పోయినా క్రీస్తు ప్రభువు రొట్టెలతో మాపెట్టిన అమృతాన్ని ఉదాహరణంగా తీసుకోవచ్చు. ఒక దువ్వతో అయిదుగురిని హతమార్చడం! కావి నా సలహా మన అధికారులకు కబురంపి వీళ్ళని ఖైదుచేయించివుంటే న్యాయుంగా ఉండేది. బైబిలుకాలం పరిస్థితులు వేరు ఇప్పటికాలపరిస్థితులు వేరు.

కెప్టెన్. (నవ్వుతూ) ఆ! మీరన్నది నిజం ఏ గాలికి ఆ తెరచాపవేస్తూ పడవ నడపటం మంచిది. మేము మీకుమల్లె సాధువులం కాకపోయినా ఈ సాహ సాన్ని నెమరువేసుకోడానికి మరోగ్లాసు ఘాటుపానీయం పుచ్చుకోవాలి. (అయిలిఫ్‌తో) మంచిపని చేశావోయ్! పశువులు మనకు దొరికినట్లే. ఈ పాడుదేశనుగొడవ కొంతకాలం మరచిపోయి మనవాళ్ళంతా కడుపు నిండా తిండి తినవచ్చు. బైబిలులోనే ఎంతో లౌకికంగా సున్నితంగా చెప్పారుగా "కష్టకాలంలో నీ సోదరులనే ఆదుకున్నావా, నువ్వు నను కున్నట్లే" అని. నువ్వు చేసినపనేమిటి? మనవాళ్ళచేత అలవాటులేని తిండి తినిపించకుండా ఈ గొడ్డుమాంసంతో వాళ్ళ ఆత్మారాముళ్ళని తృప్తి పరచటానికి మహోపకారం చేశావు. దీంతో మతధర్మం నిలువబెడుతూ మన మిలిటరీకి మంచిపేరు తెచ్చావు.

అయిలిఫ్. ఊ! అలా తెగించకపోతే మనం మాత్రం ఎలా బ్రతకగలుగుతాం చెప్పండి?

కెప్టెన్. అబ్బాయి! వయస్సులో చిన్నవాడివే కావి సాహసంలో సీజర్ చక్ర వర్తిని మించిపోయావోయ్. నిజంగా నిన్ను మా రాజుగా చెయ్యాలి.

అయిలిఫ్ . సీజర్ ఎక్కడ? నే నెక్కడ? ఆ చక్రవర్తికి బ్రహ్మాండమైన దివ్య శక్తి వుంది. అంచేత ఆయన్నే నా ఆదర్శమూర్తిగా తీసుకుంటా.

కెప్టెన్ : అంత వినయం మంచిదికాదు. ఆ చక్రవర్తి దివ్యశక్తి నీలో ఉబికిపోతూ ఉన్నది. మన సోల్జర్లు నిన్నే ఆదర్శంగా తీసుకుని నీకుమల్లే ధైర్యసాహసాలు చూపెడుతూ ఉండాలి. అంచేత ఇవ్వాళనుంచి నిన్ను నా సొంత కొడుకుగా చూసుకుంటాను (డేరాలో తన పనికోసం ఉపయోగించు కుంటూన్న దేశపటం చెంతకు అయిలిఫ్‌ని తీసుకునివస్తూ) దీన్ని జాగ్రత్తగా చూడు. ఇదిగో, ఇదిగో. . ఇక్కడే నువ్వుచేసిన సాహసకృత్యం. ఇలా పశువుల్ని దాచిపెట్టిన స్థలాలు ఇక్కడే దండిగా ఉండాలి. మనం వాటిని ఆటకాయించాలి.

మదర్ కరేజి : (ఆ మాటలు వినడంతో తను చేస్తూన్నపని ఆపివేస్తూ) మీ కెప్టెన్ చాలా పెద్దవాడుగా కనబడుతున్నాడే!

వంటమనిషి : కొంచెం ఆగు. ఆయనకూ పుష్కలంగా తిండి తినడమంటే ప్రాణాలు లేచివస్తాయి. అలాటి పెద్దమనిషిని పెద్దవాడని అంటావేం?

మదర్ కరేజి ఊహూ! అనక ఊరకుంటానా? యుద్ధం సవ్యంగా సాగిపోవటానికి తనకు వీరులు కావాలని అంటున్నాడు అంత పట్టుదలవుంటే ఇంత మిలిటరీదళం ఇప్పుడు అవసరంలేదు. ఇలా ఉత్తమాటలతో కాలక్షేపం చేస్తూంటే మనవాళ్ళంతా బద్ధకంతో శుద్ధ సోమరిపోతు లవుతారు.

వంటమనిషి : అలా పెడర్థం తీయకూడదు. మనవాళ్ళల్లో మంచితనాన్ని చూసేగా ఆయన అలా అంటున్నది.

మదర్ కరేజి : (తల అడ్డం త్రిప్పుతూ) ఆ పద్ధతే నాకేం నచ్చలేదు. మీ కెప్టెన్ తప్పుదారిని పోతుంటే చూస్తూ మీరంతా ఊరుకున్నా. మీరాజు శుద్ధ మొద్దవతారం అయివుండాలి ఇలాగా జనాన్ని హతమార్చుతూండటం చూస్తూంటే! ఇది మహాదారుణం. బందిపోట్లకన్నా అధ్వాన్నం. వీళ్ళంతా చెప్పేవి వుత్త మాటలు ఒక నీతీ నియమంతో జీవించాలనుకుంటే రాజుల అక్కర లేదు. యుద్ధాలూ అవసరంలేదు. జనం చాలామట్టుకు మంచిదే అక్కడా అక్కడా పప్పులో కాలువేసేవారు జనంలో వున్నా.

కెప్టెన్ : అబ్బాయి, నీ ధైర్యసాహసాలు చూస్తూంటే మీ నాన్నకూడా మంచి సోల్జరై వుండాలి అనిపిస్తోంది.

అయాలిఫ్ : ఊ ! సోల్జర్లను మించిన సోల్జరు మా నాన్న అని విన్నా. కాని మా అమ్మ హెచ్చరించేది, ఆయనమార్గాన్ని నన్ను నడవద్దని. ఈ సందర్భంలో ఆవిడ నేర్పినపాట ఇంకా మరచిపోలేదు.

కెప్టెన్ : ఒక్కసారి దానిని వినిపించాలి. (వంట దేరావంక చూస్తూ, వంటాయన్ని పిలుస్తూ) ఎందుకింత ఆలస్యం చేయటం ? భోజనాలవేళ అని తెలియదా ? ఇక ఆలస్యం చేశావా....

అయాలిఫ్ : అది ఆడవాళ్ళు పాడుకునేపాట. అయినా అది సోల్జర్లపాట అని చెబుతూ ఉంటుంది మా అమ్మ. (కత్తి చేతపుచ్చుకుని, చిందులు తొక్కుతూ)

"ఫిరంగులు, ఫిరంగులు రణగొణధ్వని చేస్తున్నాయి
కత్తులూ, కటారులూ వాటిపని చేస్తున్నాయి
చలికాలం ! ఎముకలునొక్కే శీతాకాలం !
నీరు గడ్డకట్టి పోతూన్నది
ఉన్నదంతా ఈ నీళ్ళల్లో లీనమైపోయింది.

ఎందుకలా చీకాకుపడటం మంచుగడ్డలంటే ?
వాటిదోవకు అడ్డురాకు
కొంచెం ప్రక్కకు మసలుకో
కనబడిందంతా బంగారు కాదు"

అన్నది ఆవిడ తనదగ్గరఉన్న సోల్జరుతో,

"అతనిది ఊరకుండే ఘటం అయితేగా
పడవటం మందు సామాన్లతో,
ఢంకాల ఢమఢమశబ్దం వింటూన్నాడు
పకపక నవ్వాడు ముందుకు నడుస్తూ,
ఆ రణగొణధ్వని వింటూనే
ఉత్తరాదికేసి కొంచెంసేపు నడిచాడు

దక్షిణాదికేసి మరికొంత సేపు నడిచాడు
కత్తిని దూశాడు. అంతే, అంతే!"

అని ఆతనిసాహసం ఆవిడకు చెప్పారు సోల్జర్లు.

"పెద్దవాళ్ళ మాటలమీద గురివుంచాలి
చేసినతప్పుకు పశ్చాత్తాపపడాలి.
ముందూవెనకా చూడకుండా
పైకీ క్రిందికీ దుముకటం ప్రమాదం!
చీకట్లు, చీకట్లు కమ్ముతూ ఉంటాయి."

అని అన్నది ఆవిడ ఆ వార్త తెచ్చినవాళ్ళతో.

"సిపాయిది అలా గురివుంచే ఘటం అయితేనా?
కత్తి పైకి ఎత్తాడు
మాకేసిచూస్తూ మందహాసం చేశాడు
వంతెనమీద నడవసాగాడు
క్రిందికిచూస్తే తప్పేం?
నీళ్ళగడ్డలేం ప్రమాదం?
చీకట్లు కమ్మి వుంటేనేం?
అనుకున్నాడు ముందుకు కదులుతూ
చంద్రోదయ మవుతున్నది.
దోవ బాగా కనబడుతున్నది.
వనిచూసుకుని తిరిగి రావచ్చు
అప్పుడే మంచీచెడ్డా ఆలోచించవచ్చు
అనుకున్నాడు తిన్నగా నడుస్తూ అతను."

సిపాయిలు చెప్పారు ఆ కథంతా ఆవిడకు.

మదర్ కరేజి: (వంటశాలలో కనబడ్డ కత్తులు కటారులూ చేత జిక్కించుకుని గంగాళం బోర్లత్రోసి దబదబ బాదుతూ)

"నాశనమవుతారు అంతా
పొగకుమల్లె మాయమవుతారు
వేడివేడి ఆవిరికూడా చల్లబడుతుంది

మీ అట్టహాసనం మీ కబుర్లకు మల్లె !
ఇక గత్యంతరం దేవుడే
ఇంకెవళ్ళు ఆదుకుంటారు ?''

అన్నది ఆవిడ సోల్జర్లుచెప్పే కథను వింటూ

**అయిలిఫ్ .** (ఆ నాదం వింటూ) ప్రక్కడేరాలో ఆ సందడేమిటి ? వాకు తెలిసిన గొంతే !

**మదర్ కరేజి :** (తన దోవలోనే)

''కత్తిపుచ్చుకున్న సోల్జర్
మంచుగడ్డలు చూస్తూ చూస్తూనే వున్నాడు
కాలుజారి పడిపోయాడు
కత్తి ముక్కలై పోయింది
కాలుపెట్టిన వంతెన విరిగిపోయింది
క్రిందినీళ్లు గడ్డకట్టిపోయాయి
దాంతో వాడూ గడ్డకట్టిపోయాడు
చంద్రోదయ మైంది
విరిగిపోయిన వంతెన కనబడుతూనే ఉంది
అతను మంచుగడ్డలతో పోరాడుతున్నాడు
పైకి రమ్మని కేకలు వేస్తున్నారు
నీళ్ళు అతన్ని గుటకాయిస్వాహా చేశాయి''

అని అన్నారు సోల్జర్లు.

''చెప్పినమాట వినకపోతే
అయ్యేది, తప్పక అయ్యేది
అంతే'' అని అన్నది ఆవిడ.

**కెప్టెన్ :** (వంటడేరాలో చప్పుడు వింటూ) పరాయివాళ్ళని లోపలికి రానిచ్చి వుంటాడు.

**అయిలిఫ్ :** (తన నాటకం కట్టివేస్తూ వంటశాలలోకి నడుస్తాడు. తల్లిని చూడటంతో గట్టిగా కౌగలించుకుంటాడు ) అమ్మా ! అమ్మా ! నువ్వా ! ఎన్నా

ళ్ళయింది? ఎన్నాళ్ళయింది నిన్ను చూసి! మనవాళ్ళంతా కులాసాగా ఉన్నారా?

మదర్ కరేజి. (కొడుకుని గట్టిగా హత్తుకుంటూ) నీళ్ళలో చేపల్లాగ మేమూ ఎలాగో ఈదుతూనే వున్నాం. తమ్ముడూ మిలిటరీలోకి పోయాడు. వాడు అక్కడ ఎలావుంటాడో మరి? ఒక కన్ను వాడిమీద వేసివుంచటం మంచిదిగా.

అయిలిఫ్: మనవ్యాపారం సంగతో?

మదర్ కరేజి: (నిట్టూర్పుతో) మీరంతా తప్పుకున్నా వ్యాపారం వ్యాపారమేగా. దానిదోవలో అది నడుస్తూనే వుంటుంది.

కెప్టెన్: (వంటశాలలోకి అడుగుబెడుతూ) నువ్వేనా మదర్ కరేజివి అంటే? మీ అబ్బాయిలాంటి కొడుకులు మరి కొందరిని ఇస్తే ఆ పేరు తూ. చ. తప్ప కుండా నిలుపబెట్టుకోగలవు.

అయిలిఫ్: అమ్మా! అమ్మా! మంచి సమయానికి నువ్వు వచ్చావు. మా మాటలు వింటూండటం నా అదృష్టం.

మదర్ కరేజి: ఊహూ! మీ పురాణమంతా శ్రద్ధగా వింటూనే వున్నానులే.

[అయిలిఫ్ చెవి మెలవేస్తూ, లెంపకాయ వేస్తుంది గట్టిగా]

అయిలిఫ్: [బాధకు తాళుకోలేక వణకిపోతూ] తెలుసు తెలుసు. ఎందుకిలా చేస్తు న్నావో. అలా వాళ్ళని చావదన్నాననేగా....

మదర్ కరేజి: ఊహూ! వాళ్ళ చావుదెబ్బలనుంచి బయటపడినందుకురా. ఎలా అయితేనేం, నీ చాకచక్యం చూపావు. ఇతర్లముందు ఎలా జాగ్రత్తగా మసులుకోవాలో ఇంకా బాగా నేర్చుకోవాలి.

[ఈ దృశ్యం చూస్తూ కెప్టెన్, ఆయనప్రక్కన ఆ సమయానికి ప్రత్యక్ష మైన ఫాదరీ ప్రారంభంలో కొంచెం ఆశ్చర్యపడుతున్నా, మందహాసం చేస్తూ అక్కడినుంచి బయటికి నడుస్తుంటారు.]

## మూడో రంగం

క్రిందటిరంగంలో కలుసుకున్నతరువాత మరి మూడుసంవత్సరాలు ముందుకు దొర్లుకుపోయాయి యుద్ధం జోరుగా సాగుతూనేవుంది. జయాపజయాలు దైవాధీనాలు. యుద్ధాన్ని ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగా నడుపుతూఉన్నవారు చెబుతూ ఉన్నది. "యుద్ధం ఆదర్శం క్రైస్తవమతధర్మం నిలబెట్టటానికి" అని. ఈ పనిలోకి రాజులను చక్రవర్తులని రంగంలోకి దింపారు. ఉత్తరభాగంమీద ఏకచక్రాధిపత్యం చేస్తున్న స్వీడనురాజు ఇప్పుడు ప్రధాన సేనానాయకుడు. ఆ ప్రాంతాలలో ఉన్నవారు చాలావరకు క్రైస్తవమతంలో ప్రొటెస్టెంటుశాఖకు చెందినవారు రాజూ ఆ శాఖకు చెందినవాడే. అంచేత ఆయనే ప్రొటెస్టెంట్ మతోద్ధారకుడని ప్రకటించారు. ఆయన రాజదళాలు మూడుసంవత్సరాలు పెద్ద ఎత్తున యుద్ధం సాగించినా ప్రతి పక్షానికి చెందిన క్యాతలిక్కు రాజుల దళాలచేత చిక్కిపోవాలసి వచ్చింది. మదర్ కరేజి ఇంతవరకూ వ్యాపారం చేస్తున్నది. స్వీడను రాజుకు సంబంధించిన ఫిన్నిష్ దళాలమధ్య ఇప్పుడా దళాలవాళ్ళంతా ఖైదీ అయారు. అంతేకాదు మతాలుకూడా మార్చుకోవాలసి వచ్చింది వాళ్ళ జీవయాత్ర కొత్త వాతావరణానికి అనుగుణ్యంగా సాగించుకోడానికి... మదర్ కరేజికూడా ఏ ఎండకి ఆ గొడుగు అన్నట్లు తన వ్యాపారం యథాతథంగా జరుపుకోటానికి క్యాతలిక్కు సేనలమధ్యకు వచ్చింది. వాళ్ళ మత లాంఛనాలు అనుసరించాలసి వచ్చింది. తనూ, కూతురూ, చిన్నకొడుకూ కొత్తమతం పుచ్చుకున్నారు.

### మొదటి ఘట్టం

[మదర్ కరేజి కొత్త మిలిటరీదళానికి వస్తుంది. అదీ స్వీడనురాజు అజమాయిషీలో ఉండేదే. క్యాంపుముందు వాళ్ళ జండా ఎగురుతూంటుంది. సాయం సమయం. మదర్ కారేజి కొత్తదళాల అవసరాలన్నీ ముందుగా పసికట్టడంమూలాన అక్కడికి కావలసిన సరుకుబండిలో భద్రం చేసుకున్నది. ఆరోజుల్లో జరుగుతూండే యుద్ధానికి అవసరంలేని ఫిరంగులు కరేజి బండి సమీపాన్నే చెల్లాచెదరుగా పడివున్నవి అక్కడి యుద్ధసామగ్రి డిపో అధికారి ఆ సంధ్యవేళలో గోనెసంచి మోసుకుంటూ మదర్ కరేజి ఉన్నచోటికి వస్తాడు. సంచినిండా మందుగుండు

సామానులు. బండిముందు మదర్‌కరేజి కూర్చొని తనపని చూసుకుంటూంది. డిపో అధికారి ఆవిడతో ఆ కబుర్లు ఈ కబుర్లు చెబుతూ తన సరుకు ఆవిడకు అమ్మ చూపటానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు. కూతురు కాట్రీన్ ఉతికినబట్టలు దగ్గరనేఉన్న రెండు ఫిరంగులమధ్య దండెంకట్టి ఆరవేస్తున్నది. చిన్నవాడు స్విస్ కాస్, ఇప్పుడు మిలిటరీ ఖజానాలో పనిచేస్తూ ఆ సమయానికే తల్లిని చూడటానికి వచ్చి అప్పుడు జరుగుతున్న బేరసారాలు వింటున్నాడు. క్యాంపుపెద్ద అధికార్లతో సరసాలు సాగిస్తూ ఆవిధంగా సంపాదనకు అలవాటుపడ్డ భోగంపిల్ల - యేవెట్టీ పోటీయర్ - చక్కగా ముస్తాబుచేసుకుని పానీయం చేతబుచ్చుకుని అక్కడికేవచ్చి, తను వేసుకున్న ఎర్రరంగు చెప్పులజోళ్ళు తీసి ప్రక్కన నుంచుకుని మదర్‌కరేజి ప్రక్కనే ఉత్తమేజోళ్ళతో కూర్చుంటుంది.]

మిలిటరీ డిపో ఆఫీసర్ : మందుగుండు చాలామంచిది....మా కర్నల్ ఈరోజుల్లో తెగ తాగడం ఆరంభించాడు. అక్కడి పానీయంసరుకు ఖాళీ అయింది. కొత్తసరుకు కొనటానికి డబ్బు అవసరంగా కావలసివుంది. అంచేత దీన్నంతా అయిదు బంగారునాణాలకు ఇచ్చివేస్తా.

మదర్ కరేజి : [సంచిలోఉన్న మందుగుండ్లు తిరగవేస్తూ] సరకు మేలురకమే కాని దీనిని నేను కొన్నానని ఎవరయినా పసిగట్టారా . ఇంకేం ఉంది, మిలిటరీకోర్టుకు ఈడుస్తారు . .కాని ఒకసంగతి అడుగుతా. ఇంతమంచి సామాను ఈ క్యాంపు చుట్టుప్రక్కల పొంచివున్న శత్రుదళాలని హత మార్చటానికి వినియోగించకుండా ఇలా అమ్మటానికి చూపటం చూస్తుంటే మీ కథా కమిషు నాకేం అర్థంకాకుండా వుంది.

ఆఫీసర్ : ఏమమ్మా! ఇలాటివిషయాల్లో మీరే ఇంత ఖచ్చితంగా ఉండటం ఏం బాగాలేదు. అక్కడిసరుకు ఇక్కడికీ ఇక్కడిసరుకు అక్కడికీ మార్చ టంలో తప్పేముంది. అది మామూలుపనేగా....

మదర్ కరేజి : [బెట్టుసరిగా] ఊహూ! ఇది మిలిటరీసామాను. ఊరికేవచ్చినా నాకు అక్కరలేదు.

ఆఫీసర్ : మీ బేరసారాలు ఎటువంటివో మాకూ బాగా తెలుసు. ఆ ప్రక్కదళాల వాళ్ళకి మీరే దీనిని భేషుగ్గా అమ్మవచ్చు. వాళ్ళకి అవసరమూ ఉంది. పది విసరవై అని చెప్పినా వాళ్లు కొంటారు. అక్కడి డిపో ఆఫీసర్ నాకు

బాగా తెలుసు . వాళ్ళకు ఈ సరుకు చాలా అవసరం. రశీదుమాత్రం అవసరం మొత్తానికి తీసుకుంటారు. అదేం ప్రమాదం కాదు.

మదర్ కరేజి : మీరే వాళ్ళకు అమ్మజూపితే బాగుంటుందిగా.

ఆఫీసర్ : అతను నా స్నేహితుడు. స్నేహితులమధ్య ఇలాటి బేరసారాలు బాగుండవు

మదర్ కరేజి : ఊ ! మీ కష్టనిష్ఠూరాలు అర్థమవుతున్నాయి. అదీకాక మీవంటి వాళ్ళ అదుపాజ్ఞల్లో ఉండి పొట్టపోసుకోవలసిన వాళ్ళం. [సరుకు స్వాధీనం చేసుకుంటూ బట్టలు ఆరవేస్తూన్న కూతురిని పిలుస్తూ] అమ్మాయి ఈ సంచి లోపల జాగ్రత్తపెట్టు. పెట్టెలోనుంచి ఒకటిన్నరకాసు ఇయ్యమ్మా ఈ ఆఫీసరుకు. [ఆమాట వినడంతో ఆఫీసర్ 'రెండు' అని వ్రేళ్ళతో సంజ్ఞ చేస్తాడు.] ఊహూ ! ఒకటిన్నర అంటే ఒకటిన్నర ! అంతే ! బేరం బేరమే ! ఇక మాట్లాడకండి.

[కాట్రీన్ గుండుసామానునంచి లోపలికి చేరవేస్తుంటుంది. ఆఫీసర్ అమ్మాయివెంట వడుస్తాడు. కరేజి దగ్గరనున్న కొడుకుకేసి చూస్తూ]

ఒరేయి, అక్టోబర్‌నెల ప్రారంభమయింది. చలికాలం త్వరలో ముంచుకుని వస్తుందన్నమాట. ఎండాకాలానికి మల్లె చలికాలం సరుకు సిద్ధంగా ఉంచుకోవాలోయ్ ...అది సరేకాని, మీ రెజిమెంటు ఖజానాలెక్కలు ఏ క్షణాన్న తణఖీ చేసినా సరిగా ఉండేటట్లు చూసుకోవాలి.... నేను అంటున్నది అర్థమవుతోందా ?....

స్విస్‌కాప్ : ఊ ! బాగా అర్థమవుతోంది.

మదర్ కరేజి : నువ్వు ఖజానా ఆఫీసరవోయ్. మంచి మాటకారివని అమకుని ఈ ఉద్యోగం నీ కిచ్చారు. డబ్బు విషయంలో నువ్వు ఎటువంటివాడివో నాకు తెలుసుగా ! అయినా వాళ్ళమాట నిలుపుతావని నాకు మాట ఇయ్యాలి.

స్విస్‌కాప్ : ఆ ! వాళ్ళమాట తప్పక నిలుపుతా.

[వెళ్ళిపోతాడు.]

ఆఫీసర్ : [వెళ్ళిపోతున్న స్విస్‌కాప్‌ని పిలుస్తూ] ఇదిగో నేనుకూడా వస్తున్నా. కొంచెం ఆగు.

మదర్ కరేజి . [ఆఫీసర్‌తో] మావాడికిమాత్రం మీ చదువు చెప్పకండి.
[ఆ మాటతో ఆవిడదగ్గర సెలవు తీసుకొనకుండానే కోపంతో ఆఫీసర్ అబ్బాయితో వెళ్లిపోతుంటాడు ]

భోగంపిల్ల యేవేట్టి : [ఈ నాటకం మూస్తూ వెడుతూన్న ఆఫీసరుని పిలుస్తూ] ఏమండోయ్, నాకైనా మర్యాద చూపకుండా అలా కోపంతో వెళ్ళడం న్యాయమేనా ?

[మాట వినిపించుకోకుండానే ఆఫీసర్ అదృశ్యమవుతాడు.]

మదర్ కరేజి : (యేవేట్టివంక చూస్తూ) ఏ మమ్మాయీ, మీవంటి భోగంవాళ్ళు మావంటివాళ్లదగ్గర తారట్లాడుతూఉండటం బాగాలేదు. మీ స్నేహితుడయి వుండవచ్చు ఆ ఆఫీసర్ ! అలాటివాళ్ళతో చనువు మావాడికి మంచిదికాదు. ఈ పిశాచం దాపరించినతరువాత మంచివాళ్ళు చెడిపోతున్నారు. అదీ ఒక దేశంతో తనపని చేసుకుంటే యుద్ధం ఎప్పుడో ముగిసిపోయేది. లోకాన్నంతా చుట్టిరావాలని సరదాగా ఉన్నట్లుంది. యుద్ధం అంటే మూడు ఏళ్ళల్లో ముగిసిపోవాలి. కాకపోతే నాలుగేళ్లు. ఇది మన అంచనాను మించి పోతున్నది . ఊ ! ఇదీ ఒకవిధంగా మంచిదే. ఇలాటిసమయాల్లో నా వ్యాపారం లాభసాటిగా సాగిపోవటానికి కొంచెం లౌకికంచూపుతూ చూసుకుంటూండటం చాలా అవసరం. ఓయ్ ! నువ్వు ఇలాటిరోజుల్లో కొంచెం మెలకువగా ఉండటం ముఖ్యం. నువ్వు అసలు రోగిష్టివి ! అస్తమానం అలా తాగుతూఉంటే గట్టిదెబ్బ తింటావు సుమా ! నామాటవిని కొంచెం తగ్గించుకోడం మంచిది.

యేవేట్టి : (కోపంతో) నేను రోగిష్టిదాన్నా ! ఆమాట ఎవరు చెప్పారు ? అదంతా వచ్చి అబద్ధం.

మదర్ కరేజి : ఒకరేమిటి ? కోడి కూసినట్లు లోకం అంటూనేవుంది.

యేవేట్టి : నన్నుచూస్తే గిట్టనివాళ్ళు అంటారు. వాళ్ళకి అబద్ధాలు చెప్పటం అలవాటు అమ్మా ! నువ్వు అయినా నన్ను బాగా అర్థం చేసుకోవాలి....మగవాళ్లు ఉన్నారే నన్ను చూసీచూడడంతోటే వెర్రెక్కిపోయి నాచుట్టూ తిరుగుతూ ఉంటారు. ఆ బాధమంచి తప్పుకోటానికి ఈ రుచికి అలవాటు పడిపోయాను (తలమీదనున్న హాట్ తీసి ప్రక్కకు త్రోసివేస్తూ) ఇదీ

వాళ్ళపిచ్చికి మరింత దోహదమిస్తూన్నది. ఇక్కడి రిజిమెంటు ఆఫీసర్లం దరూ నాకు బాగా తెలిసినవాళ్ళే. మా మొదటాయన నన్ను చక్కగా చూసు కునిఉంటే ఈ వారకాంతవృత్తికి దిగివుండేదాన్ని కాను. చీకూ చింతా లేకుండా కాలిమీద కాలువేసుకుని మా వూళ్ళోనే ఉండిపోయేదాన్ని! ఇక్కడివాళ్ళకి మర్యాదలు తెలియవు. అంతా బురద బురద. దాన్నే మ్రింగు తూండాలి... లేకపోతే బ్రతుకుతెరువు ఎలాగో మీరే చెప్పండి.

మదర్ కరేజి: ఊ! ఇలాటికథను క్రొత్తగా వింటూన్నానా? నువ్వు చెడి పోయిందికాక .. అమాయకురాలైన మా కాట్రీన్‌దగ్గర అలా మాట్లాడటం ఏం బాగాలేదు.

యేవేట్టి: దానిని ఎంతకాలం అమాయకురాలినిగా ఉంచాలని అనుకుంటున్నారు? లోకంలో అవకతవకలు అదీ ఇంతో అంతో తెలుసుకోవాలి. అప్పుడే ఈ సరససల్లాపాలు తట్టుకోడానికి గుండె నిబ్బరం అలవరుచుకోగలదు.

మదర్ కరేజి: ఏమమ్మాయ్! గుండె నిబ్బరం అలవాటుచేసుకోడం సులభమైన పని అనుకుంటున్నావా?

యేవేట్టి: ఆ సంగతి నాకు తెలియదుగాని. నా కథను వాళ్ళకీ వీళ్ళకీ చెబుతున్నప్పుడు వాళ్ళకంట తడి మాస్తుంటే నా కష్టాలు మరచిపోవడం తేలికవు తుంటుంది. అందుకు నాసంగతి ఇంతవరకూ పూర్తిగా చెప్పానుకాను. అం చేత ఇప్పుడైనా మీ చెప్పేయడం మంచిదనుకుంటా. నేను పుట్టి పెరిగింది పడమట ఫ్లాండర్ ప్రాంతాల్లో. మంచి యౌవనంలో అతన్నే కన్నెత్తి చూసివుండకపోతే ఈ తూర్పుదేశాలకేగి ఇంతదూరం ఎందుకు వాస్తాను? వంటల్లో మంచి దిట్ట. అందులో మిలిటరీ వంటలు బాగా తెలిసినవాడు. మాకు దగ్గరలోనున్న హాలండుదేశంలో పుట్టి పెరిగిన ఉచ్చిమనిషి. అంద గాడు బక్కవాడైనా. అస్తమానం పుగాకుపైపు నోట్లో పెట్టుకోడం రైలు ఇంజన్‌కిమల్లె పొగ విడవడం సరదా. అదే నాకొంప ముంచింది!.... మీ కాట్రీన్ నిజంగా అమాయకురాలే!....కాబట్టి బక్క పలచనివాళ్లని అనవసరంగా పలకరించవద్దని చెప్పండి... ఇంతటితో నా కథ పూర్తిచేస్తే నాపట్ల మీ కెలా సానుభూతి కలుగుతుంది? ఓపికపట్టి నా విషాదగాథ వినాలి.... అప్పటికి నాకు పదిహేడు. శత్రుదళాలు మా దేశంలో అడుగు పెట్టడం అప్పుడే. మా చర్చికి ప్రార్థనకోసం వచ్చినప్పుడు అతను అరోజున

అక్కడ తారసిల్లాడు. వంటమనిషియైనా మిలిటరీలో సోల్జర్‌గా! నన్ను చూడడంతోటే తన ధరించిన డాలు క్రిందపడేసి నాతో పరిచయం చేసుకోడానికి చెయ్యిచ్చాడు. అది వసంతకాలం. వెన్నెలరాత్రిళ్ళు. వాళ్ళ రెజిమెంటు ఊరిమధ్య మైదానంలో మకాం చేసివుంది. వాళ్ళఅలవాటుప్రకారం మిలిటరీవాద్యాలు అస్తమానం రణగణధ్వని చేస్తూండేవి. ఊళ్ళో స్త్రీలు అటుకేసిరావడం పసికట్టారా వాళ్లు ఏం చేసేవాళ్ళు? .. ఊరికిదూరంగా ఉన్న తోటల్లోకి పొదల్లోకి తీసుకుపోవడం, మాతో సరసాలాడడం ... వాళ్ళు మా దేశానికి పరమశత్రువులు. నన్ను అలా చేరదీసిన పెద్ద మనిషే అతను. పగటిపూట అతన్ని కలుసుకోటానికి బొత్తిగా వీలుపడేది కాదు. చీకటిపడిందా అతన్ని చూడాలని వుబలాటపడుతూండేదాన్ని. మాది పిచ్చి ప్రేమ కాదు. మావాళ్ళకి ఇది అర్థమయితేగా. మావాళ్ళు అనుకునేవారు ఈ మనిషి మా దేశానికి విరోధి. నే నతన్ని ఏమయినాసరే ప్రేమించననీ. విరోధులపట్ల ఎలా మెలగాలో అలాగే మసలుతుంటాననీ.... అక్కడే ఎంతోకాలం మకాం చేస్తారని అనుకున్నా. ఒకరోజున మావూరి భూమి కంపించింది. మైదానంలోఉన్న దళాలు ఊళ్ళోనుంచి తరలిపోడానికి అంతులేని నాదాలు చేయసాగాయి. అతనూ వాళ్ళతో ప్రయాణమవటానికి చిందులు వేస్తున్నాడు.... నేనూ బయలుదేరాను మావూరినుంచి నా ప్రియుణ్ని వెదకటానికి. ఒకరోజా! రెండురోజులా? అయిదేళ్ళనుంచి దేశదేశాలు గాలిస్తున్నాను. ఇంతవరకు కనబడినపాపాన బోతేగా!

(కూర్చున్నమనిషి అమాంతంగా లేచి బండివెనుకకు వయ్యారంగా నడుస్తూంది.)

మదర్ కరేజి : (పిలుస్తూ) ఏమిటా హడావుడి. ఎక్కడికి? నీ హాట్ ఇక్కడే వదలిపెట్టావు. తీసుకుని వెళ్లు.

యేవెట్టి : (తన కోవలోనే) ఊహూ! అక్కడే ఉండనియ్యండి. అమ్మాయికి నచ్చితే దానిని వాడుకోనియ్యండి.

మదర్ కరేజి : (కూతురుతో) ఆ మనిషి చెబుతూన్నది వింటూనేవున్నావుగా. ఆ పాఠం నువ్వు బాగా నేర్చుకోవాలి. ఈ మిలిటరీవాళ్ళకేసి అలా చూస్తూ ఒళ్ళు మరిచిపోవడం ప్రమాదం; ప్రేమ అనేది అమూల్యరత్నం. వీళ్ళు

కాదు. స్వర్గం దానివి ప్రసాదించాలి. నువ్వు కలలు కంటూఉన్నట్లూ వీళ్లు దేవతలుకాదు. ఎన్నెన్నో నాటకాలాడుతారు నీ వంటి అమాయకురాళ్ళవి బుట్టలో వేసుకోడానికి. నువ్వు మోసపోయావా ఇంకేం ఉంది?....మూగ దానివవడం నా అదృష్టం. భగవంతుడే అలా చేయడం గొప్ప వర ప్రసాదంకూడా. (సండడి) కొంచెం ఆగు. అలాచూడు....మనకేసి వస్తూన్నది ఆ కెప్టెన్ వంటమనిషి ...ఎంత హడావుడిగా వస్తున్నాడో చూడు! అక్కడ ఏవో కొంప లంటుకున్నట్లు?....

(వంటమనిషి అక్కడికి చేరుకుంటాడు. అతను చేరుకున్న మరోక్షణా నికి మిలిటరి ఫాదరీకూడా ప్రత్యక్షమవుతాడు.)

మిలిటరీ ఫాదరి: మీ పెద్ద అబ్బాయి అయిలిఫ్ దగ్గరనుంచి వస్తున్నాను. నేను బయలుదేరటం ఈ వంటమనిషి పసికట్టాడు. వెంట వస్తానని పట్టుపట్టాడు. ఆరోజు విందుకు మీరు సహాయం చేసినందుకు వంటమినిషి మీకు ఎంతో కృతజ్ఞుడట మీ ధైర్యసాహసాలు ఆనాడు విన్నప్పటినుంచి ఉబ్బి తబ్బి బ్బయి పోతున్నాడు. నేను బయలుదేరటం కొంచెం ఆలస్యమైంది. నా కన్నా అతనే ముందుగా ఇక్కడికి చేరుకున్నాడు.

వంటమనిషి: ఇంత హడావుడిగా రావడం నిన్ను చూడాలనికాదు....ఇక్కడి గాలి బాగుందని విన్నాను. అందుకే....

మదర్ కరేజి: మీరు రావడం మంచిదే ఈ సమయంలో. కాని ఇక్కడ మీరు కొంచెం మర్యాదగా మసులుకోవాలి సుమా. కాస్త మితిమీరారంటే.... నాసంగతి మీకు బాగా తెలుసుగా! (ఫాదరీతో) మా అయిలిఫ్‌దగ్గరనుంచి వస్తూఉన్నానంటున్నారే వాడికి ఏం కావాలట?....డబ్బు అవసరమైతే ఇప్పుడు నాదగ్గర చిల్లిగవ్వకూడా లేదు.

ఫాదరి. మీ అబ్బాయికి మీ దగ్గనుంచి కావలసింది డబ్బుకాదు. తమ్ముడు ఉన్నా డట ఖజానాపనిలో. ఆ అబ్బాయికి కొంచెం కబురు పంపమన్నాడు తన అవసరాలకు.

మదర్ కరేజి: చిన్నవాడిని ఇప్పుడు మరోచోటికి బదలాయించారు; అయిలిఫ్ వాడి తమ్ముడు కాదు. చిన్నవాడు వెర్రిబాగులవాడు. అయిలిఫ్ వాడివి

తొందరపెట్టకుండా వుంచేనే మంచిది. అయితే అవసరం నాకు తెలుసు. కాని దాన్ని ఎలా సర్దుకోవాలో తెలియడంలేదు.

(తన బొడ్డులో దాచుకున్న సంచిలోనుంచి ఒక బంగారుకాసు ఇస్తూ) ఇంతకన్నా నాదగ్గర లేదు. దీనిని వాడికియ్యండి. జూదం వాడిని పట్టుకున్న పెద్ద జబ్బు. చేతిలోఉన్న సొమ్మునంతా మంచినీళ్లలాగ తగలబెడుతుంటాడు. ఎప్పటికి బుద్ధి వస్తుందో మరి ?

వంటమనిషి : సైనికజీవితం మీవాడిని నాశనం చేసింది. దాన్ని వదులుకోవాలి. లేదా చావు వాడిని పొట్టబెట్టుకుంటుంది. మీవంటి ఆడవాళ్లు వాడివిషయంలో కఠినంగా ఉండాలి. కాని అలావుండే మనుషులయితేగా మీరు పైకి డాం డూం అంటున్నా....ఒక్క తాగుడుసంగతి చూడు. ఒకగుక్క పుచ్చుకుంటే ప్రమాదం ఏమాత్రము ఉండదు. దానికి దాసులమయ్యామా అది ఆడించే నాటకం ఇంతా అంతానా ?

ఫాదరి : (వంటమనిషితో) అలా ఆవిడని కంగారుపెట్టడం మంచిది కాదు. యుద్ధం మంచిది. దైవప్రేరితంకూడా. అందులో మరణించటం అంటే వీరత్వం ప్రదర్శించటం అన్నమాట. మహాప్రసాదంకూడా ! తప్పులు చేస్తూంటాం అంతుపంతూలేకుండా. పెద్దలమైన మన ధర్మం అలాటివాటిని విస్మరించటమే. ఇలా చెప్పటానికి కారణం ఈ యుద్ధం మత విశ్వాసాలని విలవబెట్టటానికి రావటంచేత. సాక్షాత్తు క్రీస్తుప్రభువే మనపక్షాన్నే ఉంటూ మనకు చేయూతనిస్తూ ఆశీర్వదిస్తున్నాడు.

వంటమనిషి : ఫాదరీ అంటున్నది నిజమే. కాని పెద్దలు వాళ్ళఉత్సాహంలో అసలు ధర్మాన్నే మరచిపోతుంటారు. కొంపలకి చిచ్చు పెడటానికి నడుం కట్టుకుంటారు. దొంగతనాలకి దోపిళ్ళకీ దోహదమిస్తూంటారు. అంతా దేవుడి శక్తితో జరుగుతూన్నదని అంటారు. అంతేనా ? అమానుషకార్యాలు అంతులేనన్ని చేస్తూంటారు. ఆ దారిని సాగుతుండే తతంగం ఒక ఎత్తు. ఈ యుద్ధం ఒక ఎత్తు. (ఫాదరితో) మీరన్నట్లు మన మతధర్మం కాపాడుకోడానికి ఈ యుద్ధాన్ని పెద్దఎత్తున నడుపుతున్నాం. అడపా తడపా అలిసిపోతుంటాం మనపని బరువు ఎక్కువవుతుంటే. అలాటప్పుడు ఆకలిదప్పులు ఎక్కువవుతాయి. వాటిని తీర్చుకోడానికి పెద్దలమైన మనం కుర్రవాళ్ళకి ఇంతో అంతో సహాయం చేస్తుండాలి.

పాదరి : (మదర్ కరేజితో) ఈయన్ని నావెంట రావద్దని బ్రతిమాలుతున్నా కాళ్ళా వేళ్ళా. నామాట వింటేనా ? మీరు ఇతనికి ఎంతో సహాయం చేశారని అక్కడినుంచి కదిలివచ్చాక మిమ్మల్ని గురించే కలవరిస్తూఉన్నానని పట్టు పట్టి బయలుదేరాడు.

వంటమనిషి : (పైపులో పుగాకువింపుతూ. అగ్గిపుల్ల ముట్టిస్తూ) ఊ ! నా కలలు పండాయి . ఇక ఈవిధ చేతిచలవగా ఒకగ్లాసు పుచ్చుకున్నానా నా అదృష్టం ఎలాటిపరవళ్లు తిరుగుతుందో మాటలతో చెప్పాలా ? మా పాదరి చాలా మంచిమనిషి.-వెంట నడుస్తున్నప్పుడు ఎన్నెన్నికథలు చెప్పాడు కడు పుబ్బేటట్లు నవ్వేనవ్వి బాగా అలిసిపోయానుకూడా.

మదర్ కరేజి : (నవ్వుతూ) ఆకథలు ఈ పాదరిదుస్తుల్లోనే చెప్పాడా • ...మవ్వు వచ్చావు సంతోషం. ఇప్పుడు ఈయన నన్ను తృప్తిపరచటానికి ఎలాటి నాటకం ఆడుతాడోమరి !

పాదరి . (మందహాసం చేస్తూ) మా పెద్ద పాదరి ఎప్పుడూ అంటూంటారు ఆ కోరికలు ఈ కోరికలు కోరుకోటానికి ఉత్సాహపడుతూ ఉండటం మహాప రాధమని కోరికలు ఉచ్చులు, వాటిలో పడ్డామా ఇంకేముంది ? (బట్టలు చక్కబెడుతున్న కాట్రీన్‌వంకచూస్తూ) ఈ పిల్ల చాలా అమాయకురాలుగా ఉందే ! ఎవరిపిల్ల ?

మదర్ కరేజి : (కోపంతో) ఎందుకలా దానికేసి చూస్తారు మంచీ మర్యాదా లేకుండా ?

(కరేజి కూర్చున్నచోటినుంచి అమాంతంగా లేచి బండివెనుకకు వెడు తుంది. పాదరి వంటాయనా వెంట నడుస్తుంటారు. వాళ్ళు అటుకేసి రావటం కాట్రీన్ చూడటంతో చక్కబెట్టుతున్నబట్టలు అలానేవుంచి వాళ్ళకేసిచూస్తూ ప్రక్కన పడివున్న వారకాంత హాట్‌ను జాగ్రత్తగా తీసు కుని తలమీద పెట్టుకుంటుంది. అక్కడే పడివున్న ఎర్రజోళ్ళమీద దృష్టి పడుతుంది. వాటిని పుచ్చుకుని కాళ్ళకు వేసుకుంటుంది .. బండివెనుక ఇప్పుడు తచ్చాడుతూఉన్న వాళ్ళు రాజకీయాలు మాట్లాడుకుంటూంటారు.)

పాదరి : ఇక యుద్ధం సంగతా ?

మదర్ కరేజి : ఊ హూ ! ఈ పోలండు ప్రజలు రాజకీయాలలో కలుగజేసుకుంటూ ఉండడం ఏమాత్రం పబబుగా లేదు మన స్వీడమరాజా పెద్దమనిషి. పశు బలం ఉపయోగించటం రాజుకు ఇష్టం లేకపోయినా ఆ పనీ తప్పనిసరిగా చేయాల్సి వచ్చింది. ఈ పోలండువాళ్ళే కాళ్ళబేరానికి వచ్చివుంటే యుద్ధం ఈవిధంగా ప్రజమించేదే కాదు. తప్పంతా వీళ్ళదే.

ఫాదరి : ఊ. మీ రంటున్నది అక్షరాలా నిజం. మనరాజు ధ్యాసంతా శాంతిమీదే. ఆ విషయం నేను మన రిజిమెంటువాళ్ళకి ఇస్తూండే ప్రసంగాలలో పదే పదే జ్ఞాపకం చేస్తూనే ఉన్నాను. ఆ జర్మను చక్రవర్తి వున్నాడుగా! వీళ్ళతో షరీకై వీళ్ళని అనవసరంగా రెచ్చగొడుతూ ఉన్నాడు మనవాళ్ళని ఎదిరించమని....

వంటమనిషి : తథాస్తు....(కరేజితో) ఈ చర్చకు పీ పానీయంకూడా బాగా ఉపక రిస్తుంది. నువ్వు ఈ రాజకీయాలు మాట్లాడుతూఉన్నప్పుడు నీకేసే దీక్షగా చూస్తున్నాను నువ్వు ఇంత అందకత్తెవని కలలోకూడా అనుకోలేదు. ఆ ! నువ్వు అన్నట్లు ఇది ధర్మయుద్ధం (అదేసమయంలో బయట చర్చిలో పాట పాడుతూఉన్న నాదం వినబడుతూ ఉంటుంది. "మన ప్రభువు గట్టికోట " అని. ఫాదరి, వంటమనిషి ఆచరణాన్ని అందుకుంటూ ఉంటారు) మనం మాట్లాడుకుంటూఉంది రాజుగారి సంగతేగా ! రాజు చెప్పే శాంతిమాటలు మనలని బురడించటానికి. ఆయనప్లాను జర్మను రాజ్యంమీదకూడా ఈ సమయంలోనే దాడి చెయ్యాలని. ఆ ప్లాను సాగిం చటం అంత సులభమా ? బోలెడుసొమ్ము ఖర్చు అవుతుంది. దీన్నంతా భరించాలసింది స్వీడన్ ప్రజలు. ఇప్పుడు ఉప్పుపన్ను వసూలు చేస్తున్నాడు. జనులు నిరుపేదలు. పన్ను చెల్లించుకోలేక వాళ్ళుపడేయాతన రాజు ఏమాత్ర మైనా ఆలోచించాడా ? మా యుద్ధం, మతయుద్ధం పాటలతో జనాన్ని బాధ పెడుతున్నాడు .

మదర్ కరేజి : (వంటాయనతో) ఈమాటలు వింటుంటే నువ్వు స్వీడను దేశస్తు డివి కాదనిపిస్తున్నది స్వీడనువాళ్ళే అయివుంటే ఆ రాజు చూపుతున్న శౌర్యాన్ని ఎంతగానో పొగిడేవారు.

పాదరి : స్వీడనుమనిషి కాకపోయినా ఆ మహారాజు ఉప్పు ఇతమూ తింటూనే ఉన్నాడు.

వంటమనిషి : ఊహూ। నేను తయారుచేసే రొట్టెల్లో ఉప్పువేసి తినటానికి వాటిని ఆరాజు మనుషులకే ఇస్తున్నాను.

మదర్ కరేజి : మీ రాజకీయాలు నాకేం అర్థమవడం లేదు ఇప్పటి వాతావరణం చూస్తుంటే స్వీడనురాజు నెగ్గేటట్లులేదు.

వంటమనిషి : నెగ్గడం కష్టమైనా రాజుని ఈ బురదలోకి దించిన పెద్దబుర్రలు మరో విధంగా ప్లాన్లువేస్తూ ఉన్నాయి. వాటికి కావాలసింది విజయంకాదు. లాభం। చేతినిండా లాభం. అవి ఇప్పుడు చేస్తున్నది ఆ మందుగుండుసామాన్ని ఈ మందుగుండుసామాన్ని రాజుకు అంటకడుతూ కోటానకోట్లు గడిస్తూ ఉండటం। పైకిమాత్రం ధర్మయుద్ధం? మతయుద్ధం। అని చెబుతూ అమాయకులని ఈ మంటల్లోకి ఈడుస్తూఉన్నాయి ఈ పెద్దబుర్రలు।

మదర్ కరేజి : పెద్దబుర్రలసంగతి అలా వుంచండి. వాటికి వంతుపాడేవాళ్ళు ఈ రణగుణధ్వని చేయకుండా ఊరుకుంటే మావంటివాళ్ళవ్యాపారం ఎలా సాగుతుందో మీరే తాపీగా ఆలోచించాలి.

వంటమనిషి : అంటేత యుద్ధం జోరుగా సాగుతూఉండాలనేనా మీ ఉద్దేశ్యం?

పాదరి : ఆ। ఈ వంటమనిషి నిజంగా డచ్చి ఆయనే। ఏ గాలికి ఆ చాప ఎత్తడం బాగా తెలుసు.

మదర్ కరేజి : మతగురువులంటే నిజంగా మీరే మీరు పాడేపాట ఇదంతా మత యుద్ధమని. రాజు ఎలాటి అవకతవకలవాడైనా ఆయన్ని సమర్థించటం మీ పని. అంతే కాదు ఆయనకూడా మీ ప్రాటెస్టెంట్ మతానికి చెందిన వాడు కాబట్టి. ఆ రాజు పేరుతో ఆయన మతంపేరుతో ఒక గ్లాసు పుచ్చు కోండి.

(ఆదేసమయానికి క్యాట్రీన్ వారకాంత యేవెట్టి హాట్ వేసుకుని, జోళ్లు తొడుక్కుని ఆ భోగంపిల్ల వయ్యారాన్ని అనుకరిస్తూ వాళ్ళముందుకు వస్తూంటుంది.

ఆ క్షణంలోనే బయట ఫిరంగులశబ్దం తుపాకులకాల్పులు. రణభేరీలు అంతులేకుండా మ్రోగుతుంటాయి.

మదర్ కరేజి, వంటాయన, ఫాదరి బండివెనుక కూర్చుండి తనివితీరా పానీయాలు రుచిచూస్తూ ఉంటారు. మందుగుండుసామగ్రి డిపో ఆఫీసర్ సోల్జర్లని వెంటబెట్టుకువచ్చి అక్కడ వెల్లాచెదరై పడివున్న ఫిరంగులని తీయిస్తుంటాడు )

మదర్ కరేజి : (అటుకేసి చూస్తూ ఆఫీసరుతో) ఎందుకలా హడావుడి పడటం?

ఆఫీసర్ : క్యాతలిక్కులు! క్యాతలిక్కులు! మనమీదికి దాడి వస్తున్నారు. వాళ్ళు మనమీద పడేలోపున వీటిని తీసుకుని మనం కాళ్ళకి బుద్ధిచెప్పాలి

(అటుకేసి మరిద్దరు సైనికులు వస్తుంటారు. వాళ్ళని పురమాయిస్తూ) ఏమాత్రం ఆలస్యం చేయకూడదు. తొందరగా వీటిని ఇక్కడినుంచి కదిలించండి

మదర్ కరేజి : ఏమిటా తొందర! మా బట్టలు ...ఆ దండానికి కట్టాం. కనబడ్డం లేదా! వాటిని తీయనివ్వండి. ఆ తరువాత మీ వాళ్ళు మీ పని చూసుకోవచ్చు.

(తను కూర్చుండినచోటినుంచి లేచి బట్టలు దండెంమీదనుంచి తీస్తుంది)

వంటమనిషి (లేస్తూ) ఇప్పటికే ఆలస్యం అయింది. మా కెప్టెన్‌దగ్గరకు వెంటనే వెళ్ళాలి. మన కాలక్షేపం పూర్తిచేయటానికి రేపువచ్చి కలుసుకుంటా.

(గబగబ నడుస్తుంటాడు.)

మదర్ కరేజి : ఏమయ్యోయ్! పైపు ఇక్కడే వదలిపెట్టి వెడుతున్నావే!

వంటమనిషి : (నడుస్తూనే ఆమెకేసిచూస్తూ) ఫరవాలేదు. జాగ్రత్తగా నీదగ్గరే వుంచు. రేపు అవసరం ఉంటుంది....

మదర్ కరేజి : ఇలాటిసమయంలో కొంచెం చేవోడుగా ఉండేవాళ్ళు చేసేది ఇంతే.

ఫాదరి : అతను పిరికిపంద. నేనున్నానుగా మీకు ఇంతో అంతో చేదోడు వాదోడుగా ఉండటానికి! మనమీద దాడి పడబోతున్న శత్రువులు క్యాతలిక్కులుకూడా! అంచేత మనం ఇక్కడ ఉండడం మంచిదికాదు ... ఇక యుద్ధం ఏ పరవళ్లు త్రొక్కబోతుందో? అలాంటిమార్పులు నా దృష్టిలో

మంచివే; మన ఆత్మ శాంతికోసమే; అంచేత. వాళ్ళు మనమీద అమాంతంగా పడ్డా మనలని పసిపట్టకుండా కంబళ్ళు కప్పుకుని ప్రాణాలు రక్షించుకోడం మంచిది....

మదర్ కరేజి. ప్రాణాలే మంటగలిసిపోతుంటే ఇప్పుడు ఈ కంబళ్ళు మనకేం సహాయం చేస్తాయి? ఆ నరికు నాదగ్గరఉన్నా మీకు అరువిచ్చేస్థితిలో లేను. ఇలాటివిషయంలో నాకు చెడ్డ అనుభవం ఉంది. ..

ఫాదరి: మిమ్మల్ని అలా ముంచేవాణ్ణి కాను. నేను ఫాదరిని. వాళ్ళు నన్ను ఈ దుస్తుల్లో గుర్తుపట్టకుండా ఉండటానికి కంబళీ చాలా అవసరం నా దీక్ష నిలవబెట్టడం మీ ధర్మంకూడా.

మదర్ కరేజి. (సరుకులోనుంచి కంబళీతీసి ఇస్తూ) ఇయ్యటానికి ఇష్టం లేక పోయినా .. మిమ్మల్ని చూస్తుంటే జాలివేస్తున్నది. దీనిని తీసుకుని మీ మతం నిలవబెట్టుకోండి.

ఫాదరి: ఆపత్కాలంలో చేసిన సహాయానికి కృతజ్ఞత ఎలా చూపాలో తెలియడం లేదు. దీనిని కప్పుకుని చప్పున కాళ్ళకు బుద్ధి చెప్పాలనుకున్నా ... (సందడి) ఈ సందడి వింటూంటే వాళ్ళు ఈ క్యాంపుమీదికే దూసుకుని వస్తూన్నట్లు ఉంది. ఇంకోక్షణంలో ఇటుకేసి రావచ్చు. నేనే పరుగెత్తానా నా సిడకిని వాళ్ళు పసికట్టవచ్చు. ఏ అఘాయిత్యం చేసినా చేయవచ్చు.... అంచేత మీదగ్గరే వుండిపోవడం క్షేమం కదూ?

మదర్ కరేజి (ఫిరంగులు కదలించటానికి సతమత మవుతూన్న సైనికులతో) ఫిరంగులు అలానే వుంచండి మీ రెంతకష్టపడ్డా ఫలితం ఇక సున్న. వాటి బందోబస్తు నేను చూసుకుంటా. మీరు తిన్నగా నడవండి.

ఆఫీసర్ (ఆమాట వింటూ, అజామయిషీ చేస్తున్నచోటినుంచి కదులుతూ) మీ సలహా భేషుగ్గా ఉంది. సెలవా.

(సోల్జర్లతో అక్కడినుంచి వెడుతాడు)

మదర్ కరేజి (కూతురి కొత్తవేషం చూస్తూ) ఏమిటే ఆ భోగంవేషం? దానికి మల్లె నాటకం ఆడాలనుకుంటున్నావా? (పిల్ల తలమీది హాట్‌ని తీసేస్తుంది) ఇప్పుడు ఇక్కడికి వచ్చేవాళ్ల నిన్నుచూసి మురిసిపోవాలనుకుంటున్నావా?

దావి జోళ్లూ తొడుక్కున్నావు! వాటిని వెంటనే తీసివేస్తావా లేదా? (కూతురు తటపటాయిస్తూ జోళ్ళకేసి దీనంగా చూస్తూండటం గమనిస్తూ, తనే ఆ పాదరక్షలు లాగివేస్తూ ఫాదరితో) ఏమండోయ్. ఓపళాన ఇవి రావడంలేదు. మీరు సహాయం చెయ్యాలి. నాకు వేరే పనుంది. ఇప్పుడే వస్తా.

(బండివెనుకకు నడుస్తుంది.)

యేవెట్టి : (అదేవేళకు మరింతబాగా ముస్తాబుచేసుకుని అక్కడికి వస్తుంది. ఫాదరి చేస్తూన్నపని చూస్తూ) ఏమండోయ్. క్యాతలిక్కులదళం ఇటుకేసి రాబో తున్నది. నా హాట్ ఎక్కడ? చూశారా? (అటూ ఇటూ చూస్తూ) ఇక్కడే పెట్టిపోయానే! హాట్ లేకుండా వాళ్ళదగ్గరకువెడితే వాళ్ళేమనుకుంటారో కొంపముంచి! .. ఈ హడావుడిలో అద్దం మరచిపోయా ఒక్కసారి ఇలా చూడండి. నా ముస్తాబు బాగుందా?

ఫాదరి : (సిగ్గుపడుతూ) ఊఁ! బాగానే ఉంది.

యేవెట్టి : ఆ! మీరు తీస్తున్నజోళ్లు నావే. ఇలా ఇయ్యండి. అవి లేకపోతే నా గుడారంలోకి ఎలా నడవగలుగుతాను? రోజులు మహాచెడ్డవి! (ఫాదరి ఇచ్చినజోళ్లు వేసుకుని నడుస్తుంటుంది. ఆ సమయాన్నే ఖజానాపెట్టె మోసు కుంటూ స్విస్‌కాప్ అక్కడికి వస్తుంటాడు.)

మదర్ కరేజి : (బూడిద చేతినిండా నింపుకుని అక్కడికివస్తూ) కాట్రిన్‌తో అమ్మాయి నువ్వు దీంతో నీముఖం కొంచెం పులుముకో.

(చిన్నవాడు తనకేసి రావడంచూస్తూ) అదేమిటిరా?

స్విస్ కాప్ : మా రెజిమెంట్ ఖజానాపెట్టె!

మదర్ కరేజి : దానిని ఈసమయంలో ఇక్కడికి తేవడం ప్రమాదం. తప్పున ఎక్కడైనా పారవేసిరావాలి వాళ్ళకు తెలిస్తే చావగొడతారు.

స్విస్‌కాప్. ఏం ఫరవాలేదు. దాచమని నన్ను పురమాయించారు. (పెట్టెతో బండి వెనుకకు నడుస్తుంటాడు.)

మదర్ కరేజి. (ఫాదరితో) మీరు వేసుకున్న ప్రొటెస్టెంట్ ఫాదరిదుస్తులు తీసి దాచిపెట్టడం చాలా అవసరం! వాటితో మిమ్మల్ని చూశారా?....(కూతురు

బూడిదతో ముఖం పులుముకోటానికి తటపటాయిస్తుంది) ఏమిటే ఈ నాటకం? ఈ మురికి కొంచెం సహించాలి. అదే ఇలాటిసమయంలో నిన్ను కాపాడేది చూడటానికి ముఖం వికారంగా ఉన్నా! ముఖం అందంగా ఉంటే భోగంవాళ్ల పిల్లవని నిన్ను కటేపి తందరా లాడుతారు. . ఎందుకలా వణకడం? ఆ! ఇప్పుడు నీ వేషం బాగా ఉంది. ఇక వాళ్లు నిన్ను గురుతుపట్టరులే. (బండి వెనుకనుంచి తిరిగివస్తూన్న చిన్న వాడితో) ఎక్కడ దాచావురా?

స్విస్‌కాస్ : బండిలో . జాగ్రత్తగా ఉంటుందిలే

మదర్ కరేజి : (అదిరిపోతూ) ఏమన్నావు? నా బండ్లోనా? అంత తెలివితక్కువ పని ఈ సమయంలో చేయవచ్చా. వాళ్లు చూశారా మన ముగ్గురినీ తప్పక ఉరిస్తంభం ఎక్కిస్తారు.

స్విస్‌కాస్ : (తల్లిని సమాధానపరుస్తూ) అంతప్రమాదం వస్తుందనుకుంటే మరెవళ్లకైనా అందజేస్తా. అలాకాకపోతే దాంతో కాళ్ళకు బుద్ధి చెప్పు కుంటా ఇప్పుడే.

మదర్ కరేజి : తప్పించుకోటానికి ఇక వీలులేదు. కదలకుండా ఇక్కడే వుండు.

ఫాదరి (బండి వెనుకనుంచి దుస్తులు మార్చుకుంటూ) జండాసంగతి ఏం చేద్దాం? ఆ సంగతి ఆలోచించండి.—

మదర్ కరేజి : (బండిపైన ఎగురుతూన్న ప్రొటెస్టెంట్ రిజిమెంటుజండా క్రిందికి దించుతూ) ఇది మన భాగ్యలక్ష్మి. ఇరవై అయిదేళ్ళనుంచి నా బండిని అదు కుంటూ ఎగురుతూఉంది. దీనిని దించడం - నసేమిరా ఇష్టంలేదు. అయినా? ...

(దగ్గరలోనే ఫిరంగులశబ్దం. క్రమేణ శబ్దం ఎక్కువైపోతూ ఉంటుంది)

## రెండోఘట్టం

(శత్రువులదే పైచెయ్యి అవుతుంది ఆ రోజుల్లో జరిగినయుద్ధంలో. వాళ్లు క్యాతలిక్కులు. ఆ మతం పుచ్చుకున్నవాళ్ళకే ఇక పుట్టుగతులు....

మూడురోజుల తరువాత. తెల్లవారింది....క్యాంపులో యుద్ధ వాద్య నాదాలు, ఫిరంగులకాల్పులు ఆగిపోయాయి. మదర్ కరేజి కూతురు

కాట్రీన్ చిన్నఅబ్బాయి స్విస్‌కాస్, ఫాదరిబల్లముందుకూర్చుని ఫలహారాలు చేస్తూ కొత్తపరిస్థితులమూలాన రాబోయే సాధకబాధకాలు చెప్పుకుంటూ కాలక్షేపం చేస్తూఉంటారు.)

స్విస్‌కాస్ : ఒకరోజా, రెండురోజులా ! మూడురోజులు ఇక్కడే పనీపాటలులేక ఉండిపోవటం కష్టంగా ఉందే అమ్మా ! నాతో అక్కడ రెజిమెంటులో పని చేస్తుండే హవల్దారు ఒకకన్ను ఎప్పుడూ నామీదే వేసిఉంటాడు. ఇన్నాళ్ళ అక్కడ నేను లేకపోవడం ...ఖజానాపెట్టె మాయమవడం అతను పని కట్టుడా ఎంతో రాద్ధాంతం చేయవచ్చు.

మదర్ కరేజి . ఇంతవరకు వాళ్ళకు నీపత్తా తెలియనందుకు సంతోషించు.

ఫాదరి : మీరు అలా అబ్బాయినిగురించి తలపోస్తుంటే ఇక నాసంగతి తలంచే వాళ్లు ఎవళ్లు ఉంటారు ? నా పూజాపునస్కారాలకి స్వస్తి చెప్పుకున్నప్పటి నుంచీ మానసికంగా ఎంతో బాధగా ఉంది. అయినా ఫరవాలేదని నాలో నేను ఏదోవిధంగా సమాధానపరుచుకుంటున్నా. పనిపాటలులేక ఇలా కూర్చుండటం ఎంతకాలమో మరి ? .

మదర్ కరేజి : ఇక నా సంగతి ఆలోచించేవాళ్లుమాత్రం ఎవళ్లు ఉన్నారో మీరే చెప్పండి. ఇటు గొయ్యి. అటు నుయ్యి. ఇటు తన మతధర్మానికి స్వస్తి చెప్పుకున్నాయన. అటు మిలిటరివాళ్ల ఖజానాపెట్టెను కాజేసిన మనిషి .. పరిస్థితులు ఎంత భయప్రమాదాలతో నిండివున్నాయో చూడండి

ఫాదరి : పరిస్థితులు ఎలాటివైనా మనమంతా భగవానుడిచేతుల్లో ఉన్నాం. ఆ దృఢ విశ్వాసంతో ఉన్నామా అంత చక్కబడిపోతుంది.

మదర్ కరేజి : ఊ ! నాకూ తెలుసు ఆ సంగతి. కాని ఈ గడ్డురోజుల్లో రాత్రుళ్లు నిద్ర పట్టడమేలేదు. (స్విస్‌కాస్‌వంక చూస్తూ) నువ్వే ఈపని చేయకుండా వుంటే నా మనస్సు ఇంత బరువుగా ఉండెదికాదు. ఇన్నేళ్లు మనబండి సవ్యంగానే కదలింది ...వాళ్లెన్ని అడ్డుప్రశ్నలు వేశారు !....ఆ సంగతి తలుచుకుంటే భయం వేస్తోంది ...మనస్ఫూర్తిగా మతం మార్చుకున్నానో, మరే కారణంచేత ఇలా చేయాలసివచ్చిందో తెలుసుకోడానికి వాళ్లు ప్రశ్న లడిగినప్పుడు తగిన సమాధానం చెపుతూ వాళ్ళనే అడగాలనుకున్నా కొత్తపూజకు అవసరమైన మైనంపత్తులు సరసమైనధరకు ఎక్కడ దొరుకు

తాయో చెప్పమని. ఈ సందర్భంలో తంత్రిమూలాన మా స్విస్‌కాస్ క్యాథలికు కావడం చాలా సహాయం చేసింది....మన గొడవంతా వినీ విననట్లు ఊరుకున్నాడు. మన అదృష్టం పండటానికి మరో కారణంకూడా సహాయం చేసింది. వాళ్ళ రెజిమెంటుకు చిల్లరసరుకులు అమ్మేవాళ్ళు లేరట. అంచేత ఆపని నేనే చూసుకుంటే మంచిదనుకున్నారు . .. ఇతర్లకిమల్లె కఠినశిక్ష విధించకుండా ఉత్తఖైదీలుగా ఉండనిస్తే ఏం ప్రయోజనం లేదని వాళ్ళవ్యాపారం చూసుకోటానికి మనలని ఉండనిచ్చివుంటారుకూడా ... అయినా మనస్థితి ఇప్పుడు బోనులో ఎలుకలమల్లే ఉంది.

ఫాదరి : ఇక్కడ దొరికే తిండి తిప్పలసంగతి కొంచెం ఆలోచించు. ముఖ్యంగా పాలసంగతి చూడు. అసలుపాలు ఎన్నిపాళ్ళో దాన్లో కలిపిన నీళ్ళు ఎన్ని పాళ్ళో మరి. ఇంతవరకు స్వేదన భోజన మజ్జనాదులకు అలవాటుపడ్డ మనకి ఈ కట్టుబాట్లు కొంచెం కష్టంగానే ఉంటాయి. అయితేనేం జయించాం. దానికి ఆనందించాలి.

మదర్ కరేజి : జయం మన కెందుకవుతుంది? ఈ కొత్తవాళ్ళనీ తోలుబొమ్మల్లాగ ఆడిస్తూన్న ఆ పై ఖుర్రలదే!....ఒక్కటి చెప్పాలి. మన మర్యాద మట్టిపాలైంది అయినా ఇతరవిషయాలలో పై చెయ్యి మనదే.... ఈ పరిస్థితులు చూస్తూంటే పాతరోజులు చప్పున జ్ఞాపకం వస్తున్నాయి. ఒకప్పుడు లివరెండు రెజిమెంటుతో వ్యాపారం చేస్తూఉండేదాన్ని. మా కెప్టెన్ శత్రువులదాడికి ఆగలేకపోయాడు. శత్రువులు వాళ్ళ విజయోత్సాహంలో వాళ్ళగుర్రాన్ని మే మున్నచోట్లోనే వదలేసి వెళ్ళారు. వాళ్ళతో మనవాళ్ళు సంధిరాయబారాలు పూర్తిచేసుకోడానికి ఏడునెలలు పట్టింది. అంతవరకు ఆ గుర్రాన్ని మా బండి లాగటానికి వాడుకున్నాను. ఈ జయాపజయాలు పై పెద్దలకు ఎలావున్నా మన వ్యాపారసరళితోచూస్తే మన మేలుకోసమే అవి బల్లగుద్దినట్లు చెప్పవచ్చు. (స్విస్‌కాస్‌తో) ఎందుకలా దిక్కులు చూడటం? కడుపువిండా తిను.

స్విస్‌కాస్ : నయించటంలేదే... ....ఇంత ఖజానాసొమ్ము ఆ హవల్దార్ ఎలా చెల్లించుకుంటాడో పాపం!

మదర్ కరేజి : అదా సంగతి! యుద్ధంలో మీ రెజిమెంటూ చెల్లాచెదరై పోయిందిగా. అలాంటప్పుడు ఈసంగతి ఆలోచించేవాళ్ళు ఎవళ్ళూ ఉండరుగా!

స్విప్‌కాస్ : మీ రెజిమెంటుమల్లె తమకు పట్టనట్లు ఊరక వుండేవాళ్లుకాదే! ఒక నీతినియమం ఉంది మావాళ్ళకి. చెల్లాచెదరై పోయిన సమయాన్నే వాళ్ళకు డబ్బు ఎంతో అవసరం.

మదర్ కరేజి ఒరే! నువ్వు పుట్టటం ఇలాటి మాటకారి నోటితోనే. చిన్నప్పటి మంచి చెబుతూఉన్నాగా ఇలా వాగవద్దని. దేనికయినా ఒక హద్దూ పద్దూ ఉండాలి కొంచెంసేపు బండిదగ్గర వుండు. పాదరీ నేనూ బయటికివెళ్ళి ఈ క్యాతలిక్కు రెజిమెంటువాళ్ళ జండా ఒకటి సంపాదించాలి మన బండికి. పనిలో పనిగా పాదరీకోసం మాంసం కొనాలి. మనం వాళ్ళజండా ఎగరవేస్తూ ఉత్సాహంచూపటం వాళ్ళుచూస్తే పెద్ద ఎత్తున మన వ్యాపారం చేసుకోడానికి తప్పక అనుమతి ఇస్తారు. మనదగ్గర బేరసారాలు చేయ టానికి వచ్చేవాళ్లు అడిగేది నువ్వే మతానికి చెందినదానివని కాదు. వాళ్ళ ధ్యాసంతా వస్తువు ఎంత చౌకగా దొరికితే అంత చౌకగా కొనాలని, వాళ్ళ వాటిని మనకు అంటకట్టాలని. - చలికాలంలో క్యాతలిక్కులు కొనటానికి వచ్చేది ప్రొటెస్టెంటులకు మల్లె మంచిలాగులు, . షర్టులకోసం.

(బండిలోకి వెడుతుంది.)

పాదరీ : (చిన్నవాడితో) పెట్టెగొడవంతా మీ అమ్మ చూసుకుంటుంది. కాని ఒక్క సంగతి నీకు చెప్పాలోయ్.... మనకున్న అదృష్టం బండిలో భద్రపరుచు కున్నాం. కాని ఎంతకాలమని ఇలా కాపాడుకోగలం?

స్విప్‌కాస్ : ఇంకోచోటికి జారవేస్తేనో?

పాదరీ : ఇలాటిచోట్ల అలా చేయటం ప్రమాదం. మనమీద వీళ్ళు ఒక కన్ను వేసి వున్నారు. మారువేషాల్లో గూఢచారులుకూడా అంతులేకుండా ఉన్నారు. నిన్నప్రొద్దున బహిర్భూమికి వెడుతూఉన్నప్పుడు ఆ గోతులూ ఈ గోతులూ పరీక్షిస్తూఉన్న వాళ్ళని స్పష్టంగా చూశాను. వాళ్ళచూపులు చూస్తుంటే హడలిపోయాను.

మదర్ కరేజి : (బుట్టపుచ్చుకునివస్తూ) బండిల్లో ఏం కనబడ్డాయో తెలుసా? (కూతురివంకచూస్తూ) ఎర్రజోళ్లు. ఎర్రజోళ్ళు! ఆ భోగంపిల్లవి! దాని వృత్తికి విన్నూ తయారుచేస్తుందా? (బుట్టలోఉన్న చెప్పులు పైకితీసి పిల్లకిచూపి తిరిగి దానిలో ఉంచుతూ) సిగ్గులేదూ! వాటిని దొంగిలించావా?

లేక అది ఇచ్చిందా? ఆ వృత్తి వద్దు. దాంతో ఇంతో అంతో గడించినా అది వుండదు. కొంచెం ఓపకపట్టు. ఈ పాడుపిశాచం అలసిపోగానే శాంతిరోజులు వస్తాయి. అప్పుడు నిలకడగా ఒకచోట హాయిగా ఉండ వచ్చు. పెద్దపెద్దవాళ్ళతో స్నేహం కలుపుకోవచ్చు.

పాదరీ : మీ పిల్లకి పెద్దసంబంధాలు కుదరటం అంత సులభమైన పనికాదు.

మదర్ కరేజి : పరిస్థితులు మారితే ఎలాటిపనీ సునాయాసంగా జరిగిపోవచ్చు. అంతవరకు ఓపికపట్టివుండాలి. (కొడుకుతో) దాన్ని వున్నచోటనే ఉండ నియ్యి....మీరంతా వేసేవేషాలు చూస్తుంటే భయంగా ఉంది. పనిమీద వెళ్ళుతున్నాం. తిరిగి వచ్చేటంతవరకు అమ్మాయిని జాగ్రత్తగా చూసు కుంటూ ఉండు.

(పాదరీతో బయటికి వెళుతుంది. కాత్రీన్ భోజనసామగ్రి సర్దుతూ ఉంటూంది)

స్విస్‌కాప్ : బాగా ఎండ కాస్తున్నది. ఎంతకాలం ఇక్కడ కూర్చుని ఉండడం? (కాత్రీన్ ఆమాటవింటూ, దగ్గరలోఉన్న చెట్టు చూపుతూ దాని పీడలో కూర్చుంటే హాయిగా ఉంటుందని సంజ్ఞ చేస్తూంటూంది.) ఊహూ! అక్కడ నీడ బాగా లేదు. దాహంగా ఉంది. (పుచ్చుకోటానికి గ్లాసు తెచ్చి ఇస్తానంటూ కాత్రీన్ సంజ్ఞ చేస్తుంది) ఊ! ఇక్కడే కూర్చుంటూ ఆ సంగ తులు, ఈ సంగతులూ తాపీగా ఆలోచించుకుంటూ. (కొంచెంసేపు మౌనం) కాత్రీన్! అమ్మకు నిద్ర పట్టటంలేదు రాత్రిళ్ళు. ఎందుకో నాకు బాగా తెలుసు....పెట్టిని బయటికి తరలించివేశానా అంతా చక్కబడుతుంది.... మంచిచోటు కనిపెట్టా....ఎందుకిలా తాత్సారం చేయటం. చప్పున గ్లాసు తెచ్చియియ్యి.

(కాత్రీన్ బండివెనుకకు నడుస్తుంది.)

నదిఒడ్డున పెద్ద పాముపుట్ట వుంది ...పెట్టె భద్రపరచటానికి అదే మంచి చోటు. ఈ అలజడిపోయాక తిరిగి మనదగ్గరకు తెచ్చుకోవచ్చు .. ఊహూ! ఆ పనికన్నా రేపు తెల్లవారేలోపున రిజిమెంటువాళ్ళకి ఒప్పజెప్పితే సరి పోతుంది. పాపం. ఈ మూడురోజుల్లో సొమ్ముకోసం ఎంత బాధపడుతూ ఉంటారో!....ఈపనే చేశానా మా హవల్దార్ నన్నుచూడగానే నమ్మకంగా

ఖజానాపెట్టె తెచ్చినందుకు సంతోషిస్తాడు. నన్ను కౌగలించుకుని అభినందిస్తాడు.

(కాత్రీన్ గ్లాసునింపి బండిముందుకు వస్తూ తనకు దగ్గరలో ఎవళ్ళో ఇద్దరు నిలుచుని తనకేసి చూస్తూండటం పసికడుతుంది. ఒకడు మిలిటరీ దుస్తులతో ఉన్న హవల్దారు. రెండోవాడు తనమొహం కనబడకుండా హాట్ ఉంచుకుంటాడు. అతనికంటికి కట్టుకట్టబడి ఉంటుంది.)

కట్టుతోఉన్న మనిషి : (కాత్రీన్ అటురావడం చూస్తూ) ఏమయ్యాయి! రెండో ఫినిష్ రెజిమెంటు ఖజానాకు సంబంధించిన మనిషెవరైనా ఇటుకేసి రావటం చూశావా?

(ఆమాట వినడంతో కాత్రీన్ వణికిపోతూ చేతిలోఉన్న పానీయం తొణికిపోతూఉండటం గమనించకుండా ముందుకు గబగబ నడుస్తూ ఉంటుంది.)

స్విస్‌కాప్. (తన ఆలోచనాసముద్రంలో దొర్లిపోతూ. కాత్రీన్ తనకేసి రావటంతో చూస్తూ) ఏమిటాపని! తొణికిపోతున్నట్లు కనపడటంలేదా? ఎవళ్ళనేనా చూసి ఒళ్ళు మరిచిపోతున్నావా ఏం? అదేం బాగాలేదు. నేనే ఇక్కడి నుంచి వెంటనే ఎక్కడికైనా నడవడం మంచిదనుకుంటా. (మరోసారి కాత్రీన్‌కేసి చూస్తూ) ఎందుకలా వణుకుతావు? ఆ భయమేమిటో చెప్పు? మంచిపానీయం పాడుచేశావు. దప్పిగ్గా ఉంది. ఇలా పారబోస్తే ఇం కెలాగ?

(కూర్చున్న చోటినుంచిలేచి బండిలోకి పెద్ద తాడు పెట్టెతీసి దానిపైన తనకోటు కప్పుతూ) ఇదిగో కాత్రీన్! తిరిగి ఒక్కక్షణంలో వస్తా. నా మీద మండిపడవద్దు ఇలా హడావుడిగా కదలాలని వచ్చినందుకు.... ఏమిటా ఏడ్పుమొహం! ఏం జరిగిందో చెప్పరాదూ!

(ముందుకు నడుస్తుంటాడు. వాడిని ఆపాలని కాత్రీన్ సతమతమవుతూ ఉంటుంది. వాడు పరుగెత్తటంచూస్తూ కాత్రీన్ దోవలో కనబడ్డవాళ్ళని త్రోసుకుంటూ ముందుకు వెడుతూఉంటుంది. ఆ సమయానికి మదర్ కరేజి, పాదరీ అటుకేసి రావడం కాత్రీన్‌చూస్తూ అమ్మమీద పడుతుంది.)

మదర్ కరేజి : కాత్రీన్, కాత్రీన్! ఏమయ్యిందే తల్లీ! ఎవళ్ళయినా ఏమైనా

చేశారా? అబ్బాయి ఏడి? ఏమయిందో స్పష్టంగా చెప్పవే!....ఆ ఖడవ పెట్టివి ఎక్కడికైనా జారవేశావా కొంపముంచి?....చెప్పవే తల్లీ! ఏం జరిగిందో. నువ్వు ఇలా చేస్తుంటే పాదరి ఏమనుకుంటాడో తెలుసా?....

(కాత్రీన్ కొంచెం కుదటబడుతూ జరిగినసంగతి తనభాషలో వ్యక్తపరుస్తుంది.) ఏమంటావు? ఒంటికంటివాడా? నిన్ను పిలిచింది? ... ఏమండీ ఫాదరీ అది చెప్పేది మీకేమైన అర్థమవుతున్నదా?

ఫాదరీ: ఆ! ఒంటికంటివాడం టే అర్థమవుతున్నది. గూఢచారి అయివుండాలి. వాళ్ళు మీ తమ్ముడిని పట్టుకున్నారా అమ్మాయి!

(కాత్రీన్ తల అడ్డం త్రిప్పుతుంది. భుజాలు కదలిస్తూ ఉంటుంది)

ఇదంతా చూస్తుంటే మనం ఇక్కడినుంచి కదలడం మంచిదనుకుంటా.

మదర్ కరేజి: కదలటమా? అది ఎన్నటికీ జరగదు. తెచ్చుకున్న జండాని బండికి కడదాం. (బుట్టలోనుంచి తెచ్చినజండా తీస్తుంది. ఫాదరీ దానిని పుచ్చుకుని బండి స్తంభానికి జండా కడుతాడు. జండా ఎగురుతూంటూంది)

ఫాదరీ. (సమాధానపడుతూ) క్యాతలిక్కుల జండా ఈ ఆపత్కాలంలో మీ బండీ మీద ఎగురుతూ ఉండటం ఒకవిధంగా మంచిదే.

(ఎవరివో కంఠాలు వెనుకనుంచి వినబడుతూఉంటాయి. మరి కొంత సేపటికి ఇద్దరు స్విస్‌కాస్‌ని త్రోసుకుంటూ అటుకేసి వస్తుంటారు.)

స్విస్‌కాప్: ఎందుకలా ఎముకలు నొక్కుతారు? నాదగ్గర ఏం లేదు. నన్ను విడిచి పెట్టండి. నాకేం తెలియదు.

హవల్దార్: ఏడు వీళ్ళవాడే! (మదర్ కరేజితో) ఏమంటారు? మీవాడుకదూ వీడు.

మదర్ కరేజి: ఏమంటున్నారు? ఈ ఖడవ మావాడా?

స్విస్‌కాప్: (హవల్దారుతో) వీళ్లు ఎవళ్ళో నాకు తెలియదు. ఇక్కడ బండి ఉండటం చూస్తూ తినుబండారాలు ఏవైనా దొరకవచ్చు అని వచ్చా. డబ్బు ఇచ్చి తినుబండారాలు కొనుక్కుని తింటూ కొంచెంసేపు బండిముందు విశ్రాంతి తీసుకుంటూ ఉన్నా. అప్పుడు మీరు నన్ను చూసిఉండవచ్చు. సంగతి అంతే!

హవల్దార్ : వీడి బొల్లికథకేం గాని, ఇంతకూ మీ రెవరో తెలుసుకోవాలి.

మదర్ కరేజి : మేమా? మర్యాదస్థులం. ఆ అబ్బాయి చెపుతూఉన్నది నిజం. డబ్బు ఇచ్చి తినటానికి కొనుక్కున్నాడు. ఇక్కడే కూర్చుని తింటూ విశ్రాంతి తీసుకున్నాడు.

హవల్దార్ : వీడినిగురించి అంతకన్నా మరేం తెలియదన్నమాట?

మదర్ కరేజి : ఊహూ! అంతకన్నా మాకేం తెలియదు. సామానులు కొనటానికి మా దగ్గరకు వచ్చేవాళ్ళని వాళ్ళ పేరూ, ఊరూ, మతమూ ప్రశ్నించడం మాకు మామూలులేదు. మాదగ్గర వస్తువులు కొనుక్కునేవాళ్ళు మంచి మతస్థులే అయివుండాలి. (స్విస్‌కాస్‌కేసి చూస్తూ) నువ్వు ఎవడివోయ్? నాస్తికుడివా? లేక మా మతస్థుడివా?

స్విస్‌కాస్ : (తల ఆడిస్తాడు)

పాదరీ : అది చూస్తూంటే మన మతస్థుడే. ఆ సంగతి తెలుసుకోటం సంతోషంగా ఉంది. మనవాళ్ళే కడుపునిండా తినగలరు.

హవల్దార్ : (కాత్రీన్‌నిచూస్తూ) వీడు పరాయివాళ్ళ అబ్బాయి అయితే నువ్వెవరివి?

మదర్ కరేజి : ఆ పిల్లా? మా పనిమినిషి. తినేసామానులు, తాగే పానీయాలు అందజేస్తూఉండటం దానిపని....అ! మిమ్మల్నిచూస్తూంటే ఈ ఎండలో బాగా అలిసినట్లూంది. ఒక్కక్షణం ఆగండి. గ్లాసునింపుతా మీ అలసట తీర్చుకోడానికి.

హవల్దార్ : డ్యూటీలో ఉన్నసమయంలో పానీయం ముట్టం. (స్విస్‌కాస్‌తో) పెట్టి ఇక్కడినుంచే కదలించావు. నదిఒడ్డున ఎక్కడో దాచివుంచావు. ఇక్కడినుంచి నువ్వు వెడుతూన్నప్పుడు నీ కోటు క్రింద పడిపోయింది (చూపుతూ) ఇది నీదే కదూ?

మదర్ కరేజి : ఏమండోయి హవల్దార్‌గారూ! మీరు అంటున్నది నిజమేనా?

స్విస్‌కాస్ : ఎవళ్ళకోటోచూపి నాది అనుకుంటున్నాడు. ఆ దోవన ఒకతను అదరా బాదరా పరుగెత్తుతూ ఉండడం చూశా. అతనిదే ఆ కోటు అయివుండాలి. అనవసరంగా నన్ను పట్టుకున్నారు.

మదర్ కరేజి : ఏమండోయ్, ఇందులో ఏదో పొరబాటుండాలి. మనుషులతత్వం నాకు బాగా తెలుసు! మదర్ కరేజి అంటారు నన్ను. అందరికీ తెలుసు నే నెవరినో; ఈ అబ్బాయి మంచి మాటకారిగా ఉన్నట్టు కనబడుతున్నది.

హవల్దార్ : స్వీడన్ రాజు రెండో ఫినిష్ దళానికి చెందిన ఖజానాశాఖవాళ్ళం మేము. ఖజానా సొమ్ము పెట్టె తరలించినవాడు ఎవడో మాకు బాగా తెలుసు. ఆ దొంగ పత్తా తెలుసుకోడానికి రెండురోజులనుంచి ఈ పరిసరాలని గాలిస్తూ ఉన్నాం. (స్విస్‌కాస్‌తో) ఏమిటీ నాటకం? నువ్వు మావాడివని నాకు తెలియదనుకున్నావా?

స్విస్‌కాస్ : మీకూ నాకూ ఏం సంబంధం లేదు. మీరు వెదకుతూఉన్న మనిషిని నేను కాను.

హవలార్ : ఆ నాటకం మాదగ్గరకాదు ఆడవలసింది. పెట్టె ఎక్కడ దాచావో చెప్పు?

మదర్ కరేజి (సమాధానపరచటానికి) ఈ అబ్బాయే మీ పెట్టె తీసుకునివుంటే ఆ సంగతి ఒప్పుకుని దానిని ఎక్కడ దాచివుంచాడో చెప్పివుండేవాడు. మీరు పెద్దమనుషులు. వీడు అమాయకుడిగా ఉన్నాడు. (స్విస్‌కాస్‌తో) ఒరే అబ్బాయి! చూడటానికి దద్దమ్మగా ఉన్నావు. హవల్దార్‌గారు చాలా మంచిమనిషి. అసలుసంగతి ఏమిటో ఆయనకు చెప్పుకోడం మంచిది.

స్విస్‌కాస్ : నాకేం తెలియదని చెప్పానుగా.

హవల్దార్ : ఓయ్! ఈ ఆటలు చాలించు. మావెంట రా. దానిని ఎక్కడ దాచావో మేమే చూపెడతాం.

(అబ్బాయిని లాక్కుని అక్కడినుంచి ఆ ఇద్దరు మనుషులూ నడుస్తుంటారు).

మదర్ కరేజి : (వాళ్ళని పిలుస్తూ) చేసినతప్పు వాడు ఒప్పుకుంటాడు లెండి. కొట్టకండి.

(వాళ్ళవెంట వెడుతుంది.)

# మూడవ ఘట్టం

(రెండవఘట్టంలో మనం కలుసుకున్నరోజున్నే ప్రొద్దు క్రుంకుతూ ఉంటుంది. పాదరీ, కాత్రీన్ పానీయం గ్లాసులు శుభ్రంచేసి సర్దుతూ ఉంటారు. ఆ పని ముగించడంతో పాదరీ బండిమెట్లమీద కూర్చుంటాడు. చొక్కాలో భద్రం చేసుకున్న బైబిలు కథలపుస్తకం పైకి తీస్తూ)

పాదరీ : ఇటువంటి విషాదఘట్టాలు మన మతచరిత్రలో సర్వసాధారణంగా ఎదుర్కొంటూనే ఉంటాం. ఈ సంగతులు తలుస్తూంటే నాకు జ్ఞప్తికి వస్తూన్నది మన క్రీస్తుప్రభువులవారి అంత్యఘట్టం. దీనినే కవి ఎంతో చక్కగా చిత్రిస్తాడు. (పుస్తకంనుంచి చదువుతూఉంటాడు) "అర్ధరాత్రి. ఒంటిగంట అప్పుడే కొట్టారు. ఆ గంట వినడంతో ఆ తరువాత ఎలాటి అవాంతరాలు ఎదురుకోవలసి ఉంటుందో ప్రభువుకు తెలుసు. తనని విర్దోషి అని రోము న్యాయమూర్తి ఫిలాటస్ ప్రకటించినా న్యాయసభకు వచ్చినపెద్దలంతా తనే దోషి అని, శిక్షార్హుడని ఏకగ్రీవంగా అన్నారు. పాపం! ఫిలాటెస్ అప్పుడేం చేయగలుగుతాడు? హేరోదురాజుకు కబురు పంపుతాడు. తను పెద్దల కోరిక మన్నించటానికి క్రీస్తుకు మరణశిక్ష విధిస్తున్నానని . .మూడోగంట కొట్టారు. చమురుతో ఒళ్ళంతా మర్దనచేసి ముళ్ళకిరీటం తలమీద అలంకరించారు. వాళ్ళనోటికి వచ్చినమాటలు ఆయనమీద విసిరారు. బరువైన కలప శిలువ మోసుకుంటూ వెళ్ళాలని నిర్బంధించారు....ఆరోగంట కొట్టనే కొట్టింది. దాంతో ప్రభువుని శిలువమీద ఎక్కించి మేకులతో గట్టిగా బిగించారు... అప్పుడు ప్రవహించిన రక్తానికి అంతుంటేగా! ఆ విషాదదృశ్యం చూడవచ్చిన జనం చేసిన కోలాహలం ఇక చెప్పాలా?... అంతేనా చేయాలిసిన అత్యాచారాలవి చేశారు. ప్రభువు ఆ యాతనకు ఓర్చుకోలేక గావుకేక లేస్తున్నాడు. తొమ్మిదోగంట మ్రోగేటప్పటికి ఆ కేకలు ఆగిపోయాయి. ఆయన దివ్యాత్మ పరమాత్మలో అయిక్యమైంది. భూమి కంపించింది. దేవాలయం లోపలితెర చిరిగిపోయింది. కొండల్లోని రాళ్లూ రప్పలూ చెల్లాచెదరై పోయాయి. ప్రొద్దు క్రుంకుతూఉన్నది. ఆయన్ని వాళ్ళకసి తీర్చుకొనటానికి ఈటెలతో పొడిచారు. అంతేనా? ప్రభువు కన్నులు గట్టిగా మూసుకున్నా వాళ్ళు కసి తీర్చుకొనటానికి మరెన్నిపద్ధతులు అవలంబించారో

ఇక మాటలతో చెప్పాలా? నరుడై పుట్టిన ఆయన ఇలాటి యాతనలతో ఇక్కడినుంచి తన తండ్రి లోకానికి వెళ్లిపోవలసి వచ్చింది."

(ఆ గాథని ఫాదరీ చదువుతూఉన్నప్పుడు కాట్రీన్ ఆయనప్రక్కనే కూర్చుని వింటూంటుంది. అంతులేని దుఃఖంతో మదర్ కరేజి నరుగెత్తు కుంటూ వాళ్ళముందుకువచ్చి క్రింద పడిపోతుంది. ఫాదరీ ఆమెను లేవ నెత్తి ఉపచారం చేస్తూంటాడు.)

మదర్ కరేజి: (కళ్ళుతెరుస్తూ. వాళ్ళకేసిచూస్తూ) చావుబ్రతుకులమధ్య ఊగిస లాడాల్సిన అవస్థ దాపరించింది మనకు. ఆ ఒంటికంటివాడూ ఈ హవ ల్దారూ చిన్నవాడిని ఏం చేసినా చేయవచ్చు. ఆ గండంనుంచి వాడిని బయటపడవెయ్యటానికి బోలెడుసొమ్ము వాళ్ళకు కుమ్మరించాలి. అంత సొమ్ము ఎక్కడినుంచి తేవడం? ఇలాటి అవకాశంలో మన యేవేట్టీ ఇక్కడ ఉండివుంటే ఎంతో బావుండేది. అక్కడినుంచి తిరిగి వచ్చే టప్పుడు దోవలో చూశాను కర్నల్‌ని. వయస్సులో ముసలివాడు. అయితే నేం? దానివలలో పడిపోయాడు. అది ఏం చేయమని పురమాయిస్తే దానిని తూ. చ. తప్పకుండా చేసిపారేస్తాడు. ఇక అదే మనకు అండ. వాళ్ళకు కుమ్మరించాలసిన సొమ్ము ఏదోవిధంగా అదే తెచ్చి మనలని ఆదుకో గలదు. ఆ సహాయానికే దానికి కబురంపాను.

ఫాదరీ: సలహా భేషుగ్గా ఉంది. కాని అంతసొమ్ము ఆ వారకాంత ఈ కర్నల్‌దగ్గర నుంచి తీసుకునివచ్చి ఇస్తుందా?

మదర్ కరేజి: అదే ఇయ్యకపోతే మరి ఎక్కడనుంచి తేగలుగుతాను? దాన్నే కాళ్లా వేళ్లా బ్రతిమాలుకోవాలి. నా బండి తాకట్టుపెడుతా అంత అవసర మైతే.

ఫాదరీ: నీ ఆస్తిపాస్తులు ఈ బండేగా! దానినే వాళ్ళకి తాకట్టుపెడితే నువ్వు ఎలా పొట్ట పోసుకోగలుగుతావు?

మదర్ కరేజి: ఊ! అదీ నిజమే! అయినా....(అదేసమయానికి వారకాంత యేవేట్టీ ముసలి కర్నల్‌ని వెంటబెట్టుకుని అక్కడికి ప్రవేశిస్తుంది)

యేవేట్టీ: (కరేజిని గాఢాలింగనం చేసుకుంటూ) ఇంత త్వరలో నిన్ను చూస్తానని కలలోకూడా అనుకోలేదు. (చెవిలో) ఇతను నీకు తెలుసుగా ఇప్పుడు.

నేను ఏం అడిగినా వెనుకా ముందూ చూడకుండా ఇచ్చేస్తాడు. (బిగ్గరగా) ఏమమ్మా! ఈ పెద్దమనిషి నా ఆప్తులు. నా మనసులో దొర్లుతూ ఉన్న కోరికలు వినకుండానే తనే ఊహించుకుని చప్పున తీరుస్తారు. మీ బండి అమ్మకానికి చూపాలని ఎవళ్ళో అనటం ఇప్పుడే విన్నాను. అది మాకు ఉపయోగపడుతుందో లేదో చూడటానికి వచ్చారు.

మదర్ కరేజి : ఊహూ! మీరు విన్నది గాలికబురు. ఇప్పుడు అర్జంటుగా కొంచెం డబ్బు అవసరం ఆ సొమ్ముకోసం కొన్నాళ్ళు ఎవళ్ళకైనా తెలిసినవాళ్ళకు బండిని తాకట్టు పెట్టాలని ఆలోచిస్తున్నాను. అమ్మయ్యో! నా బంగారు బండి అది. దానినే అమ్మివేస్తే మా గతేంకావాలి? నువ్వే చెప్పు.

యేవేట్టి. (విరుత్సాహంతో) తాకట్టుకా? . దానికైతే మేం తీసుకుంటామో లేదో తాపీగా ఆలోచించాలి. (ముసలి కర్నలుతో) మీరేమంటారు?

కర్నలు. నన్ను అడగటమెందుకు? నువ్వు ఏం చెయ్యాలనుకున్నావో దానిని తప్పక చెయ్యి. అదే నా కోరిక.

మదర్ కరేజి తాకట్టుకు ఒప్పుకుంటేనే మీ దగ్గరనుంచి సొమ్ము బదులు పుచ్చుకుంటాను.

యేవేట్టి: ఇప్పుడు డబ్బు చాలా అవసరంగా ఉన్నదని వింటున్నానే అది నిజమేనా?

మదర్ కరేజి· ఆ! చాలా అవసరం. దానికోసం బండిని తాకట్టుపెడుతా మీకు.

యేవేట్టి: (ముద్దుపేరుతో ముసలాయన్ని పిలుస్తూ) మీరేమంటారు?

కర్నలు: నీకు ఇష్టంఉంటే వాళ్ళకి సహాయంచేయటం మంచిదే.

యేవేట్టి: మీరు వింటున్నారుగా ఆయన అంటున్నది. ఆ సమస్య తీర్చాలసిన బాధ్యత నామీదే పెడుతున్నారు ...ఇప్పుడు ఏం చెయ్యాలి? (కర్నలుకేసి వయ్యారంగాచూస్తూ) తాకట్టు పెట్టించుకోడం మంచిదా లేక కొనివేయడం బాగుంటుందా మీరే చెప్పాలి.

కర్నలు: నువ్వేం చేయాలనుకున్నావో అదే చెయ్యి.

మదర్ కరేజి· అమ్మాయి! మీరు ఒక నిర్ధారణకు రావడానికిముందు బండిని ఒకసారి చూడండి. అది మీకు ఉపయోగంగా ఉంటుందో లేదో అప్పుడు తెలు

స్తుంది. అయన్నికూడా చూడవియ్యి, రెండువారాల గడువు ఇయ్యండి. ఆ లోపున్నే మీరు బదులు ఇచ్చేసొమ్ము తిరిగి ఇచ్చివేస్తా.

యేవేట్టి: (కర్నలుతో) వెళ్ళిచూద్దాం రండి. బదులు ఇయ్యటం మంచిది. (కరేజితో) రెండువారాలుమాత్రమే గడువు. అప్పటికి తిరిగి ఇయ్యకపోతేనో?

మదర్ కరేజి: మాట ఇస్తున్నానుగా. ముందే అందితే వారంలోపున్నే తిరిగి ముట్టజెప్పి నా మాట నిలుపుకుంటా.

యేవేట్టి: (కర్నలుని ప్రక్కకుతీసుకువి నడుస్తూ) ఈ మనిషి నాకు బాగా తెలుసు. కష్టంలో ఉంది. మాట ఇచ్చిందికూడా. గడువునాటికి చెల్లించకపోతే బండిని మనకే అమ్మివేస్తుంది. ఇందులో మనకు వచ్చేనష్టం ఏమీ లేదు.... ఊ! మీకు తెలుసుగా ఆ ఫాన్ రిచ్ ని. వరసుడు, అందగాడు, మంచి ఆస్తి పరుడుకూడా! చాలా సన్నిహితుడుకూడా నాకు. ఆయనంటే మీకు.... . . అతనిచెవిలో ఈసంగతి ఊదానంటే ఎంత కావాలంటే అంత ఇచ్చివేస్తాడు. ఆయన్ని తలుస్తూఉంటే ఎవరు జ్ఞాపకం వస్తూంటారో మీకు బాగా తెలుసుగా . ఆ సంగతి ఇప్పుడెందుకు మరి? ఈ విషయంలో మీ సలహా ఏమిటో చెప్పారు కారు.....

కర్నలు వాడు దద్దమ్మ. వాడిసంగతి ప్రస్తావించటం ఎందుకు? (చెవిలో) నువ్వు వాడివిషయంలో చాలా జాగ్రత్తగా మసలుతూఉండటం మంచిది.... సొమ్ముకోసం వాడిని దేబరించాలా? నేనున్నానుగా నీ కోరికలు తూ. చ. తప్పకుండా తీర్చటానికి.

యేవేట్టి: ఏమంటారు? మీదగ్గరనుంచా బదులు తీసుకోడం? ఏమంటారు. అతను దద్దమ్మ అనా? .. జాగ్రత్తగా ఉండమనా? ... ఈ లోకం మీకు బాగా తెలుసు . అయితే వాడిని అడగనులే - నా కల్పవృక్షం మీరేగా - మీ దగ్గరనుంచే తీసుకుంటా విశేషంగా ...

కర్నలు: వాడిసంగతి నాకు బాగా తెలుసు. అంచేతనే వాడు ఎటువంటివాడో చెప్పా.

యేవేట్టి: ఇలా వాడివిషయంలో హెచ్చరిక చేస్తూఉన్నందుకు కృతజ్ఞురాలిని.

కర్నలు: ఆ మాటేమిటి? వెయ్యాకళ్ళతో విన్ను ఆదుకోటం నా విధి. తాకట్టుకు ఒప్పుకుందాం. వాళ్ళకు అవసరమైనసొమ్ము ఇద్దాం.

యేవేట్టి : (ఆ ప్రక్కనుంచి కర్నలుతో కరేజి ఉన్నచోటికి గబగబవస్తూ) నా ఆప్తమిత్రులు ఒప్పుకున్నారు. కాగితంమీద వ్రాసిఇయ్యి సొమ్ము ముట్టిందని. గడువు రెండువారాలు. అప్పటికి బాకీ తీర్చలేకపోతే మీ బండిమీది హక్కులన్నీ మావి అని కూడా రాయి ...రాతకోతలు పూర్తికాగానే రెండువందలు తెచ్చి ఇస్తా. (కర్నలుతో) మీకు పనిపాటలు ఎన్నో వుంటాయి. తిన్నగా క్యాంపులోకి వెళ్ళండి. ఈపని పూర్తిచేసుకొనటంతో అక్కడికివచ్చి మిమ్ములని కలుసుకుంటా.

(కర్నలుని ముద్దుపెట్టుకొని ఆయన్ని పంపివేస్తుంది. మెట్లమీదనుంచి బండిలోకి అడుగుబెడుతూ లోపల ఆ ప్రక్క ఈ ప్రక్క అమర్చబడ్డ సరకులు చూస్తూ) అమ్మకానికి జోళ్ళసరుకు చాలా కొద్దిగానే ఉందే!

మదర్ కరేజి : (వెంట నడుస్తూ) ఊఁ! కొంచెం ఓపికపట్టు. ఆ సరుకూ బోలెడు సేకరిస్తా. నువ్వు ఇప్పుడు యజమానురాలివి. ఉత్తబండే కాదు. ఈ సరుకుకూడా ఇక నీదేగా. ఇక్కడ ఇలా వుండిపోతే మన వ్యాపారం సాగించటం కష్టం. అంచేత మకాం మార్చాలనుకుంటున్నాను....ఆ హవల్దారుతో మాట్లాడుతానన్నావుగా చిన్నవాడిని ఆ రొచ్చులోనుంచి బయటికి తీయించటానికి. ఆపని ఈ క్షణంలో చూడాలి. ఇంకోగంటలో మిలిటరీ కోర్టుకు తీసుకునివెళ్తారని తెలిసింది.

యేవేట్టి : ఎందుకా తొందర? .జోళ్ళు చూశా. షర్టులు జాగ్రత్తగా లెక్కబెట్టుకోనియ్యి.....

మదర్ కరేజి : ఈ గొడవ తరువాత చూసుకోవచ్చు. ఇప్పటికే చాలా ఆలస్యమైంది. (కోర్టుకు వెళ్ళటానికి డ్రస్సు చేసుకుంటూ) చప్పునవెళ్ళి ఆ పని తేల్చుకోకపోతే కొంప మునిగిపోతుంది.

యేవేట్టి : ఎందుకలా తొందరపడతావు? హవల్దారుతో ఆ ఒంటికన్నువాడిని ఎప్పుడో నా బుట్టలో వేసుకున్నా. అతనే ఈ గొడవ చక్కబెట్టగలవాడు... ఇప్పుడు నాకోసం మా డేరాలో తిష్ఠవేసుకుని కూర్చునివుంటాడు ...నన్ను చూశాకనే కోర్టుకు వెళ్ళటం కోర్టువాళ్లు అతను వచ్చేటంతవరకు ఓపికగా కూర్చునిఉంటారు...

ఫాదరీ : (అక్కడికివస్తూ) రెండువందలు వాళ్ళకి పోయటమెందుకు? నూట ఏబయి ఇస్తే చాలు; దాంతో తృప్తిపడుతారులే.

మదర్ కరేజి : ఏమిటీ పిచ్చివేషాలు ఈ సొమ్ము మీది అయినట్లు? ఇది మా వ్యవహారం. దాన్లో మీరు జోక్యం కలుగజేసుకోడం నాకు నవేమిరా ఇష్టం లేదు. బయటికివెళ్లి కూర్చోండి కక్షణం! మీ తిండివిషయం అమ్మాయి చూసుకుంటుంది. (యేవేట్టితో) ఇలా సామాన్లమధ్య తిష్టవేసుకుని కూర్చుంటే అవలుపవి ఎప్పుడు తేలుస్తావు? వద! (బయటికి తీసుకువి వచ్చి పంపివేస్తుంది ఎంతో బలవంతంతో.)

ఫాదరీ : (నసుక్కుంటూ బయటికివస్తూ కరేజితో మెల్లగా) నువ్వు అలా తొందర పడటం నబబుగా లేదు. ఇది కోర్టువ్యవహారం. అందులో పెద్దమొత్తంతో కూడుకున్నది. అంతసొమ్ము వాళ్ల పెట్టివగడువులో తీర్చటం అంత సులభం కాదు. ఆసంగతి తాపీగా ఆలోచించుకోవాలి. నువ్వు బ్రతకాలి. అంతకన్నాముఖ్యం ఆ మూగపిల్ల భవిష్యత్తు చూసుకోవాలి.

మదర్ కరేజి : ఇంతకన్నా మరే ఆలోచనలకు మీ బుర్రలో తావు లేనట్లుంటే! ఖజానాసొమ్ము ఇప్పుడు మనదేగా! దాంతో ఈ బెడదనంతా చాకచక్యంతో చక్కబెట్టుకోవచ్చు. ఏం కంగారుపడకండి ఇలాటి మా లౌకికవిషయాల్లో.

ఫాదరీ : అది సరేగాని, ఆ మనిషి తనమాట నిలుపుకుంటుందన్న నమ్మకం ఉందా?

మదర్ కరేజి . (మందహాసంతో) ఇలాటి బేరసారాల్లో గట్టిది. ఆ మునలికర్నలు దానికి దాసుడయిపోయాడు ఎంతడబ్బు అడిగినా తడుముకోకుండా ఇచ్చేస్తాడు. (కూతురువంకచూస్తూ) ఏమిటే అమ్మాయి! అలా శూన్యంలోకి చూస్తూఉన్నావు? అలావుంటే మన పనిపాటలు తెమలుతాయా? వాడుకున్న కత్తులు గ్లాసులూ ప్లేట్లూ అలాగే ఉంచావు. వాటిని కడిగి లోపల సర్దు. (ఫాదరీతో) ఇలాటిసమయంలో మీరు ఇలా పూరకే కూచోడం బాగాలేదు. దానికి కొంచెం సహాయం చేస్తూండండి . ఆ! మరచిపోయా చెప్పటానికి, ఇవ్వాళ సాయంకాలం పెద్ద ఆఫీసర్లు అయిదారుగురు మన పానీయాలకోసం వస్తామని కబురంపారు పానీయాలంటే చచ్చిపోయే వాళ్ళు. నీళ్ళకుమల్లె సొమ్ము పారబోయటానికి వెనుకదీపేవాళ్ళు కారు. అలాటి అతిథులని తృప్తిపరచటానికి పెద్ద ఎత్తున ఏర్పాట్లు ఇప్పటినుంచే చూసుకోటం ముఖ్యం....ఆసరికి కోర్టువాళ్ళు మనవాడిని నిర్దోషి అని విడిచి పెడతారు. ఆ సమయానికి వాడూ ఇక్కడికి క్షేమంగా చేరుకుంటాడు మనకు చేదోడుగా ఉండటానికి.

యేవేట్టి : (హడావుడిగా వస్తూ) రెండువందలు ముట్టజెప్పితేనే దాన్నంతా చక్కబెట్టమంటున్నారు. దానిని ఇచ్చుకోవాలి. ఇప్పుడు వాళ్ళదే పైచెయ్యి. అదీకాక వాడు ఒప్పుకున్నాడు వాళ్ళు పెట్టేబాధకు ఓర్చుకోలేక తనే పెట్టెని తెచ్చానని. వాళ్లు అనుకున్న పాముపుట్టలోకాక నీళ్ళలో పారేశాడు. అది మీకు దక్కుతుందని ఆశ పెట్టుకోకండి .. కర్నలుదగ్గరకు వెడుతున్నా ఆ సొమ్ము తీసుకొనిరావటానికి.

మదర్ కరేజి . (గుండెలు బాదుకుంటూ) ఏమంటున్నావు? ఏమంటున్నావు? ఆ ఖజానాపెట్టె మనకు దక్కదా? ఇక నీ బాకీ ఎలా తీర్చగలుగుతాను?

యేవేట్టి : అలాటి గొంతెమ్మకోరికలు మనస్సులో ఉంచుకోటం తప్పు. పెట్టె మీకు దక్కదు. మీవాడిని వాళ్ళవాతనుంచి విడిపించుకోవాలని మీకు ఆశవుంటే నేను బదులు ఇవ్వబోయే సొమ్ము తిరిగి ఇచ్చుకోవాలి. మీకు చేతకాకపోతే ఉత్తబండేకాక దానిలోఉన్న సామానంతా స్వాధీనం చేసుకుంటా! తెలిసిందా?

మదర్ కరేజి : యేవేట్టి! ఇంత బెట్టుసరా . అయినా ఇలాటివ్యవహారం చక్కబెట్టే చాకచక్యం నీకు ఉంది. నీ మందుపొడి వాళ్ళమీదచల్లి నూరు కాకపోతే నూటఇరవైకి ఒప్పుకునేటట్లు చూసుకో. ఆ బాకీకి నా బండి పోయినా ఫరవాలేదు.

యేవేట్టి . (నవ్వుతూ) వ్యాపారసరళితో దీన్నంతా చకచక తేల్చుకోవాలన్నసంగతి నీకు బాగా తెలుసు. కాని . ఆ ఒంటికన్నువాడు కాలాంతకుడు. రెండు వందలు కళ్లతో చూస్తేనేగాని రాజీకి ఒప్పుకోడు .. నన్ను చూడటంతో సొమ్ముకోసం తొందరపెట్టటం ప్రారంభించాడు. వాడి ఆశ తీర్చకపోతే చుక్క ఎదురవుతుంది ఏమంటావు? అంతసొమ్ము ఇయ్యమంటావా? లేక .

మదర్ కరేజి : అమ్మయ్యో! అంత ఇచ్చుకోటమా? నీ విచ్చినగడువులో నీ బాకి తీర్చుకోటానికి ఎక్కడినుండి వస్తుంది? ముప్పయిఏండ్లనుంచి ఈ వెట్టి చాకిరిలో మునిగి తేలుతున్నాను అమ్మాయికి అప్పుడే ఇరవై అయిదేళ్ళు నిండాయి. పెళ్ళి పెటాకులసంగతి చూసుకోవాలి. ఇప్పటికే క్రుంగిపోయాను. ఇంక భరించటం నా తరమవుతుందా? నూటఇరవైతో

తృప్తిపడేటట్లు చూసుకో. దానికి ఒప్పుకోకపోతే చిన్నవాడికర్మానికి వాడివి వొదిలేస్తాను...

యేవేట్టి · నీ బాధ తెలుసు. శాయశక్తులా ప్రయత్నిస్తా. పండో కాయో తరువాత చూసుకుందాం

(వెళ్ళిపోతుంది. మదర్ కరేజి దగ్గర తారట్లాడుతూన్న కూతురివంకగాని ఫాదరీ వైపుగాని కన్నెత్తిచూడక పాత్రసామానులు శుభ్రం చేస్తూంటుంది. కొంతసేపు విశ్శబ్దం.)

మదర్ కరేజి ; (కూతురితో) తమ్ముడికోసం బెంగ బెట్టుకోవద్దమ్మా. వాడు తిరిగి వస్తాడు. అందుకోసం వాళ్లు ఆశపడుతున్న ఆ రెండువందలూ ఇచ్చుకోటానికి తయారుగా ఉన్నాను. ఆ బాకీకి బండి పోతేపోనిద్దాం. చౌకకు కావడి కొందాం. దాంతో మనవ్యాపారం తిరిగి భేషుగ్గా చేసుకోవచ్చు. రోజులు మంచివి. ఏ దోవల్లో కాలుబెట్టినా మనవర్తకం ఏమాత్రం దెబ్బ తినదులే!

ఫాదరీ : బైబిల్లో చెప్పేవుందిగా మంచివాళ్ళని మంచిదోవల్లో నడపటానికి దేవుడు ఎప్పుడూ సిద్ధంగా ఉంటాడని.

మదర్ కరేజి : ఇప్పుడు ఈ సామాన్లు శుభ్రం చేస్తూండాలి. ఆ తరువాత దేవుడు చేసే సహాయం సంగతి తాపీగా ఆలోచించుకోవచ్చు.

(చడీ చప్పుడు లేకుండా అందరూ పాత్రసామానులు శుభ్రం చేస్తుంటారు. కాత్రీన్ చేస్తున్నపని చప్పున ఆపేసి బండివెనకకు ఆదరాబాదరాగా నడుస్తుంటుంది.)

యేవేట్టి : (పరుగిడుతూవస్తూ) కొంప మునిగింది, కొంప మునిగింది - ఒంటికంటి వాడు పేచీలు పెడుతున్నాడు ...నూటయేబయితో తృప్తిపడమని నయానా భయానా చెప్పా. తల అడ్డం ఊపాడు ఆ రెండువందలు చేతిలోపెడితేగాని ముందుకు అడుగుపెట్టనని .. ఇంకేక్షణంలోనైనా భేరీనాదం వినవచ్చు. అంటే కోర్టువాళ్ళు తీర్పు చెప్పారన్నమాటకు అది సంకేతమట! ఆ సొమ్ముకు మీరు తటపటాయించక ఒప్పుకోవాలి. అందుకే వచ్చా. నేను తిరిగివచ్చేదాకా కొంచెం ఆగమని బతిమాలుకున్నా.

మదర్ కరేజి : చప్పునవెళ్ళి రెండువందలు ఇయ్యి. (యేవేట్టి వెళ్లిపోతుంది.

మదర్ కరేజ్ మాటామంతీలేకుండా శూన్యంలోకిచూస్తూ కూర్చుంటుంది. పాదరీ తను చేస్తున్నపని కట్టిపెట్టి ఆవిడదగ్గరకువచ్చి కూర్చుంటాడు.

దూరాన్నుంచి భేరీనాదం వినబడుతూంటుంది.)

తీర్పు చెప్పటానికిముందే అది అంతా చక్కబెట్టేవుంటుంది. ఈ విషయంలో పేచీలు పెట్టడం నాదే తప్పు....

(పాదరీ కూచున్నచోటినుంచి లేచి బండివెనుకకు నడుస్తుంటాడు. కరేజ్ అలా కూర్చునేవుంది. కారుచీకట్లు పడ్డట్టు ఉంది ఆవిడ వాలకం చూస్తుంటే; మ్రోగుతూన్న భేరీశబ్దం కొంతసేపటికి ఆగిపోతుంది. కరేజ్ కూర్చున్నచోటినుంచి లేవలేదు.)

యేవేట్టి. (జేవురించిన ముఖంతోవస్తూ) అమ్మా! అమ్మా! వ్యవహారం చెడిపోయింది.. నువ్వు మాదగ్గరనుంచి అప్పు తీసుకోనక్కరలేదు. మీ బండీ అక్కరలేదు. దానిలోని సామానులూ నాకు అవసరంలేదు పదకొండు గుడ్లు ఉపయోగించారు.. అంతే; అంతకన్నా ఎక్కువ అవసరం లేకపోయింది. ఎన్నోవిధాల వాళ్ళకు నచ్చచెప్పాం పెట్టె నీళ్ళలో పారేశాడనీ కష్టపడితే దానిని గట్టు చేర్చవచ్చునని, కాని నమ్మినపాపాన పోతేగా వాళ్లు! వాళ్ళఅనుమానం అది ఇక్కడే వుందని. నీకు ఇందులో ఇంకో అంతో జోక్యముందనికూడా వాళ్ళు వచ్చేలోపున. అది ఇక్కడవుంటే మరోచోటికి చడీచప్పుడూ లేకుండా తరలించివేయండి....కాట్రీన్ ఏది? దానిని నాతో తీసుకుని వెడతా!

(ఊహూ అని కరేజ్ తల అడ్డం త్రిప్పుతుంది)

దానికి ఈ గొడవ తెలుసా? బహుశా ఆ భేరీశబ్దం, మందుగుండ్ల సందడి వినివుండదనుకుంటా. వినివున్నా ఆ ప్రేలుడులు మనకు సంబంధించినవి కావని అనుకున్నా అనుకోవచ్చుకదూ!

మదర్ కరేజ్. దానికా! బాగా తెలుసు ఏం జరుగుతున్నదో.. ఊ! నీవెంట తీసుకునివెళ్ళడమే మంచిది.

(యేవేట్టి బండివెనుకకు వస్తుంది. అయోమయావస్థలో, తికమక లాడీపోతూన్న కాట్రీన్ భుజంతట్టి తల్లిదగ్గరికి తీసుకునివస్తుంది. కరేజ్ కూతురి చేతులు గట్టిగా నొక్కుతూ హత్తుకుని పంపుతుంది.

అవేళనే ఇద్దరు సోల్జర్లు శవాన్ని మోసుకునివచ్చి అక్కడ కాళీగాఉన్న బల్లమీద ఉంచుతారు. వాళ్ల వెంట హవల్దార్ కూడా వస్తాడు.)

హవల్దార్ : పేరూ ఊరూ చెప్పటానికి మా కిష్టంలేని మనిషిశవం ఇది. రూల్సు ప్రకారం కోర్టులో జరగాలసిన తంతంతా యథాతథంగా సాగిపోయింది. గుడ్డతీసి ఒకసారి శవాన్నిచూడండి. అది ఎవరిదో గుర్తించగలుగుతారా?

(శవంమీద గుడ్డ తొలిగిస్తాడు. మదర్ కరేజి తన కేమీ ఈ గొడవ తెలియదన్నట్లు తల అడ్డం త్రిప్పుతూ ఉంటుంది.)

అలా అయితే మీది కాదన్నమాట! తిరిగి గుడ్డకప్పి తీసుకుపోదాం. (సోల్జర్లతో) ఆలస్యం ఎందుకు? చప్పున ఎత్తుకోండి. పాపం! ఈ దౌర్భాగ్యుడికి 'నా' అన్నవాళ్ళు ఈ లోకంలో ఎవళ్ళూ లేరు. వీడు ఎవడో అన్నసంగతికూడా వీళ్లకి పట్టనట్లుంది. ఎవడో వీడు! అలాటివాళ్ళని పూడ్చివేయాలసినచోటికే తీసుకుపోదాం, నడవండి.

(శవాన్ని ఎత్తుకుని నడుస్తారు సోల్జర్లు.)

## నాలుగో రంగం

(ఇంకా క్యాతలిక్కులదే పైచెయ్యి. కొన్నినెలలు దొర్లుకుని పోతూం టాయి. మదర్ కరేజి వ్యాపారం ఈ రోజుల్లో దెబ్బ తింటూంటుంది మిలిటరీవాళ్లే ఆవిడసరుకు ఆ నెపంతో ఈ నెపంతో కొల్లకొడుతూఉండడం మూలాన. ఈవిధంగా దెబ్బతిన్నవాళ్లు వాళ్ల కష్టనిష్ఠూరాలు చెప్పుకోటానికి, నష్టపరిహారం పొందటానికి, రెజిమెంటు కర్నలుదగ్గరకు రావచ్చు. ఆసంగతి తెలుసుకున్న మదర్ కరేజి తనకు మిలిటరీవాళ్ళు తెచ్చిపెట్టిన నష్టాన్ని చెప్పు కొనటానికి కర్నలు మకాం చేస్తున్నచోటికి వస్తుంది. తనకుమల్లె కాక పోయినా, ఏదోవిధంగా దెబ్బలు తిన్నవాళ్లూ, అంతేకాక కర్నలుమూలాన స్వయంగా నష్టపడినవాళ్ళు అక్కడికి ఆ సమయానికే రావడం చూస్తూ వాళ్ళు చెప్పుకునేబాధలు వింటుంది. దాంతో ఆవిడకు ప్రాతరోజులు జ్ఞాపకం వస్తాయి అన్యాయం అనేకకోవల్లో మనిషి విజాయితీని చిందరవందర చేస్తుంది అలాటి గడ్డురోజుల్లో జీవనరథం సునాయాసంగా నడుపుకోవా లంటే, అన్యాయాన్ని ప్రతిఘటించటంకన్నా, చూపీ చూడనట్లు ముందుకు నడవడం శ్రేయస్కరమని తెలుసుకుంటుంది. ఆ సలహాను ఇప్పుడు ఇక్కడికి వచ్చినవాళ్ళకి ఇస్తుంది మదర్ కరేజి.)

[మిలిటరీక్యాంపు. కర్నలు డేరాముందు. ప్రొద్దుటిపూట. కర్నలుకు మిలిటరీ సిబ్బందిమూలాన వచ్చిననష్టం చెప్పుకు దానిపరిహారార్థం కోరటానికి వచ్చి అక్కడవున్న బల్లమీద కూర్చునిఉంటుంది కరేజి. కర్నలు గుమాస్తా లోపలినుంచి ఆమెకేసి ఎగాదిగాచూస్తూ బయటికి వస్తుంటాడు.]

గుమాస్తా : ఏమమ్మా ! మీరేకదూ మదర్ కరేజి ? మా వాళ్ళమీద ఫిర్యాదు చేయ టానికికదూ వచ్చింది ! మీ విజాయితీ మాకు బాగా తెలుసు. ఖజానాపెట్టె దొంగిలించుకుని వచ్చినవాళ్ళకి తల దాచుకోటానికి తావిచ్చిన పెద్దమనుషులు మీరేకదూ ! మావాళ్ళమీద కేసులు పెట్టడంతో ఇప్పుడు మీరు పడుతున్న బాధకన్నా మరింతబాధపడాలసివస్తుంది జాగ్రత్త !

మదర్ కరేజి : అలా అంటే ఎలా చెప్పండి. మా బండిని చెడగొట్టారు. ఎంతో ఖరీదైన సరకులను కొల్లగొట్టారు. దీన్నంతా సహించి వూరుకోమంటారా ?

అదీకాక, ఇక్కడ వ్యాపారం చేసుకుంటున్నందుకు రెట్టింపుపన్ను చెల్లించాలని నోటీసు కూడా పంపారు మిమ్మల్ని బ్రతకమంటారా లేదా?

గుమాస్తా: ఏమిటా అధికప్రసంగం? ఇలా వాగుతూంటే మరెన్నో నోటీసులు అందుకోవాలసి వస్తుంది. నా సలహా, మీరు మాట్లాడకుండా ఊరుకోడం మంచిదని ఈమధ్య మా దళాలమధ్య వర్తకం చేసుకునేవాళ్లు ఎవళ్ళూ దొరకకపోవడంవల్ల, దయతలచి మీకు ఈపనికి అనుమతి ఇచ్చాము. అందుకు సంతోషించాలి.

మదర్ కరేజి: మీవంటివాళ్లు అలా అనడం న్యాయమేనా?

గుమాస్తా: (విసుక్కుంటూ) మరేం అనాలి?....సరే! సరే! ఫిర్యాదు చెయ్యడానికి వచ్చారు. ఆఫీసర్‌కు ఇప్పుడు తీరికలేదు మీగొడవ వినడానికి . . ఆయన పిలిచేటంతవరకు ఓపికపట్టి అక్కడే కూర్చోవాలి.

(లోపలికి వెళ్ళిపోతాడు, అతను లోపలికి అడుగు బెట్టాడో లేదో రైతువాళ్ళ పిల్లవాడు కేకలువేస్తూ అక్కడికి వస్తాడు.)

రైతువాళ్ళ అబ్బాయి: (నలుప్రక్కలా చూస్తూ) ఆ గాడిద ఏడి? పట్టి చాకిరి చేయించుకున్నాడు. సొమ్ము అడిగితే చెడామడా తిట్టాడు. ఈ డేరాలోనే ఉండాలి ...బయటికి రానియ్యి. ఏంచేస్తానో తెలుసుకుంటాడు.

(మరోనిమిషంలో మునలిరైతు రొప్పుతూ వస్తాడు.)

మునలి రైతు: (పిల్లవాడిని చూస్తూ) ఒరేయి అబ్బాయి! నువ్విలా వాగుతుంటుంటే వాళ్ళు జైళ్ళలో పెడతారు. ఆ తరువాత పీకు దిక్కుండదు.

(పిల్లవాడిని అక్కడినుంచి తీసుకువెళ్ళటానికి ప్రయత్నిస్తాడు.)

రైతువాళ్ళ అబ్బాయి: నన్ను వొదిలిపెట్టు. ఇప్పుడు చూస్తాగా వాళ్ళేం చేస్తారో, ఆ గాడిద, నేను ఒడ్డుదగ్గర ఉండటంచూసి, ఎంతో ఆప్యాయంగా నా దగ్గరకు వచ్చాడు. మంచి బహుమతి ఇస్తానని నీళ్ళలోకి దూకమన్నాడు. లోపల ఈదుతూన్నది వాళ్ళగుర్రం....అది ఓ పళాన చిక్కలేదా?.... ఎలా అయితేనేం దొరికింది. దానిని గట్టుమీదికి నడిపించి ఒప్పించాక థాం థూం అంటూ వెళ్ళిపోయాడు....బయటికి రానియ్యి. నాకు రావాలసినకూలి వసూలుచేస్తా.

ముసలిరైతు: (కరేజితో) ఏమమ్మా! వీడివాగుడు మీరు వింటున్నారుగా, వీడికి బుద్ధి చెప్పండి. వాళ్లు పెద్ద ఆఫీసర్లు. వాళ్ళనుగురించి ఇలా నోరుజారితే ప్రమాదం కదూ!

మదర్ కరేజి: (అబ్బాయితో) ఎందుకు అబ్బాయి అలా నోరు చేసుకుంటావు? ఇయ్యవలసిన సొమ్ము ఇయ్యనన్నాడా?

రైతువాళ్ళ అబ్బాయి: అదంతా మీ కెందుకు? ఈ విషయంలో కలుగజేసుకోకండి. అతన్ని రానియ్యండి. నా తడాఖా జూపిస్తా.

ముసలిరైతు: మావాడికి మతిపోయిందమ్మా. తన ప్రాణానికికూడా తెగించి కర్నల్ గుర్రాన్ని ఊబిలోనుంచి రక్షించాడు. నేనూ విన్నాను బహుమానం ఇస్తానన్నమాట. మావాడు అమాయకుడు. గుర్రాన్ని రక్షించి ఎంతో వినయంతో చెయ్యి చాపాడు ..మేము పల్లెటూరివాళ్ళం. వాళ్ళు పెద్ద మిలిటరీ ఆఫీసర్లు మావాడు చేసినసహాయానికి సంతోషం చూపకుండానే చీదరించుకుంటూ వెళ్ళిపోయాడు ఆ పెద్దమనిషి. లోకం అలాటిది. మంచివాళ్ళకు కాలంకాదు.

మదర్ కరేజి: (అబ్బాయితో) వాళ్ళు అన్యాయంచేశారనే అనుకో. నువ్వు ఇలా అరవటం మంచిదికాదు. నీ వయస్సులో ఉన్న కుర్రవాళ్ళసంగతి నాకు బాగా తెలుసు. అలాటివాళ్ళలో మా చిన్నఅబ్బాయి ఒకడు. నీకుమల్లే వాగడం మూలాన నా కొంప ముంచాడు. కొంచెం శాంతించటం మంచిదోయ్.

రైతువాళ్ళ అబ్బాయి తిండిలేక మలమల మాడిపోతున్నాం....ఇంత అరుస్తూ ఉన్నా లోపలినుండి బయటికిరాడే! లోపల ఆ మనిషి చేస్తూన్నదేమిటి? తప్పతాగి తందనాలు ఆడుతూ ఉంటాడు

మదర్ కరేజి: అబ్బాయి! ఆకలిబాధ అంటే ఏమిటో నాకూ బాగాతెలుసు. వీళ్ళ అఘాయిత్యాలు కళ్ళార చూస్తూనేవున్నాను. యుద్ధంమూలాన ఎక్కడ చూసినా కరువూ, కాటకమూ. దీనికంతా కారణం వీళ్లే. రైతుల్ని బ్రతకనియ్యరు. ఆ పేరుతో ఈ పేరుతో వాళ్ళదగ్గరున్నదంతా గుటకాయిస్వాహా చేస్తారు.

రైతువాళ్ళ అబ్బాయి: నన్ను అన్యాయం చేశాడు. చూస్తూచూస్తూ ఊరుకోమంటారా ఏమిటి?

మదర్ కరేజి: అంతకన్నా మరో గత్యంతరం లేదోయ్ ఈ గడ్డురోజుల్లో. నా సంగతి చూడు. పొట్ట పోసుకోటానికి నేను చేస్తున్నవ్యాపారం చిందర వందర చేశారు. నేను ఇక్కడికి రావడం నా యీ గొడవ చెప్పుకోటానికే! ఎంతసేపు కనిపెట్టుకువున్నా ఆ దొర దర్శనమిచ్చేస్థితిలో ఉండేగా! లోపల ఏదో పనిలో మునిగిపోతున్నాడని గుమాస్తా అంటున్నాడు. ఆయన మునిగిపోతూఉన్న పనేదోగాని, అది ఎప్పుడు తేలుతుందో మరి! (అబ్బాయితో) ఒరే అబ్బాయీ! వాళ్ళని మంచిచేసుకోవాలి....

రైతువాళ్ళ అబ్బాయి: (అడ్డువస్తూ) మంచి చేసుకోవాలా? (ఒరలోనుంచి కత్తి తీస్తూ) మంచి చేసుకోడం కాదు....దీనితో దార్లోకి తీసుకురావాలి....

మదర్ కరేజి: అలాంటి అఘాయిత్యం చేస్తే ఇంకేమన్నా ఉందా? ...జాగ్రత్త.

ముసలి రైతు: మావాడికి మతిపోయిందమ్మా! ఎలాంటి అఘాయిత్యమయినా చేస్తాడు. వెర్రికుంక. మీరన్నా కొంచెం బుద్ధి చెప్పండి.

మదర్ కరేజి: అబ్బాయీ! మనపని సూటిగా జరిగిపోవాలంటే ఓపికపట్టి వుండాలి. ఈ రోజుల్లో అదే మనకు మంచిమార్గం.

గుమాస్తా: (లోపలనుంచి) ఖామోష్! ఏమిటా గొడవ. ఖామోష్! ఇలా గొడవ చేస్తూంటే ఏమవుతుందో తెలుసా! కొంచెం ఓపిక పట్టాలి. కొంచెం పేచీల్లో ఆఫీసర్ మిమ్మల్ని పిలుస్తారు. నిశ్శబ్దంగా కూర్చోండి అంత వరకు.

(రైతు అబ్బాయికి ఏం తోచిందో బల్లమీదికివచ్చి కూర్చుంటాడు. ముసలిరైతూ వాడిప్రక్కన ఉంటాడు.)

మదర్ కరేజి: (చిన్నవాడితో) ఆ కత్తి ఒరలో జాగ్రతపరచటం చాలా మంచిది. (తనప్రక్కన కూర్చున్నవాళ్ళతో) ఈ అబ్బాయితో అంటున్నది మీరంతా వింటున్నారుగా! అణకువ పెద్ద విద్య. దాంతో సహనత ఉండాలి, తాపీగా కూర్చుంటే మన తాహతు ఏమిటో తెలుసుకోవచ్చు. విసుగున్నామా మన బుద్ధి మందగిస్తుంది....ఇల్లా అంటున్నందుకు నన్ను అపార్థం చేసుకోకండి. నేను మహామహా గొప్పదానిననికాదు. తప్పులు చేశాను. అంతూ వంతూ లేకుండా మోసాలు చేశాను. దెబ్బలు తిన్నా....ప్రతిపక్షులని పై చెయ్యి అయితే మౌనం లొంగిపోవడం తప్పదు ...ఈ సందర్భంలో లొంగి

పోయిన అమ్మాయి విషాదగాధ జ్ఞప్తికి వస్తున్నది. ఆ అమ్మాయి వయస్సులో చిన్నది. అందకత్తె వాళ్ళవూరు చిన్న పట్నవాసమైనా ఆ వయస్సులో ఉన్న అమ్మాయిలు చాలామంది వున్నారు. ఆ పిల్ల అస్తమానమూ అనుకుంటూండేది తనలో ఏదో గొప్పవిశిష్టత ఉందని. ఆ వయస్సులో ఉన్నపిల్లలూ అనుకుంటుండేవి తమే అందకత్తెలమని. వాళ్ళ అందచందాలు ఇతర్లముందు ప్రదర్శిస్తూ మంచిపేరు తెచ్చుకోవాలని ఉర్రూతలూగుతూ ఉంటారు. అందుచేత ఈ అమ్మాయి బుర్రలో దొర్లుతుండే ఆలోచనలు తను ఎప్పుడూ తనవయస్సులో ఉన్న పిల్లలకన్నా ఒక అడుగు ముందుకే వేయాలని. ఎత్తుస్థలాలు కనబడితే వాటిశిఖరాలు చేరుకునటానికి వదురూబెదురూ లేకుండా ఒక్కొక్క మెట్టు గబగబ ఎక్కుతూ ఉండాలని ... ఇతర్లు చెప్పేదానికంతా ఊకొడుతూ కూర్చున్నావా మన భవిష్యతంతా తలక్రిందులై పోతుంది. మనకు సన్నిహితులు అని అనుకుంటున్నవాళ్ళ విషయంలో కొంచెం దూరంగా ఉండటం మంచిది. మన కోరికలు తూ. చ. తప్పకుండా సాధించుకునాలంటే ఆ నియమం ఉండాలి ఈ నియమం ఉండాలి అని తర్జనభర్జనలు చేసుకోకూడదు .. అందుచేత ఆ పిల్ల ఇతర పిల్లలకన్నా ఒక ఆకు ఎక్కువ చదవాలని ఉబలాటపడుతూ ఉండేది. ఒక రోజురాత్రి. వాళ్ళ డాబామీదనిలుచుని ఆకాశంకేసిచూస్తూ తను ఎంత అందకత్తెనో చూడమని పైనున్న తారను అడిగింది. ఆ తార ఆ పిల్లకేసి చూసింది. ఎంతోసేపు చూసింది. ఆ తరువాత ఆ పిల్లచెవిలో "నీ ఉత్సాహం బాగానే ఉంది. లోకం నిన్ను అంతసులువుగా గుర్తించటం చాలా కష్టం. రెండు మూడేళ్ళు ఓపికపట్టివుండు. మంచిభక్తిఉన్నట్లు చర్చికి నడుస్తూండు మిలిటరీవాళ్ళ అడుగులు అనుకరిస్తూ. అలాకాకపోతే చదివప్పుడూ చేయకుండా ప్రవేశిస్తుండడం అలవాటు చేసుకో. లోపల నీకు నచ్చినయువకుడు ఎవడైనా తారసిల్లివుంటే ఆ కోవలో ఈ కోవలో నీ తెలివితేటలు వ్యక్తపరుస్తూఉండు. ..నీకు నచ్చినవాడు ప్రత్యక్షమవుతాడు. అతనికేసి చూడడంతో నీ పండు పండిందని వుబ్బి తబ్బిబ్బై పోతావు....కాని, నీ భవిష్యత్తు తారుమారవుతుంది. కనీ వినీ ఎరగనిఘట్టాలు ఎదుర్కొంటూ ఉండాలి అప్పటినుంచి" ఊదింది ఆ తార....

మనిషి అనుకుంటాడు. తన భవిష్యత్తునంతా చూసుకునేది దేవుడని. ఆ సంగతి తార ఆ పిల్లకు చెబుతూ "అవన్నీ పెద్దపెద్దమాటలు. అలా చెప్పేవాళ్ళమాటలు నమ్మకు. ఎప్పుడూ నమ్మకు... సంవత్సరం దాటకుండానే తెలుసుకుంటావు. ఇక నీ భవిష్యత్తు ఎలాంటి వరవళ్ల త్రొక్కుటో తూ ఉంటుందో! .. పాపలు మెడకు పెనవేసుకుంటారు. తిండిసామాన్లధరలు ఆకాశానికి ఎగిరిపోతాయి. అంతేనామరి? ఇంటిఖర్చులు. ఒకదానికి మించింది మరొకటి....ఆ సమయానం నువ్వు లేకపోతే తనజన్మ నిష్ప్రయో జనమని కోతలు కోస్తుంటాడు, నిన్ను కబళించుకున్న మగరాయుడు!.... కొంతకాలానికి నీ అందచందాలు మరుగుపడిపోతాయి దాంతో ఇంతవరకు నిన్ను తన తలమీద కూర్చోబెట్టుకునేవాడు మూలకు త్రోసివేస్తూ నీచేత వట్టిచాకిరీ చేయించుకుంటాడు. అమ్మాయి! ఒకచేతికి బిడ్డు పట్టిందా మరో చేతికి అంటకుండా వుంటుందా మరి?....ఇలాటి తుపానులు అంతులేనన్ని నేను చూశాను. నాకుమల్లే నీలాంటివాళ్ళచెవుల్లో ఈ సంగతి ఇతరతారలు ఊదుతూ ఉండటం నాకు బాగాతెలుసు. ఇదిగో అమ్మాయి! నువ్వు క్షణ్ణంగా తెలుసుకునాలసింది నీ ఇంటికి నువ్వే యజమానురాలివని. ఆ దృష్టితో నీ త్రోవన నీ కాళ్ళమీదే నడవటానికి గట్టిగా ప్రయత్నించు. అప్పుడే నీ అడుగుజాడలగుట్టు అవగాహనం చేసుకోగలవు. కొండలను, గుట్టలను అమాంతంగా ఎక్కగలవు ..." అని అన్నది.

(మదర్ కరేజీ ఆ పిల్లకథను పూర్తిగా చెప్పకుండానే ఒక్కక్షణం ఆగి చిన్నవాడివంక చూస్తూ)

అబ్బాయి! అంచేత నీకు నా సలహా ఏమంటే. నువ్వు అనుకుంటు న్నంతశక్తి నీకు ఉన్నా....ఇలాటిసమయాల్లో నువ్వు ఆ కత్తిని దూయటం తప్పు.. ఊరికె ఆవేశపడి ప్రయోజనం లేదు. మంచుపొగ మనలని ముట్ట డిస్తుంది. ఉక్కిరి బిక్కిరి చేస్తుంది. అదంతా కొంచెంసేపే! తరువాత తేలిపోతుంది మన కోపతాపాలూ అలాగే... ఇప్పుడు నేను నీకు చెప్పేది చదీచప్పుడూకాకుండా వచ్చినదోవన తిరిగి నువ్వు వెళ్ళిపోవటం మంచి దని...

రైతువాళ్ళ అబ్బాయి: (ఏం తోచిందో) మీ సలహా బాగుందమ్మా. నన్నూ ఆ పిల్లకుమల్లె ఒకమూలకు త్రోసివేస్తారు వాళ్ళపని పూర్తి చేయించుకున్న

తరవాత. (కత్తి తిరిగి ఒరలో ఉంచి, అక్కడినుంచి కదులుతాడు. ముసలి రైతు వాడి ననుసరిస్తూ వెడుతాడు.)

గుమాస్తా: (హడావుడిగా లోపలినుంచి బయటికి అడుగువేస్తూ) హుంషార్, ఆఫీసర్ సీటులోకివచ్చారు. మీ ఫిర్యాదులు ఇప్పుడు వచ్చి చెప్పుకోవచ్చు.

మదర్ కరేజి: (కూర్చున్న స్థలంనుంచిలేస్తూ) ఊహూ! నా మనస్సు మార్చుకున్నా. చెప్పుకోవలసింది ఏమీ లేదు.

(అక్కడినుంచి వెడుతుంది. అక్కడ కూర్చున్నవాళ్లూ మదర్ కరేజి మార్గం అనుసరిస్తూ నడుస్తుంటారు.)

# అయిదో రంగం

మరి రెండేళ్ళ తరువాత. యుద్ధం దాని నియమిత హద్దులు అతిక్రమిస్తూ ఒక్క ఉత్తరాదినే కాక దక్షిణదేశాలని చిమ్ముపెడుతూ ఉంది. మదర్ కరేజి ఇప్పుడు దక్షిణజర్మనీకి చెందిన బవేరియా దేశములోకి వచ్చింది. అది 1631 సం॥ మధ్యజర్మనీ యుద్ధరంగంలో టిల్లీ అనే సేనానాయకుడు బ్రహ్మాండమైన విజయం సాధించాడు. ఉత్తరాదికిమల్లె దక్షిణ ప్రాంతాలలో ప్రజలు అనుభవిస్తున్న యాతన లకు అంతే లేదు. అలాటిపరిస్థితుల్లో కరేజి తన జవంసత్వానికి తల ఒగ్గితే తనకు వచ్చేనష్టం గుర్తిస్తూ గుండె రాయి చేసుకుంటుంది.

(మదర్ కరేజిబండి ఇప్పుడు యుద్ధజ్వాలలమూలాన చిందరవందరై పోతూన్నగ్రామాలలో ఒకదానికి సమీపంలో ఆగింది. మిలిటరీ వాద్యాలమ్రోతకు అంతే లేదు. అక్కడ మకాం చేసినప్పటినుంచి కరేజిప్లాను తన వ్యాపారం ఇక్కడ మిలిటరీవాళ్ళమధ్య పెద్ద ఎత్తున చేసుకోవాలని. బండికిదగ్గరగా గుడారం వేయబడివుంది. లోపల బల్లలు; ఒక బల్లముందు ఇద్దరు సోల్జర్లు కూర్చుని వుంటారు మదర్ కరేజి, కాత్రీన్ వచ్చే అతిధులకు పానీయాలు సిద్ధం చేస్తుం టారు బల్లముందు కూర్చున్న ఇద్దరు సైనికులలో ఒకతనిదగ్గర భాగ్యవంతుల స్త్రీలు ధరించే ఎంతో విలువగల మఖమల్ డ్రస్ ఉంటుంది.)

మదర్ కరేజి: (కూర్చున్న సోల్జర్ల దగ్గరకువచ్చి) ఇదిగో చూడండి। పానీయాలు ఊరికే ఇవ్వబడవు. డబ్బు ముందుగా ఇవ్వాలి. మీరూ ఆ విజయధ్వనులు వింటున్నారుగా। అవి మన మంచికే. కాని వాటివల్ల బోలెడుడబ్బు వస్తుం దని ఆశ పెట్టుకోకండి.

మొదటి సైనికుడు: (ఏమీ విన్నట్లు) దాహంగా ఉంది. చప్పున ఒకగ్లాసు నాకు ఇయ్యండి. చుట్టుప్రక్కల ఊళ్ళు కొల్లగొట్టడంలో మునిగిపోతూ ఇక్క డికి రావడానికి చాలా ఆలస్యమైంది. ఒక గంటలోపలనే ఆ తతంగమంతా పూర్తిచేయాలని మా కెప్టెన్ ఆర్డర్లు. ఆయన చాలా మంచివాడు. అటువంటి వాళ్ళు ఉండడగా మాపని తొందరగా అయేది. ఇంతో అంతో మాచేతికి చిక్కేది.

ఫాదర్ : (గావుకేకలు పెడుతూ బయటినుంచి లోపల ప్రవేశిస్తూ) ప్రక్కవూళ్ళో ఎక్కడచూసినా మంటలు. రైతుకుటుంబాలు పడుతూన్నయాతన చూడలేక పోతున్నాను. ఇలాటి ఆపత్కాలంలో మనం వాళ్ళకి ఇంతో అంతో చేదోడుగా ఉండటం అవసరం. పాపం! వాళ్ళ గాయాలకు అంతేలేదు. వాటిని కట్టడానికి బట్టలు చాలా కావాలి.

మదర్ కరేజి : బట్టలా? వీళ్ళకోసం ఎప్పుడూ బట్టలేకావాలి! నాదగ్గర లేవు. ఉన్నవాటిని రెజిమెంటువాళ్ళకు ఎప్పుడో అమ్మేశా. ఇప్పుడు దాచివుంచి నవి పెద్ద ఆఫీసర్లకోసం. అవి వాళ్ళకు చాలా అవసరమైన తెల్లషర్టులు.

ఫాదర్ : ఎలాటివైతేనేం. కట్లు కట్టడానికి గుడ్డలు కావాలి.

మదర్ కరేజి : (గ్లాసులు నింపుతూ. బండిమెట్లు ఎక్కుతూన్న కూతురికేసి కోపంతో చూస్తూ) మనదగ్గరలేవని చెప్పాను. నీకు వినబడటంలేదా?

ఫాదర్ : (తను మోసుకువచ్చి బయట పడుకోబెట్టిన రైతుభార్యతో) అలా ఫిరంగులు ఓచ్చుపెడుతున్నసమయంలో మువ్వు మంటలమధ్య నడుస్తూండటం ప్రమాదం అని తెలియదా?

రైతుభార్య : (బలహీనస్వరంతో) అది మా ఇల్లు. మండిపోతూన్నది.

మదర్ కరేజి : (పాదరీకేసి తీక్షణంగాచూస్తూ) ఈ గొడవంతా మనకెందుకండీ? కట్లుకట్టడం ప్రారంభించారా. వాళ్ళంతా ఇకనుంచి ఇక్కడే తిష్టవేసుకుని వుండిపోతారు. అలా వీలులేదు ఇక్కడ. వెంటనే మరోచోటికి పంపి వేయండి.

సైనికుల్లో మొదటివాడు : (పానీయం పుచ్చుకుంటూ) వీళ్ళు ప్రొటెస్టెంటులు. వేరే మతాలవాళ్ళకు మనం ఎలాటిసహాయం చేయకూడదు.

మదర్ కరేజి : (ఆమనిషికేసి చూస్తూ) ఏమిటయ్యా మతం. మతం అంటావు. వాళ్ళకొంపలు కాలిపోతూన్నసమయంలోకూడా ఈ మతంగొడవ తీసుకు రావాలా?

రెండో సైనికుడు : (మొదటివాడితో) ఓరేయ్ నీకు తెలియదురా. వీళ్ళు ప్రొటెస్టెంట్లు కాదురా. మనవాళ్ళే!

మొదటి సైనికుడు : అలాగా! గుండ్లు కాల్చబోయేసమయంలో ఆ సంగతి మనకు తెలిపింది కాదురా.

రైతు : (అక్కడికివచ్చి భార్యప్రక్కన కూర్చుంటాడు ఎంతో బాధతో) నా చెయ్యి పోయింది.

పాదరీ : వీళ్ళబాధ చూస్తూ ఊరుకోడం న్యాయంకాదు. తాత్సారం చేయకుండా గుడ్డలు తీసుకురండి.

(అందరిదృష్టి మదర్ కరేజిమీదే. తనకు ఈ గొడవపట్టనట్లు ఒకమూల కూర్చుంటుంది.)

మదర్ కరేజి : (కొంతసేపు మౌనంగా ఉంది) ఊ హూ! నన్ను అడక్కండి. నే నివ్వను. వాళ్ళకు వీళ్ళకు ఇచ్చుకోవటం వీనన్నుప్పు వస్తులు. అందాలు. వడ్డీలు నన్ను పీల్చి పిప్పిచేస్తున్నాయి. అవి చాలక ఈ ఖర్చులుకూడానా!

(తల్లిమాటలకు కూతురు సహించలేక దుడ్డుకర్రపుచ్చుకుని వస్తూంటుంది.)

ఏమిటే ఆ ధైర్యం? నీ తల్లిమీదేనా? ఇవ్వాళ తప్పతాగి వుంటావు. కర్రను ఆ ప్రక్కన పారెయ్యి. లేకపోతే ఏం చేస్తానో నీకు తెలుసుకదూ!

(కరేజి అలా బెదరిస్తున్నా, తల్లిని ప్రక్కకుత్రోస్తూ బండిలోకివెళ్ళి చప్పున కనబడ్డ ఆఫీసర్ షర్టుతీసుకునివచ్చి పాదరీకి ఇస్తుంది. దానిని కట్ట డానికి పరపర చింపుతుంటాడు)

(పాదరీతో) ఏమిటీపని? నా బంగారంలాంటి షర్టుని చింపుతున్నారా? అదీ మీరూ ఏకమై నన్ను దివాలా తీయిస్తున్నారు ఎంత వెలో తెలుసా? ... (ఆ క్షణంలో దూరాన్నుంచి పసిబిడ్డ ఏడ్పు వినబడుతుంది. రైతు దంపతులు గావుకేకలేస్తూ "మా పిల్ల!" "మా పిల్ల!" అంటూ ఉన్నచోటి నుంచి లేవబోతూ ఉంటారు)

పాదరీ : (వాళ్ళని కూచోమని పురమాయిస్తూ) లేవకండి. మా అమ్మాయి పటు క్కునవెళ్ళి మీపాపను తీసుకునివస్తుంది. తొందరపడకండి.

మదర్ కరేజి: (పాదరీమాటకు అడ్డుకస్తూ) దాన్ని అటుకేసి వెళ్ళనీయకండి. వాళ్ళ ఇంటికప్పు పడేటట్లుంది। పట్టుకోండి అటుకేసి నడవనీయకుండా.

పాదరీ: ఆ పని నేను చేయను. కావాలంటే మీరే మీ అమ్మాయిని ఈడ్చుకుని రండి ఆ ఇంటిదగ్గర నుంచి.

మదర్ కరేజి: (కాళ్ళుకాలిన పిల్లిలా అటూ ఇటూ పరుగెత్తుతూ) మా అమ్మాయిని ఎందుకు లాక్కునిపస్తారు మీకన్నంతా నా బట్టలమీదే। ఎంత ధార పోశాను। ఎంత ధారపోశాను వాటికోసం. (మదర్ కరేజి కాలుతున్న ఇంటికేసి వెళ్ళబోతుంటే, రెండో సోల్జరు ఆవిడను కదలనీయకుండా పట్టుకుంటాడు. మంటలపాలై పోతున్న ఇంటికేసివెళ్ళిన కాట్రీన్ చంటిపిల్లను రక్షించుకుని చంకబెట్టుకుని పస్తూంటుంది) అనుకున్నంత చేశావే తల్లీ। అంత ప్రేమతో తీసుకుని రావడంలో తప్పేంలేదు. కాని మనదగ్గర వుంచవద్దు. వాళ్ళ అమ్మచేతికియ్యి. (కాట్రీన్ తటపటాయిస్తూంటుంది పిల్లని తల్లికి ఇయ్యటానికి) ఇదిగో ఇవ్వకపోయావా ఏం చేస్తానో చూడు.... ఏం మాట్లాడవు? ఏమన్నా అఘాయిత్యం చేస్తావా?.... నేనే లాక్కుంటా. (రెండో పైనికునితో) జయం మీదేనని తందనాలాడుతున్నావు. ఆ విజయమే నా కొంపముంచింది. ఆ పాడుమోతలు। నా మతి పోగొడుతున్నాయి. వాళ్ళని ఆపమని చెప్పండి. మీకంతా విజయం....అదే నా కొంప ముంచుతూన్నది. నా బంగారం। నా బంగారమంతా మట్టిలో కలిసి పోతున్నది.

పాదరీ: (రైతుకు, ఆయనభార్యకూ కట్లుకడుతూ) ఎంత జాగ్రత్త పడుతున్నా రక్తం కారటం మానలేదు.

(ఆ సమయంలో కాట్రీన్ తను మంటలలోనుంచి రక్షించుకున్న పాపాయిని ఎత్తుకుని లాలిస్తూ తన మూగభాషలో ఏమేమో చెబుతూ పాడుతుంటూంటుంది.)

మదర్ కరేజి: (ఈ దృశ్యంచూస్తూ) ఎంత ఆనందంతో ఆపిల్లని మా అమ్మాయి లాలిస్తూ పాడుకుంటూ ఉంది తన స్వంతపాప అయినట్టు।

(ఆ సమయంలో మొదటిసైనికుడు తాగుతూఉన్న పానీయాలకి డబ్బు చెల్లించకుండా చేతిలో ఇంకా ఉన్నగ్లాసుతో కాళ్ళకి బుద్ధి చెప్పుకోటం చూస్తూ) భరవా! ఇలాటివాళ్ళకే జయం!....ఆగు. డబ్బు ఇయ్యి. ఆతరువాతనే పదు ...

మొదటి సైనికుడు: (ఆగుతూ, అక్కడిమించే) ఇయ్యటానికి డబ్బువ్వంచేగా.

మదర్ కరేజి: (లేచి, వాడివి అటకాయిస్తూ వాడిదగ్గరనున్న మఖమల్ డ్రస్ లాక్కుంటూ) దీన్ని తీసుకుంటా. ఇదీ ఏదయితేగా: దొంగనదకు.

# ఆరో రంగం

మరో సంవత్సరం తరువాత మదర్ కరేజి ఇంకా బవేరియాదేశంలోనే ఉంటుంది. ఈ రోజుల్లో మకాం చేస్తున్నది కొండలమధ్యనున్న ఇన్‌గోల్‌స్టాట్ నగరం పరిసరాలలో. ఇంతవరకు యుద్ధరంగాలలో అంతులేని సాహసం చూపుతూ కీర్తిగాంచిన టిల్లీ సేనానాయకుడు అకాలమృత్యువువాత పడుతాడు. అక్కడి దళం వారు రాజలాంఛనాలతో అంత్యక్రియలు చేస్తుంటారు. ఆ అంత్యక్రియలకు వచ్చిన పెద్దలు టిల్లీ వీరగాథలనుగురించి ఉపన్యాసాలిస్తుంటారు. టిల్లీ సేనాధిపతికీర్తిని వెల పెట్టటానికి ముందుముందు యుద్ధాన్ని ఎలా నడిపించాలో ఆ పెద్దలు వాళ్ళకు తోచిన సలహా లిస్తుంటారు. మన ఫాదరీ ఆ సమయంలో తన అధికారందుస్తులలో ఆచార్య పదవి నలంకరించటానికి అవకాశం లేకపోయినందుకు విచారిస్తూ ఉంటాడు. కరేజి కూతురికి ముస్తాబుచేసి, బండిలో ఇంతవరకు భద్రపరచివుంచిన ఎర్రజోళ్ళు తొడిగి ఈ ఉత్సవానికి అక్కడి నున్నవాళ్ళవెంట వెళ్ళమని ప్రోత్సాహపరుస్తుంది.

చరిత్రకారులు ఈ సంఘటన 1632 సం॥ లో జరిగినందున, ఆ సంవత్సరానికి అంతులేని ప్రాముఖ్యం ఇస్తుంటారు.

(సంతరోజు. మైదానం. దుకాణాలకోసం డేరాలు వేయబడివున్నాయి. మదర్ కరేజికూడా ఈ సంతలో ఒక శిబిరం కట్టుకుని తన సరుకులు విక్రయించటానికి లోపల చక్కని ఏర్పాట్లు చేసుకున్నది. అతిథులకు ప్రత్యేకంగా బల్లలు, కుర్చీలూ వేయబడ్డవి సోల్జర్లు ఎంతోమంది బల్లలముందు కూర్చుని పానీయాలు సేవిస్తూ ఉంటారు. డేరాబయట చినుకులు పడుతున్నాయి. దూరాన్నుంచి ఫిరంగుల కాల్పులశబ్దం, విషాదకరమైన వాద్యసంగీతం వినబడుతూ ఉంటుంది. లోపల ఒక బల్లముందు ఫాదరీ ఒకప్రక్కన మిలిటరీగుమాస్తా ఇంకొకప్రక్కన కూచుని పేకాడుతుంటారు మదర్ కరేజి, కాట్రిన్. సరుకులజాబితా పుచ్చుకుని వాళ్ళసరుకులు పరీక్షిస్తుంటారు.)

ఫాదరీ: ఆ ఫిరంగుల హడావిడి ఈ సంగీతమూ వింటూంటే శవాన్ని సమాధి చేయటానికి బయలుదేరుతున్నట్లు అనిపిస్తుంది.

మదర్ కరేజి : (ఆ మాటవింటూ తను చూసుకుంటున్న పని ఆపుతూ) ఆ మహానుభావుడు ఇంత అకస్మాత్తుగా యుద్ధరంగంలో చచిపోవడంమూలాన ఆయన ఆత్మశాంతికోసం నాలుగుకజనుల మైనవవత్తులు వెలిగించాములే! మనం దురదృష్టవంతులం. ఈ రోజుల్లో ఆ నాయకుడు శత్రువులని చీల్చి చెండాలని, ఆపనికి తన స్వంతదళాలు చాలవని మూరదేశాలనుంచి కొత్త దళాలని తెప్పించుకున్నాడు. ఈపనికి ఎన్ని కట్టుదిట్టాలు చేసుకున్నా ఈ మంచుపొగ మనకు పెనుభూతంలా దాపరించింది. శత్రువులు తన పన్నాగాలు పసిగట్టి ఇంత హోరాహోరిగా మంచుగుండు ఉపయోగిస్తారని కలలోనైనా ఆయన అనుకున్నాడా? ఏమిటూ చెప్పుడు? (పేకాట ఆడుతూఉన్న వాళ్ళు పానీయాలు పుచ్చుకుంటూన్న సిపాయిలూ ఈలలు వేస్తుంటారు. వాళ్ళకేసిచూస్తూ) మీకు సిగ్గులేమా! ఇలాటి విషాదసమయంలో మీరు తందనాలాడుతున్నారా? మీరంతా ఈ సమయంలో అక్కడికి వెళ్ళడం ధర్మం.

మిలిటరీ గుమాస్తా: మీరంటున్నది అక్షరాలా నిజం. వీళ్ళజీతాలు ముందుగా ఇయ్యడం వాళ్ళతప్పు. అంచేతనే అక్కడికి వెళ్లడం ఎగగొట్టి ఇక్కడ తిష్ఠవేసుకుని కూర్చున్నారు.

ఫాదరీ : (గుమాస్తాతో) మీరు వెళ్ళడంకూడా అవసరం పదండి!

మిలిటరీ గుమస్తా : తప్పక వెళ్లాలసిందే. కాని ఈ పాడుచినుకులు నాపని చెడగొట్టాయి.

మదర్ కరేజి : (నవ్వుతూ) కారణం వేరే ఉంది. ఈ చినుకుల్లో నడిస్తే తన యూనిఫారం చెడిపోతుందని భయపడుతున్నాడు ఈ పెద్దమనిషి. ఆ రహస్యం నాకు తెలియదని అనుకుంటున్నాడు.

(బల్లదగ్గరనుంచి "ఏమమ్మో మదర్ కరేజి! ఘాటు ఘాటు పానీయం" అరుస్తున్నారు)

సొమ్ము ముందు. ఊ! దబ్బు చెల్లించంది పానీయాలు రావు. ఈ పాడు బురదజోళ్ళతో లోపలికివచ్చి ఈ చోటంతా ఎలా పాడుచేస్తున్నారో

చూడండి. బయట వాన. లోపలకూడా మీ మూలంగా బురద. (గుమాస్తాతో) ముందుగా డబ్బు ఇక్కడ పెట్టినవాళ్ళనే లోపల కూర్చోనివిస్తా.

(తిరిగి మిలిటరీవాద్యాల శబ్దం)

పాదరీ : మహోత్తరమైన సమయం ఇది. ఈ సమయంలో ఆ వీరుని ఆత్మశాంతికి మనం భంగం కలగచేయకూడదు.

మదర్ కరేజి : ఆ మహానుభావుడి ఉప్పు తింటున్నవాళ్ళకి ఈ సంగతి తెలియాలి. ఇలాటి సేనానాయకుల్ని, రాజుల్ని, చక్రవర్తుల్ని తలుస్తుంటే నాకే ఎంతో విచారంగా ఉంది. వాళ్ళు మనకోసం చేస్తున్నత్యాగం మరచిపోతున్నాం. వాళ్లు లేకపోతే యుద్ధం ఇంతకాలం జరగటానికి సాధ్యమవుతుందా? ఈ యుద్ధంవల్ల ఏవిధంగాచూసినా వాళ్ళకు మంచిలాభం. అదీకాక, వాళ్ళ ధర్మాన మావంటి చిల్లరదుకాణదార్లకూ ఇంతో అంతో ఆదాయం. సేనలో చేరినవాళ్ళకి మంచి శిక్షణ వుంటుంది. ఇక జనం సంగతా? యుద్ధం ఖర్చులు భరించడం వాళ్ళబాధ్యత ..ఆ గొడవ అలావుంచి ఇప్పుడు మన పెద్దలు ఆలోచించాల్సింది ఈ వీరుని స్మృతిచిహ్నంగా ఏం చేస్తే బాగుంటుందన్నవిషయం. శాశ్వతంగా ఉండిపోయే శిలావిగ్రహం మంచిదనుకుంటా. ఈయన ప్రజలమనిషి. అంతేకాదు, మనమతం నిలవబెట్టటానికి ఈ యుద్ధంలో సేనాధిపత్యం వహించాడు. అంచేత మతాచార్యుల మనిషి కూడా! (పాదరీనిచూస్తూ) ఇందుకు మీరేమంటారు?

పాదరీ : (చిరునవ్వుతో) ఈ విషయంలో మీతో పూర్తిగా ఏకీభవిస్తున్నా. మనవంటివాళ్ళకన్నా ఇక్కడఉన్న సైనికులకు ఆ వీరుడంటే ఎంతో ఇష్టం. భక్తిశ్రద్ధలు చూపటంలో వీళ్ళనే మొదట పేర్కొనాలి. ఈ పాడుచినుకులు పడకుండాఉంటే వీళ్ళంతా అక్కడికి వెళ్ళిఉండేవాళ్ళే... వీళ్లు ఇక్కడ చేస్తూన్నపని అర్థం చేసుకునాలి. ఆ వీరుని ఆత్మశాంతికి కడుపునిండా పానీయాలు పుచ్చుకుంటున్నారు. ఇంకా తనివితీరా తాగనిద్దాం. ఇలాటియుద్ధాలు ఎంతకాలం సాగితే అంతమంచిది. నన్నే అడిగితే నూరేళ్ళు సాగనివ్వమని చెబుతా. కాకపోతే రెండువందలఏళ్లు సాగనివ్వమని నా సలహా

ఇస్తా. యుద్ధంమూలంగా ఇంతో అంతో లాభం పొందేవాళ్ళకి ఇదే నిత్య కల్యాణం, పచ్చతోరణంగా ఉండాలి. ఈ మహాసేనాధిపతి కున్నంత వాక చక్యం నాకు లేకపోయినా ఆయన గీసిన గీతలోనే నడవాలని నా తాప త్రయం.

మదర్ కరేజి : మీరు చెప్పేది బాగాఉంది. .కాని మనం యుద్ధం ఆపటానికికూడా శాయశక్తులా ప్రయత్నించాలి.

ఫాదరీ : ఈ సమయంలో ఆయన అంత్యక్రియలు జరుపుకుంటున్నారు. ఇలాం టప్పుడు మనం కోరుకోవలసింది శాంతి కాదు; ఆటువంటివీరులు కొంత మందయినా కావాలని ! యుద్ధం సాగకపోతే అలాటి అవకాశం మన ఆపీ సర్లకు ఎలా లభిస్తుంది ?

మదర్ కరేజి : మనకు కావాల్సింది వీరులేకాదు. మన బేరసారాలు మామూలుగా సాగిపోతూఉండాలి. యుద్ధకాలానికి కావలసినసరుకు శాంతికాలంలో చౌకగా దొరుకుతుంది. అంచేత అడపా తడపా యుద్ధం ఆగాలి. ఆ తరు వాత సంధితంతు జరపాలి. ఆ కాలంలో మనకు కావాలసినసరుకు కొను క్కోవాలి. సంధిరోజులు నిలకడగా ఉండేవికావు. అథవా వాటికి నిలకడ కుదిరితే, అలాటిదానికి మనం అవకాశం ఇయ్యకూడదు. శాంతి సమరం కావడీకుండలు. రెండూ తూకంలో సరిగా ఉండేటట్లు మనం చూసుకోవాలి. లేకపోతే మనం చితికిపోతాం.

ఫాదరీ : ఊ ! మీ తాపత్రయం నాకు తెలుసు. అంచేత నా చర్చిప్రసంగాలలో నేను అంటూఉంటాను. "ఇప్పుడు కాకపోయినా ఎప్పుడో ఒకసారి యుద్ధం ఆగి పోవాలి" అని. ఆ వాక్యానికి నేను చేసేవ్యాఖ్యానం యుద్ధంలో అస్త మానమూ పని చేస్తూన్నవాళ్ళకి ఊపిరి పీల్చుకోటానికి కొంతకాలం విశ్రాంతి అవసరమని. అలా వాళ్ళు ఊపిరి పీల్చుకోకపోతే కొత్తశక్తి ఎలా లభి స్తుంది ? అటు యుద్ధంలో నైతేనేం, ఇటు శాంతికాలంలో నైతేనేం, రాజులు, భాగ్యవంతులు ఒకవైపు, మతాచార్యులు ఇంకొకవైపు చేదోడు వాదోడుగా ఉండాలి. ఇది లౌకికపద్ధతి. దీనినే అనుసరించామా లోకధర్మం యథాతథంగా సాగిపోతుంది.

ఒక సైనికుడు : (పానీయాల బల్ల దగ్గరకు నడుస్తూ పాడుతూ ఉంటాడు.)

ఇంకో గ్లాసు, చప్పున అందించు,
మా తెలివితేటలు చూపాలసింది ఇప్పుడే,
ఒకేచోట కూచుంటే సరిపోతుందా మరి ?
రాజులని కొలుస్తుండాలి సైనికులు,
చీల్చి చెండాడుతూండాలి శత్రుదళాలని.
చప్పున అందించు ఇంకో గ్లాసు
ఇంకో గ్లాసు, మరి ఇంకో గ్లాసు
మా పండుగరోజు ఈరోజు
పుచ్చుకోవాలి, మరింత పుచ్చుకోవాలి
మా రాజును కొలవటానికి
శత్రుదళాలని చీల్చి చెండాటటానికి
నడవాలి, నడవాలి,
చప్పుచప్పున నడవాలి.

మదర్ కరేజి : (అగమని సంజ్ఞ చేస్తూ) మిమ్మల్నే నమ్ముకుంటే. ...

పాదరీ : (అడ్డుపడుస్తూ) కొంచెం లౌకికం చూపాలి దబ్బునంగతి వీళ్ళకి జ్ఞాపకం చేయటానికి. యుద్ధం ఆగిపోతే మనగతేం కావాలి ? ఇలాటిసమయంలో వీళ్ళని గదమాయించకూడదు.

ఇంకో సైనికుడు : (పాడుకుంటూ)

ఆ గొడవ తలపోయటానికి
మాకు తీరిక వుంటుందా చెప్పండి
వీరులం మేం.
వీరత్వం చూపాలి ఎప్పుడూ
ఇక్కడ కాకపోతే మరోచోట
చూపుతాం మా వీరత్వం.

గుమాస్తా : (ఆత్రుతతో) సంధి, సంధి, సంధి ! ఓపరాన తాళం వేస్తున్నారు. ఈ యుద్ధం ఆపటానికి సంధి చేసుకోటం అవసరమనే అనుకుందాం. ఆ తరు

వాత దేశం ఏమవుతుందో మీవంటి లౌకికులే తాపీగా ఆలోచించుకునాలి. నా సంగతి మీకు అంత ముఖ్యంకాదు. ఈ దేశంకాదు మాది. సంధి చేసు కుంటే తిన్నగా మా దేశం వెళ్ళి, తిరిగి యుద్ధం ప్రారంభమయ్యేటంత వరకు అక్కడే హాయిగా వుండిరావచ్చు.

పాదరీ : మన గుమాస్తా మంచి లౌకికుడే ! ఆయనమాటలు వింటుంటే, ఇటు యుద్ధం, అటు సంధీ అవసరమే నవిపిస్తుంది. నా అభిప్రాయం అడిగితే బల్లగుద్ది చెప్పేది, శాంతిరోజులు అనేవి ప్రత్యేకంగా ఉండనక్కరలేదు. యుద్ధంలోనే అవే ఏదో ఒకరూపంలో పైకి వస్తూంటాయి, పోతూం టాయి. రాజకీయాలలో ఆరితేరినవాళ్ళకి ఈ గుట్టు స్పష్టంగా అవగాహన మవుతుంది. మనవంటివాళ్ళు కష్టాలు విస్మరించటానికి యుద్ధమే మంచి మార్గం అవి ఒప్పుకోవాలి.

(కాట్రీన్ ఈ సంభాషణ వింటూ వింటూ తను చేస్తున్నపని ఆపివేసి పాదరీవైపు వింతగా చూస్తూంటుంది.)

మదర్ కరేజి : అలా అయితే నాకు కావలసిన సరుకు శాంతిరోజుల్లో చౌకగా కొని యుద్ధంరోజుల్లో మంచి లాభానికి అమ్ముకోవచ్చు. మీరే నాకు అలా హామీ ఇస్తూఉంటే ఇక నా వ్యాపారానికి ఎలాటి ఆటంకాలూ ఉండవు.

(తల్లిమాట వినటంలో కాట్రీన్ చేతుల్లోఉన్న గ్లాసులు క్రిందపడేసి బయటికి వెడుతుంది.)

ఏమిటా హడావిడి కాట్రీన్ ? అంత తొందరపడితే లాభంలేదు. శాంతి రోజులు త్వరలోనే వస్తాయి. అంతవరకు ఓపిక పట్టాలి. (దగ్గర ఉన్న వాళ్ళతో) ఇలా దాంతో అంటున్నందుకు మీరు నన్ను అపార్థం చేసుకో వద్దు. దానికి ఒకప్పుడు మాట ఇచ్చా. యుద్ధం ముగియటంతో మంచి వరుణ్ణి చూస్తానని . దానికి నచ్చచెప్పి తీసుకువివస్తా....

(వెలుపలికి వెడుతుంది)

గుమాస్తా . (కూర్చున్నచోటినుంచి అమాంతంగా లేస్తూ) అయితే నేనే జయించా. ఆవిడ అన్నదానిలో ఎంతో అంతరార్థం ఉంది ...ఇక ఆమాట చెల్లించుకో వలసిన బాధ్యత ఆవిడదే.

మదర్ కరేజి : (మరోక్షణంలో కూతురిని లోపలికి తీసుకునివస్తూ) ఈ యుద్ధం మాత్రం మరి కొంతకాలం సాగేటట్లు చూసుకోవాలి మన తెలివితేటలుప యోగిస్తూ దాంతో మనం చేతినిండా సంపాదించుకోవచ్చు. (కాత్రీనుతో) అప్పుడు నువ్వు ఊళ్ళోకి వెళుతూ నీకు కావలసినవి కొనుక్కోవచ్చు. మనకు బండి ఉండనే ఉందిగా. నువ్వు కొన్నసరుకు దానిలో భద్రపరుచుకో వచ్చు. (గుమాస్తాతో) ఈ ప్లానువేయటం నీ కోసమే. (ఇతర్లతో) గుమాస్తా ఇక ఇక్కడే ఉంటాడు. వాళ్ళ దేశం వెళ్ళడు. (కాత్రీనుతో) అతను ఊళ్ళోకి నీవెంట వస్తుంటాడు సహాయం చేయటానికి . ఈ వాన రాకపోతే ఆ వీరుని అంత్యక్రియలకు మనంకూడా వెళ్ళివుండేవాళ్ళం వెడుతూన్నప్పుడు. తిరిగి వస్తూన్నప్పుడు ఈ మహానట్నం కళ్లార చూడ టానికి అదృష్టం ఉండివుండేది....ఇప్పుడు అసంగతి తలుచుకుని బాధ పడటం ఎందుకు చెప్పండి? అమ్మాయి! ఇక నువ్వు జాగ్రత్తగా మన లతూ ఉండాలి. పెళ్ళి అంటే అంత సులభమా మరి? అంతులేని సరుకులు పేకరించుకోవాలి . ఇక మాష్వ అవొక్కటే ఆలోచించాలి.

(కాత్రీన్ పట్టురుమాలు తీసుకుని కప్పుకుంటుంది. గుమాస్తాకి కంటి సంజ్ఞచేస్తూ అతనిని వెంటబెట్టుకుని బయటికి నడుస్తుంది.)

పాదరీ : (ఇంత తొందరగా కాత్రీన్‌లో కలిగినమార్పుకు విస్తుపోతూ) అమ్మాయి ఇలా గుమాస్తాతో వెళ్ళటానికి ఒప్పుకున్నావా?

మదర్ కరేజి : ఆ! అది వెళ్ళితే తప్పేముంది? అందకత్తె అయితేగా ఏదైనా ప్రమాదం రావచ్చని భయపడటానికి....నా వ్యాపారానికికూడా ఎలాటి నష్టం రాదు.

(లోపలఉన్న సైనికులు వెళ్ళిపోతుంటారు. అప్పుడు పాదరీ, కరేజి ప్రక్కప్రక్కనే కూర్చుంటారు)

పాదరీ : ఇలాటి వ్యవహారాలలో నీకున్న ధైర్యసాహసాలకి నిజంగా ఆశ్చర్యం వేస్తుంది. లోకమంతా నిన్ను కరేజి అని ఎందుకు పిలుస్తుందో ఇప్పుడు నాకు బాగా అర్థమవుతోంది.

మదర్ కరేజి : మావంటి బీదవారికి ఇలాటి ధైర్యసాహసాలు లేకపోతే బ్రతుకు తెరువులు ఎలాగ? నిద్రమంచి లేచేది ఈ మనోబలంతోనే. చీకట్లోకూడా

ఈ వెలుగులనే చూడటానికి శాయశక్తులా ప్రయత్నిస్తూ ఉండాలి. చక్రవర్తి పోపు దర్శనానికి వెళ్ళినా, పోపే చక్రవర్తిని స్వయంగా చూడటానికి వచ్చినా ఈ పచ్చిబలం లేకపోతే వాళ్ళకు చుక్కె ఎదురవడం ఖాయం. రైతాంగానికి ఈ గుండెనిబ్బరం లేకపోతే చవిటినేలల్ని ఎలా దున్ని సారవంతం చేయగలుగుతారు? యుద్ధాలను పెద్దలు వాళ్ళు అనుకున్న ప్లాన్ల ప్రకారం యధావిధిగా సాగించటానికి పట్టుదల ఎలా వస్తుంది?

(పైపుతీసి పుగాకు నొక్కుతూ అగ్గిపుల్లగీసి తనివితీరా పొగ పీలుస్తూ ఉంటుంది.)

ఏమయ్యోయ్! నువ్వు ఇలా గోళ్ళు గిల్లుకుంటూ కూచోడం సబబుగా లేదు. కొంచెం కాయకష్టం చెయ్యాల్సి వస్తుంది. నా గుండె నిబ్బరంచూసి ఇలా తబ్బిబ్బయిపోడం కాదు మీలాంటిపెద్దలు చెయ్యవలసింది. కట్టెల సంగతి చూసుకోవాలి. అమూల ఉన్నాయి. చిన్నచిన్నముక్కలుగా కొడితే మనపనికి చాలా అనుకూలంగా ఉంటాయి.

ఫాదరీ. (అయిష్టంతో తొడుక్కున్న చొక్కావిప్పుతూ సమీపాన్నే ఉన్న గొడ్డలి పుచ్చుకుంటూ) వృత్తిరీత్యా ఫాదరీని. ఆత్మవికాసం కలిగించడం మా పని. కట్టెలు కొట్టడం కాదు.

మదర్ కరేజి ఆత్మ అనేది ఒకటి ఉంటేగా. దాని వికాసానికి ఫాదరీలసహాయం అపేక్షించటానికి? నాకు ఇప్పుడు అవసరంగా కావలసినవి కట్టెలు వంటకు.

ఫాదరీ: ఏమిటా వెటకారం? అది సరేకాని ఆ పైపు తాగడం మర్యాదగా లేదు.

మదర్ కరేజి: ఇందులో వెటకారం లేదు. ఏమీ లేదు. పైపుసంగతి మీకు తెలిసే అంటున్నారా? ఒకసారి చూస్తారా?

ఫాదరీ: ఊఁహూ! చూడాలసింది ఇలాటిదికాదు. నా హోదాకు తగినదే నేను వాడాలి.

మదర్ కరేజి: నా హోదాకి ఇది తగదా?

ఫాదరీ: ఊఁహూ! ఆ పాత రీజిమెంటు వంటవాడు వాడుతుండేదికదూ ఇది?

మదర్ కరేజి: అయితేనేం? అలాంటివాడు వాడినదాన్ని వాడటంలో తప్పేం ఉంది? కాని ఈ ప్రశ్న ఎందుకు అడిగారో తెలుసుకోవచ్చా?

పాదరీ : మరేంకాదు దాన్ని నీవంటివాళ్లు వాడటం మంచిదికాదు. ఆ పైపు కాల్చిన వాడి నాస్తికత్వమంతా నీకు సోకుతుందని నా భయం.

మదర్ కరేజి పైపుకీ నాస్తికత్వానికీ సంబంధం ఏముంది ?

పాదరీ : అది మంచిదికాదు. పైపు వాడటంమూలంగా వాడి అవగుణం నీలో నాటుకుపోతుందని నా భయం.

మదర్ కరేజి : అలా భయపడాలసిన అవగుణం ఏమిటో తెలుసుకోవచ్చా ?

పాదరీ : ఇదిగోనమ్మా ! ఇలాటివిషయంలో నిన్ను హెచ్చరించడం నావిధ్యుక్త ధర్మం. దీన్ని వాడినవాడు అంత మంచివాడు కాదు. ఆ వాసనే నీకూ సోకితే భగవంతుణ్ణే పూర్తిగా మరిచిపోతావు. అందుకే ఇంతగా చెప్పవలసి వచ్చింది

మదర్ కరేజి : అతను విజాయతీగల మనిషి.

పాదరీ . అతను విజాయతీగల మనిషా ? పైపు ఎంత అధ్వాన్నంగా ఉందో ఒక సారిచూస్తే నీకు అర్థమవుతుంది అతనిసంగతి.

మదర్ కరేజి చూడటానికి చాలా బాగుందే ! ఆ మనిషి అస్తమానమూ వాడు తూండటంవల్ల కాస్త అరిగింది. అంతే !

పాదరీ : అరగడమేనా ? సగానికిసగం కొరికేశాడు కూడా ! కఠినపుష్టిగల మనిషి. అదంతా ఇందులో స్పష్టంగా ప్రతిఫలిస్తూనే ఉంది.

మదర్ కరేజి : (ఓపిక పట్టలేక) కట్టెలు కొట్టటానికి ఇష్టంలేదని చెప్పటానికి ఈ పురాణం ప్రారంభించినట్లుంది.

పాదరీ : మొదటనే చెప్పానుగా నాది కట్టెలుకొట్టే వృత్తిగాదని. నేను చదివింది మతశాస్త్రం... ఇక్కడివాళ్ళకి ఈ సంగతి తెలియక బండచాకిరికి నన్ను ఉపయోగించుకుంటున్నారు. దీంతో నాకు భగవానుడు ప్రసాదించిన దివ్య శక్తి నిష్ప్రయోజనమయిపోతోంది.. ఇది పాపకృత్యం. నీకు నా మత బోధలు వినే అవకాశం లభించలేదు. మా రెజిమెంటువాళ్ళని ఒక తాడుమీద నడిపిస్తూ శత్రుదళాలని హడలగొట్టటానికి ఎలాటి ఉత్తేజం కలిగించే వాడినో ఉత్తమాటలతో ఇప్పుడు చెప్పటం అనవసరం. ఎంతో అద్భుత

శక్తిని భగవంతుడు నాకు ప్రసాదించాడు. నువ్వేగనక నా ప్రసంగాన్ని విని ఆ సమయంలో నా ముఖవర్చస్సుని చూపేఉంటే ఇలా నన్ను చిన్న చూపు చూసేదానివా ?

మదర్ కరేజి : అలాటి ప్రసంగాన్నికాని అప్పటి ముఖవర్చస్సుగాని అసలు చూడడమే నా కిష్టంలేదు. ఒకవేళ చూసినా దాంతో ఏం చేసుకుంటాను మరి ?

ఫాదరీ ; నీ మాటలు అనుక్షణం వింటూనే ఉన్నానుగా. వాటిలో కావలసిన వేడి లేదు ...అదే నేను గ్రహించింది. నీవూ మనిషివే. మనిషికి కావలసిన వేడి నీలో ఉండాలి. ఏమంటావు ?

మదర్ కరేజి : మనకు కావలసినన్ని కష్టాలు మనకే ఉంటేనా, అలాటివేడి దానంతట అదే పుట్టుకొస్తుంది.

ఫాదరీ : అడిగినదానికి సూటిగా జవాబుచెప్పక తప్పుకుంటున్నావు. ఇప్పుడు మనం ఏకాంతంగా ఉండడం అదృష్టం. మనమధ్య గోడలు ఉండడం న్యాయం కాదు ఈ యుద్ధంగొడవ ముగిశాక అర్థమవుతోందా నేనేం చెప్పాలను కున్నానో ?

మదర్ కరేజి అంత తొందరపడకండి గోడలూ లేవూ, గీడలూ లేవూ మన మధ్య అదంతా మీ భ్రమ మనది సన్నిహితబాంధవ్యమే. నేను మీకు వంట వండిపెడుతున్నాను. మీరు కడుపునిండా తింటూఉన్నారు. ఆ బాంధవ్యం మరింత గట్టిపడటానికి కట్టెలు కొట్టి పెడుతున్నారు ఇప్పుడు ...

ఫాదరీ (చేస్తున్నేపని కట్టిపెట్టి ఇంకా దగ్గరకువస్తూ) 'మధ్య గోడలు' అంటే ఇంకా దానిగూడార్థం అవగాహనం కాలేదనుకుంటూ, వంటచేయడం, తినడం కట్టెలు కొట్టడం, ఇలాటి కోవకుచెందిన మరి ఇతరకార్యకలాపాలు క్రింది అంతస్థుకి చెందినవి నువ్వు ఇలా గుండె రాయిచేసుకోడం మంచిదికాదు. నీ గుండెమీద చెయ్యి వెయ్యనియ్యి. . మన ఈ సమస్య సులభంగా పరిష్కారమై పోతుంది.

మదర్ కరేజి : ఆ గొడ్డలి పుచ్చుకునిమాత్రం నాకేసి రాకండి. చెప్పానుగా మనది ఎంతో సన్నిహితసంబంధం అని. అది చాలదా ?

పాదరీ: అలా నన్ను చిన్నబుచ్చటం ఘోరం. తాపీగా ఆలోచించే ఇలా అంటున్నాను.

మదర్ కరేజి: ఏమండోయ్ పాదరీ మహాశయా! నా దగ్గర కొంచెం మర్యాదగా నడుచుకోడం మంచిది. మీకు నాపట్ల ఎంతో సానుభూతి ఉన్నదన్న విషయం స్పష్టమవుతూనేవుంది.... దాంతో మీరు చెప్పేదానికంటా ఊకొడతానని ఆశ పడకండి. ఇలాటిసమయాల్లో నేనేం చెయ్యాలో నాకు బాగా తెలుసు. అంచేతనే ఈ యుద్ధంరోజులలో నా పిల్లలని పెంచి, పెద్దవాళ్ళని చేయటానికి నా బండిని జాగ్రత్తగా ఉపయోగించుకుంటున్నాను. ఈ సేనానాయకుడు అకాలమృత్యువాత పడడంతో పంది కుదరవచ్చునని దాంతో శాంతి రోజులు రాబోతాయని అందరూ ఉబలాటపడుతున్నారు కొంపముంచి అలాటిరోజే వచ్చిందంటే నా వ్యాపారం బాగా దెబ్బతింటుంది. నేనే దాంతో క్రుంగిపోతే, ఇక మీ రెక్కడికి పోగలుగుతారు? ఆ సంగతి మీరు ఆలోచించడం అవసరం ఇలాటి గడ్డురోజుల్లో. అంచేత నేను మీ కిచ్చే సలహా కట్టెలు కొట్టడంలో మీ చాకచక్యం ఉపయోగించమని వాటితో సాయంకాలం చలిమంట వేసుకోవచ్చు ఇలాటిరోజుల్లో అంతకన్నా ముఖ్యం మరేముంది? ఏమిటా చప్పుడు? అమ్మయ్యో! కాట్రీన్!

(కాట్రీన్ గడగడవణుకుతూ లోపలికి వస్తుంది. ముఖంమీద పెద్ద బొబ్బ. మోసుకువివచ్చిన సంచులు, కట్టలు, తోలువస్తువులు-ఆ తోలువస్తువుల్లో చిన్న ఢంకాకూడా ఉంటుంది - క్రింద పడేస్తుంది.)

ఏమిటే అమ్మాయి! ముఖం అలా వాచిపోయిందేమిటే? వస్తున్నప్పుడు దోవలో ఎవళ్ళయినా అటకాయించారా? (బొబ్బని పరీక్షిస్తూ) ఇదంత ప్రమాదమైంది కాదులే. వెంటనే కట్టుకడతాను. రెండువారాల్లో నయమవుతుంది భయపడకమ్మా! ఈ ప్రాంతాలజనం అడవిజంతువుల కన్నా హీనం! (గాయానికి కట్టు కడుతుంది)

పాదరీ; ఇదంతా యుద్ధం చేస్తున్న అత్యాచారం. మనుషుల్లోఉన్న చెడ్డ అంతా బయటికొస్తుంది.

మదర్ కరేజి. (అమ్మాయితో) ఆ గుమాస్తా నీ వెంట రాలేదా! ఇక్కడ నిన్ను దించటానికి. నీ అదృష్టం దీంతో. సరిపోయింది. అంత పెద్దది కాదులే. నయమైనతరువాత గాయం గురుతులు ఉండవు. కట్టు జాగ్రత్తగానే

కట్టాను. కొంచెం జాగ్రత్తగా మెలగుతూండాలి ఇలాటిచోట్లలో నడుస్తూ ఉన్నప్పుడు ...క్రాటీన్! నువ్వు ఊళ్ళోకి వెళ్లాక సామాన్లు సర్దుతూన్నప్పుడు నీకోసం జోళ్లు తీసివుంచాను. (యెవెట్టీ వాళ్ళదగ్గర వదలిపెట్టిన ఎర్రచెప్పులజోళ్ళు తీస్తూ) వీటని ఒకసారి చూడు. వీటిని వేసుకోవాలని ఉబలాటపడుతూ ఉండేదానివి కదూ! నువ్వే నిరభ్యంతరంగా వాడుకోవచ్చు. నీకోసమే అది మనదగ్గర వదలిపెట్టి వెళ్ళింది.

(చెప్పులకేసి చూడకనే క్రాటీన్ బండిలోకి ఎక్కుతూంటుంది.)

పాదరి: ఈ గాయంమూలంగా ముఖం వికారం కాకుండా మనం జాగ్రతపడాలి.

మదర్ కరేజి: మచ్చ ఎలాగైనా ఉండిపోతుంది గాయం నయమైనాక. కొంత రోజులు వచ్చాక దానిని కప్పిపుచ్చటానికి ఏదైనా ఉపాయం చూసుకో వచ్చు

పాదరీ: ఈ సమయంలో ఊళ్ళోకి వెళ్ళకుండాఉంటే ఈ ఆపద వచ్చేదికాదు.

మదర్ కరేజి: అది బయలుదేరటానికిముందే ఈ హెచ్చరిక చేసివుంటే ఇంత ప్రమాదం దాపరించేదికాదు. స్వేచ్ఛగా వదిలేస్తే అది ఒళ్లు మరిచిపోతుంది. ఇలాగే ఒకనాడురాత్రి ఒంటరిగా బయటికి వెళ్ళింది. ఆనాటిసంఘటన ఇప్పటికీ మరిచిపోలేను.

(క్రాటీన్ తెచ్చిన సామాన్లుతీసి లోపల సర్దుతూ)
ఇదంతా యుద్ధం మహత్తు. ఇవి అమ్మి చేతినిండా డబ్బు గడించవచ్చు.

(బయట ఫిరంగుల సందడి)

పాదరీ: ఆ వీరుణ్ని ఈపాటికి సమాధి చేసివుంటారు. ఆ శబ్దం చారిత్రకంగా సుప్రసిద్ధమైన ఘట్టమవుతుంది ముందుతరాలవాళ్ళకి.

మదర్ కరేజి: మా అమ్మాయి మొహంమీది దెబ్బకూడా చరిత్రలో విశిష్టస్థానం సంపాదించుకుంటుంది. దెబ్బతో ఒక కన్ను పోయినట్లే! ఇక దానికి వరుణ్ణి వెదకాల్సిన అవసరమే ఉండదు. మూగపిల్లేగాక, ఇక గుడ్డిపిల్లగా ఉండాల్సినగతికూడా పట్టింది. చిన్నవాడు చనిపోయాడు. పెద్దవాడు బతికి వున్నాడో లేదో ఆ దేవుడికే తెలియాలి. యుద్ధం ప్రసాదించిన శిక్ష ఇదంతా!

# ఏడో రంగం

ఆరో రంగంలో మనం కలుసుకున్న సంవత్సరంలోనే. సంధి చేసుకొనటానికి మారుగా యుద్ధాన్నే యథాతథంగా నడుపుతూండాలని పెద్దలు నిశ్చయించుకున్నారు దాంతో మదర్ కరేజి వ్యాపారం బాగా లాభసాటిగా సాగుతూన్నట్లు ఆవిడ ఈ రోజుల్లో వేసుకున్నదుస్తులు, ధరించిన నగలూ చాటుతాయి.

(రాజమార్గం. ఫాదరీ, కూతురు కాట్రీన్ బండి లాగుతుంటుంటారు. బండిలోపల వ్యాపారం పెద్ద ఎత్తున చేయటానికి సేకరించుకున్న సరుకు. కరేజి బండివెంట నడుస్తూంటుంది. మెడలో కాసులగొలుసు.)

మదర్ కరేజి యుద్ధం మిమ్మల్ని అలసట పెట్టేస్తుండటం నిజమే అయితేనేం కొంతకాలం దీనికంతా ఓపిక పట్టుకునివుండాలి. శాంతిరోజుల్లో కొంచెం విశ్రాంతి తీసుకుంటే అంతా చక్కబడిపోతుంది మన కడుపులు నిండాలంటే యుద్ధం ఉండాలి. శాంతిరోజులు వచ్చినా తిరిగి దానికోసం మనం ఎదురుచూడాలి. మీ బలాబలాలు పరీక్షించేది యుద్ధం యుద్ధమంటే వ్యాపారం. అంతకన్నా మరేం కాదోయి యుద్ధం డబ్బాలో వెన్నను ధిద్రవరుచుకున్నట్లే యుద్ధం ఒకసాకు మనవ్యాపారం సాగిపోవటానికి అంచేత కాలిమీద కాలువేసుకుని కూర్చుంటే అంతా చకచక జరిగిపోతుందనే వెర్రిమొర్రి ఆలోచనలకు మీ బుర్రల్లో తావియ్యకండి తిష్ఠవేసుకుని కూచున్నవాళ్ళు చటుక్కున లేవాలి ముందుకు నడుమూ బెదురూ లేకుండా నడవాలి శాంతి కావాలని, అది కావాలని ఇది కావాలని గొంతెమ్మ కోరికలు కోరుకుంటూంటారు కొంతమంది వాళ్ళకి అందుబాటులోలేనివాటి కోసం అంతులేనిప్లానులు వేసుకుంటుంటారు. తామే ఇతర్లకన్నా తెలివితేటలు గలవాళ్ళమని పెద్దపెద్ద ఉపన్యాసాలు ఇస్తుంటారు ఇలాటివాళ్ళని ఎంతోమందిని చూశా. తుట్టతుదకు వాళ్ళు చేరుకునేది శ్మశానానికి అక్కడికి చేరుతున్నారని అయినా తెలుసుకుంటారా ఈ రహస్యం? ..

(బండి ముందుకు కదులుతూంటుంది)

# ఎనిమిదో రంగం

1632 సం॥ లోనే యుద్ధానికి ఇంతకాలంనుంచి ఊతనిస్తూన్న. స్వీడన్ రాజు, గుస్తావ్ అడోల్ఫ్. యుద్ధరంగంలో మృతిజెందుతాడు. దాంతో యుద్ధం ఆపుచేయటానికి సంధి రాయబారాలు జరుగుతూ ఉంటాయి. శాంతివాతావరణం సృష్టింపబడటంతో మదర్ కరేజి వ్యాపారం పెద్ద దెబ్బ తింటుంది. ఆమె పెద్దకొడుకు అయిలిఫ్ సాహసకృత్యాలుచేసి మంచిపేరు తెచ్చుకున్నా తుదకు అధ్వాన్నం చావుకు బలియవుతాడు.

(వేసవికాలం ఉదయంపూట రాజబాటకు దగ్గరగా మదర్ కరేజి మకాం చేస్తుంటుంది )

చాలాదూరంలోఉన్న ఊరినుంచి ఒక ముసలావిడ, ఆవిడ కొడుకూ వచ్చి బండికి సమీపంలో ఉంటారు. వాళ్ళు మోసుకువి వచ్చిన పక్కచుట్టలు, కంబళ్ళు వగైరాలవి తీపిచూస్తూ గుసగుసలాడుకుంటుంటారు. మదర్ కరేజి ఆసరికి బాగా తెల్లవారినా బండిలో విశ్రాంతి తీసుకుంటూ ఉంటుంది.)

మదర్ కరేజి కంఠం (బండిలోనుంచి) ఏమిటా సందడి బయట ఇంత ప్రొద్దున్నే ?

ముసలావిడ కొడుకు, రైతులమమ్మా ! రాత్రి బయలు దేరాం మా వూరినించి. ఇరవై మైళ్ళు మా సామాను మోసుకు వచ్చాం తొందరగా తిరిగి ఇల్లు చేరుకోవాలి

మదర్ కరేజి కంఠం మీ సామాను నన్నేం చేసుకోమంటారు · తిన్నగా ప్రక్క వూరికి నడవండి.

ముసలావిడ. (కొడుకుతో) ఆవిడవల్ల మనకేం ప్రయోజనం ఉండేటట్లూ లేదురా లే ? ఇంకోచోటికి పోదాం.

ముసలావిడ కొడుకు. (బండివైపు చూస్తూ) మీకు తీరిక అయ్యేటంతవరకు ఉంటామమ్మా. కష్టకాలంలో ఉన్నాం. శిస్తు ఇవ్వాళ · చెల్లించకపోతే ఇల్లు స్వాధీనం చేసుకుంటారు. మాకు అవసరంగా కావలసింది మూడు బంగారు

కానులే! సామాను చూసుకున్న తరువాతే ఇయ్యండి. మమ్మల్ని ఈ గండంనుంచి రక్షించండి.

(గంటలు ప్రక్క పూళ్ళోనుంచి మ్రోగుతూ ఉంటాయి)

అమ్మా! అమ్మా! ఆ చర్చిగంటలు వింటున్నావా?

దూరాన్నుంచి కంఠాలు: రాజు యుద్ధంలో చనిపోయాడు. సంధి కుదిరినట్లే. శాంతిరోజులు వస్తున్నట్లే!

మదర్ కరేజి: (బండిలోనుంచి బయటికి చూస్తుంటుంది. ఇంకా డ్రస్ చేసుకో లేదు) ఇవ్వాళ ఆదివారం కాదే! ఎందుకలా చర్చిగంటలు గణగణ మ్రోగుతున్నాయి?

దూరాన్నుంచి కంఠాలు: శాంతిరోజులు! శాంతిరోజులు ఇక వస్తాయి.

పాదరీ: (బండిక్రింద పడుకున్నవాడు కదులుతూ) ఎవరది! అలా గావుకేకలు వేస్తుంటా రెందుకు?

ముసలి ఆమె కొడుకు: సంధి చేసుకున్నట్లు. ఆ సందడి వింటుంటే.

పాదరీ: (అమాంతంగా లేస్తూ) ఏమన్నావు? సంధి కుదిరిందా?

మదర్ కరేజి: (బండిలోనుంచే) ఆ సంధి ప్రస్తావన నా దగ్గరకు తీసుకరాకండి. కోవల ఉన్నదంతా కొత్తనరకు. ఇప్పుడు దాన్నంతా ఏంచెయ్యాలి?

పాదరీ. (కంఠధ్వని వస్తున్న దిక్కుకేసి చూస్తూ) ఏమంటున్నారు వాళ్లంతా? శాంతిరోజులా? నిజంగా సంధి చేసుకుంటారా?

దూరాన్నుంచి కంఠం: మూడువారాల క్రిందట సంధి కుదిరింది. ఇప్పుడు శాంతి రోజులు

పాదరీ: (మదర్ కరేజితో) వాళ్లమాటలు నిజమైఉండాలి. సంధి కుదరకపోతే చర్చిగంటలు ఎందుకలా మ్రోగుతాయి?

దూరాన్నుంచి కంఠం: ఊళ్ళోకి ప్రాటిస్టెంటులువాళ్లు ఆస్తిపాస్తులతో తామర తంపరగా వచ్చి చేరుకుంటున్నారు. వాళ్ళే ఈ శుభవార్త తెచ్చారు.

ముసలావిడ కొడుకు: ఆ మాటలు వింటున్నావుకదూ!... ఆ! ఏమిటయిందమ్మా!

(ముసలావిడ స్పృహతప్పి పడిపోతుంది.)

మదర్ కరేజి: (బండిలోనుంచే) అమ్మయ్యో! అమ్మయ్యో!... కాట్రిన్! ఏం చేస్తున్నావే! శాంతిట శాంతి! చప్పున ఆ వల్లిద్రన్ను వేసుకోవే!... తొందరగా చర్చికి నడుద్దాం. మన చిన్నవాడి ఆత్మ శాంతికి ఇంతవరకు పూజలు చేయించలేదు. ఇవ్వాళైన పూజలు చేయించకపోతే మహాపాతకం వస్తుందే ..ఇంతకూ బయట వినబడుతున్న మాటలు నిజమేనా!

ముసలావిడ కొడుకు: వాళ్ళంతా అంటున్నది సంధి చేసుకున్నారఫీగా! శాంతి రోజులు కాక ఇంకేం వస్తాయనుకుంటున్నారు! (క్రిందపడివున్న వాళ్ళ అమ్మతో) అమ్మా! అమ్మా! లే! లే! ఇంకేం ఫరవాలేదు. ఒక క్షణం కూర్చున్నావా అంతా చక్కబడుతుంది. ఆ తరువాత తిన్నగా ఇంటికి నడుద్దాం. శాంతిరోజులు రావడంతోటి మన కష్టాలు గట్టెక్కుతాయని చెప్పామగా...లేవే! ఇక అన్నీ సవ్యంగా సాగిపోతాయి. మన పడక సామానుకు పీక్కు వాదులుకో వక్కర్లేదన్నమాట ...నడుద్దాం లేవవే! (దగ్గర ఉన్న ఫాదరీతో) మా అమ్మ సంధి సంగతి వినటంతో కంగారు వద్దది దానివి నమ్మలేక. మా నాన్న ఎప్పుడూ చెప్తూ ఉండేవాడు. యుద్ధం ఏనాటికో ఒకనాటికి ఆగిపోతుందనీ, దాంతో సంధి తప్పక కుదురుతుందనీ... ఇక తిన్నగా ఇంటికి నడుస్తాం.

మదర్ కరేజి: (బండిలోనుంచి) ఒక గ్లాసు పుచ్చుకుంటే తేరుకుంటుంది.

ఫాదరీ: అప్పుడే వెళ్ళిపోయారు.

(బయట హడావుడి)

మదర్ కరేజి. (లోపలనుంచే) అక్కడ అంత హడావుడిగా ఉంది ఎందుకో!

ఫాదరీ: (అటుకేసి చూస్తూ) అక్కడ జనం మూగినట్టుంది. అటుకేసి వెళ్ళిచూసి రావడం మంచిదిగా. అలా వెడుతున్నప్పుడు నా ఫాదరీ దుస్తులు వేసుకుని నడవడం బాగుంటుందనుకుంటా!

మదర్ కరేజి. (లోపలినుంచి) చప్పున నడవండి. ముందు సంగతి సందర్భాలు స్పష్టంగా తెలుసుకోడం అవసరం. వాళ్ళే క్యాథలిక్కులయివుంటే మీ ఫాదరీ దుస్తులు చూడడంతోటి ఎలాటి అఘాయిత్యం చేస్తారో ఆలోచించు కునటం మంచిది. సంధి కుదరటం నాకూ చాలా ఇష్టమే... నా వ్యాపారం కొంచెం దెబ్బతింటుందనుకోండి. మా పిల్లలని పెంచి పెద్దచేసింది యుద్ధం

రోజుల్లోనే ఒకడు పోయాడు. అది గుడ్డిదై పోయింది. శాంతిరోజులొస్తే మన అయిల్ఫ్‌ని తిరిగి చూసేభాగ్యం కలుగుతుంది.

ఫాదరీ: అలాచూడండి. ఆ జనంలోనుంచి ఆదరా బాదరగా మనకేసే ఎవళ్ళో వస్తున్నారు - ఎవళ్లో? (అటుకేసి చూస్తూ) ఆ! ఆ వచ్చేది వంటమనిషి, అప్పుడు కెప్టెన్ దగ్గర వంటచేస్తుంటే మన మనిషే!

వంటమనిషి: (చింపి బట్టలతో చిన్నమూట చంకనుంచుకుని వాళ్ళకేసి హడావిడిగా వస్తూ) ఎవరు?... ఫాదరీ గారేనా?

ఫాదరీ: (కరేజితో) ఏమమ్మా కరేజీ! కరేజి! మనల్ని చూడడానికి ఎవరు వచ్చారో చూడు.

(మదర్ కరేజి బండిలోనుంచి బయటికి దిగుతూంటుంది)

వంటమనిషి: అప్పుడు మీకు మాట ఇచ్చానుగా తీరిక దొరికితే మీరు ఎక్కడ మకాం చేస్తున్నా అక్కడికి వచ్చి మాటామంచీ చెప్పుకుంటానని. ఆ రోజుల్లో మీరు ఇస్తుండే ఘాటుసారాయి రుచి మరిచి పోతానా? క్షేమంగా ఉన్నారమ్మా?

మదర్ కరేజి: ఎవరో పెద్దమనిషి, మనల్ని చూడటానికి వచ్చానని చెపుతున్నది? - (చూస్తూ) ఆ! ఆ! కెప్టెన్ క్యాంపులో పనిచేస్తుండే వంటమనిషి! ఎంతకాలమైంది! ఎంతకాలమైంది మిమ్మల్ని చూసి! సరిగా సంవత్సరం! అక్కడ మా అయిల్ఫ్ కులాసాగా ఉన్నాడా?

వంటమనిషి: మీ అబ్బాయి ఇంకా రాలేదా? నాకన్నా కొంచెం ముందుగానే బయలు దేరాడే!... ఈపాటికి వచ్చేవుండాలి?

ఫాదరీ: కొంచెం ఆగండి లోపలికి నడిచి నా ఫాదరీదుస్తులువేసుకుని ఒక క్షణంలో వస్తా

(బండికేసి నడుస్తాడు)

మదర్ కరేజి. ఏమంటున్నావు? అంటే మావాడు ఏ క్షణంలోనైనా ఇక్కడికి చేరుకుంటాడన్నమాట. (పిల్లనిచూస్తూ) అమ్మాయి! అమ్మాయి! మీ అన్నయ్య వస్తున్నాడే! వంటాయనకోసం ఒక గ్లాసు మంచి పానీయం తీసుకునిరావే! (కాట్రీన్ బయటికి తల చూపదు) తల దువ్వుకు రావాలి. ...గబగబ కానియ్యి ఈయన పరాయిమనిషి కాదులే. (పిల్ల అది వున్న

చోటినుంచి ఇంకా రాకపోడంచూసి తనే లోపలికివెళ్ళి గ్లాసు నింపుకుని తెస్తుంది ) క్యాంటీన్‌కి బయటికిరావడం నామర్దా. శాంతి శాంతి అని పీరంతా వాగుతూంటుంటే దానికి ఒళ్లు మండిపోతోంది.. కాని ఇంత ఆలస్యంగానా రావడం? కంటికి మంచిదెబ్బ తగిలింది. దాంతో చూపు పోయినట్లే!...కాని అది నమ్మితేగా; తను అందమైనవాన్నని. అందరూ తనవంకే చూస్తుంటారని దానిభ్రమ...

వంటమనిషి ఆ. అర్థమవుతున్నది. ఇదంతా ఆ యుద్ధం మన కిచ్చిన ప్రసాదం.

(వంటమనిషి, మదర్ కరేజి కూర్చుంటారు )

మదర్ కరేజి . ఇప్పుడు రాబోయేవి చెడ్డరోజులు ఆ సంగతి తెలిసీ నువ్వు ఇక్కడికి రావడం విచారంగా ఉంది. దీంతో నేనూ దివాలా తీసినట్లే.

వంటమనిషి ' ఎందుకలా అంటావు? అలాటి దురదృష్టం రానేరాదు.

మదర్ కరేజి : రాదంటారేం? ఈ పిశాచం ఇక నా పీకని నులిపేస్తుంది ..ఆ పెద్ద మనిషి పాదరీ శాంతిరాదు గింతీ రాదని కుండ బద్దలుకొట్టినట్లు చెప్పటంతో ఆ మాటనమ్మి కొత్తసరుకు చాలా కొనేశా ఇక ఇప్పుడేం చేయాలో తోచ కుండావుంది. ఇకమీద బేరాలేరావు. నువ్వే చెప్పాలి ఇలాంటి అవాంతరాలనుంచి బయటపడటానికి మంచిదోవ

వంటమనిషి : ఆ పాదరీమాట ఎందుకు నమ్మారు? అప్పుడే మీ దగ్గర చేదోడుగా కొంతకాలం ఉండివుంటే...ఆ పాపిష్టి క్యాథలిక్కులు అంత తొందరగా మనమీదికి దూసుకునివస్తారని ఎవళ్ళు అనుకున్నారు. ఆ సంగతికూడా ముందే తెలిపివుంటే అప్పుడే వెంటనే మరో మంచిసలహా ఇచ్చివుండే వాణ్ని. ఆ పాదరీ మోసగించాడు ..ఇలాటి దుర్బుద్ధి ఆ మనిషికి ఎలా పొడ్డుకుని వచ్చిందో ....

మదర్ కరేజి అప్పుడేమో అయిపోయింది. ఇప్పుడు అతణ్ని మా పాత్ర సామాన్లు కడగటానికి ఉపయోగిస్తున్నాను బండికూడా లాగుతున్నాడు.

వంటమనిషి . అంటే అతను ఇక్కడే తిష్టవేసుకుని కూర్చుంటాడన్నమాట. ఇప్పుడు చేస్తున్నపనిపాటలతో తృప్తిపడేఘటం అనుకున్నారా. మిమ్మల్ని బుట్టలో వేసుకొనేటానికి ఇక పెద్దపెద్ద పురాణాలు పారాయణం చేయటానికి

మొదలుపెడతాడు. ఇల టివాళ్లు ఆడవాళ్ళంటే పడిచస్తారు. ఉత్త దగా కోర్లు.

మదర్ కరేజి : అలా అయితే మీరు విజాయితీమనుషులని నమ్మవచ్చా?

వంటమనిషి : నేను ఎటువంటివాడినో మీరే తెలుసుకుంటారుగా. అలాంటివాళ్ళ వంటివాణ్ని కాను. ఖచ్చితపుమనిషివి. మీ ఆయురారోగ్యాలకు ఇది పుచ్చు కుంటున్నా (గ్లాసు ఎత్తుతాడు.)

మదర్ కరేజి : అలా పెద్దమాటలు చెబుతూ తాగటంతో మీ విజాయితీ ఎలా అర్థ మవుతుందో చెప్పండి. మగరాయుళ్ళంతా ఎటువంటివాళ్ళో నాకు తెలుసు. నన్ను తృప్తిపరచటానికి మా దుప్పట్లూ, ఇతరసామానులూ మంచిధరలకు అమ్ముతారు. నేను పోగొట్టుకున్న వస్తువులు ఎక్కడిమంచో తెచ్చి ఇక్కడ ఉంచుతారు....విజం చెప్పండి. ఇలాటి సత్కార్యాలుచేసే వెర్రి వాళ్ళంటే మీకేమన్నా గౌరవముందా?

వంటమనిషి : మనుషులతత్వం పసిగట్టడంలో మీకు పెట్టిందే పేరు. మీలాంటి వాళ్ళంటే నా కెంతో గౌరవం.

మదర్ కరేజి : అలా తియ్యగా మాట్లాడుతూ మనుషులని బుట్టలో వేసుకోటం మీకూ బాగా తెలుసునన్నమాట...ఒక్కసంగతి చెప్పండి. ఈ అయిదేళ్ళ నుంచి మీరు చేస్తున్నపని యేమిటో తెలుసుకోవచ్చునా?

వంటమనిషి ; ఆ సంగతి ఎందుకు చెప్పు. ఇప్పుడు నేను చేస్తున్నది శాంతి గంటా రావం వింటూ మీరు ఆప్యాయంగా ఇచ్చిన పానీయం రుచిచూస్తూ మీ ముందర ఉండటం. విజం చెప్పాలంటే ఆ గంటల ఆనందంకన్నా మీ సారాయి బాగా నచ్చింది. ఇటువంటిది దొరకటం చాలా కష్టం.

మదర్ కరేజి : ఇలా పొగడుతుంటే మీ విజాయితీ తెలుస్తుంగవి, ఎలా అనుకో గలుగుతాము? ఊ; ఇలాటి సారాయిసరుకు ఈ రోజుల్లో లభించడం దుర్లభమే. కావి నా బంగారులాంటిసరుకు ఇకముందు ఎలా అమ్మగలుగు తానో ఏమో?.. దానికేంగాని మీకు రావలసిన జీతభత్యాలు వాళ్ళు పూర్తిగా ఇచ్చారో లేదో చెప్పండి.

వంటమనిషి : (ఆమాటకు రేగిపోతూ) అంత అదృష్టమూ ఈ విర్భాగ్యుడికి?... అందుకే వాళ్ళకి ఒక నమస్కారంబెట్టి బయలుదేరాను. లోకంలో తలా

దాచుకోడానికి చోటుఇచ్చే ఆస్తులు ఎవళ్లూ వుండకపోతారా అనే ధైర్యమే నన్ను ఇక్కడికి నడిపించుకుని వచ్చింది. సన్నిహితులఎదుట ఇప్పుడు ఇలా కాలక్షేపంచేయటం మహాభాగ్యం కాక మరేమనమంటారు?

మదర్ కరేజి: అంటే చేతిలో చిల్లికాపీ లేదన్నమాట!

వంటమనిషి: ప్రస్తుతం చేతిలో చిల్లికాపీకూడా లేకపోయినా తెలివితక్కువ దద్దమ్మని కాను. పొట్ట పోసుకోడానికి వంటపని చేస్తా. అది దొరకకపోతే చెప్పులు కుడతా. అదీ దొరకకపోతే మరే వెట్టిచాకిరి చేయటానికైనా సందేహించను. యుద్ధపురోజుల్లో చేయవలసిన పనిపాటలు ఒక ఎత్తు. ఇక శాంతికాలంలో చేయబోయేవి ఒక ఎత్తు. ...

(అదే సమయంలో ఫాదరీ తన పాత ఫాదరీదుస్తులుధరించి ఎంతో దర్జాగా అక్కడ ప్రత్యక్షమవుతాడు)

ఇప్పుడు కాదు. తరవాత సావకాశంగా ఆ సంగతి మాట్లాడుకుందాం.

ఫాదరీ: (తన దుస్తులకేసి చూసుకుంటూ) ఇన్నాళ్లు వాడక దాచివుంచటంమూలాన చీడపురుగులు ఇక్కడా అక్కడా రుచిమూశాయి. అయినా చెక్కు చెదర లేదు.

వంటమనిషి: పాతవాటిని వేసుకుని ఇలా నాటకం ఆడతా రెందుకు? తిరిగి వాళ్ళు ఉద్యోగం ఇస్తారనా? అలాటి పిచ్చిఆశలు బుర్రలో ఉంచుకోవద్దండి. ఆ కాలం వేరు. ఈ కాలం వేరు. ఈ చీడపురుగులదుస్తుల్లో మిమ్మల్ని చూస్తుంటే నాకే విచారంగా ఉంది ..అదంతా సరేగాని యుద్ధం యథా తథంగా సాగుతూనే ఉంటుందని ఈ మెనిని ఎందుకు బుకాయించారో తెలు సుకోవచ్చా? ఆ సలహాతో ఆమెను పూర్తిగా ముంచారు. ఇలా చేయటం ఏం బాగా లేదు.

ఫాదరీ: (మండిపడుతూ) ఇవన్నీ మా సొంతవిషయాలు. వాటిలో మీ రిలా కలుగ జేసుకోడంలో అర్థమేమిటో నాకు తెలియడంలేదు.

వంటమనిషి: (కోపంతో) కలుగజేసుకోకుండా నోరు మూసుకువుండమనేగా మీ రియ్యబోయే సలహా? ఆ! ఆ! ఇతర్లవ్యవహారాలలో మీరు కలుగజేసు కోటంలో వచ్చేనలాభాలు స్పష్టంగా చూస్తూనే వున్నాను.

ఫాదరీ : ఏమంటావు ? ఆమెకు నష్టం తీసుకుని వస్తున్నది నేనా ? (మదర్ కరేజిని చూస్తూ) ఈ పెద్దమనిషికీ మీకూ ఇంత దగ్గరసంబంధం ఉందనీ, అతని సలహాప్రకారం మీ వ్యవహారాలు చక్కదిద్దుకోబోతున్నారనీ నాకు తెలియదే...

మదర్ కరేజి. ఎందుకలా ఆవేశపడతారు ? మీకు మల్లే ఈయనకూ తన స్వంత అభిప్రాయాలు ఉంటాయి. మిత్రులమధ్య అలాటివి ఉండటం సహజం. అవసరంకూడా ! ..అదంతా సరేకాని, నా మేలుకోరేవారిలాగ యుద్ధం ఎప్పటిలాగ సాగుతూనే ఉంటుందని సలహా ఇయ్యలేదా ? చెప్పండి, ఆ సంగతి ఈయనముందు ఇప్పుడు ! ..

ఫాదర్ : ఆ ! ఇచ్చానే అనుకో. ఏవో కారణాలమూలాన వాళ్ళు సంధి చేసుకున్నారు ..దానికోసం ఇంత రాద్ధాంతం చేయటమా ? ఏం బాగాలేదు... మీరు మంచివారనుకున్నా. మీ వాలకం ఇప్పుడు చూస్తుంటే మృతకళేబరాలను గుటకాయస్వా చేసే శివంగులకన్నా హీనమైనవాళ్ళని స్పష్టంగా అర్థమౌతోంది.

మదర్ కరేజి : ఏమిటి వాగుతున్నావు ? మరోసారి ఆమాట అనండి.

వంటమనిషి : (చేతులు కలుగజేసుకుంటూ) నా ఆప్తురాలిని నా ముందర అవమానిస్తారా ? దానికి ఎలాటి ప్రతిఫలం లభిస్తుందో తెలుసుకున్నారా ?

ఫాదరీ : (రెట్టింపు కోపంతో) ఏమండోయ్ నోరు జారకండి మీతో మాట్లాడటం లేదు. నా సంగతి తెలిస్తే ఇలా అవమానం చేయటానికి సాహసిస్తారా ? (మదర్ కరేజితో) యుద్ధానికి కొంతకాలం సెలవియ్యటం మంచిదే. ఆ జనంకేసి ఒక్కసారిచూడు. శాంతిరోజులు వచ్చాయని వాళ్ళు ఉత్సాహం చూపకుండా ఎలా వుంటారో మీరే ప్రశాంతంగా ఆలోచించాలి. మనమూ మనుషులం. ఆసంగతి మరచిపోయి శాంతిని ద్వేషించడం. యుద్ధం ఇంకా సాగాలని ఉబలాట పడటం చూస్తుంటే మీకు కావలసింది యుద్ధం, అందు మూలంగా అంతులేని లాభం పొందాలనే ధ్యాస. ఇలాటి సందర్భాల్లో మన పూర్వులు ఏమన్నారోవినండి "ఎవళ్ళకి భూతాలతో కలిసి భోజనం చేయాలని ఉత్సాహం ఉంటుందో, వాళ్ళు భూతాలకి మల్లే పొడుగు పాటి చెంచాలు జాగ్రత్త పరుచుకోవాలి'' అని. ఆ మాటల్లోని గుఢార్థం మీవంటి వాళ్ళు ఏకోశానా మరచి పోకూడదు.

మదర్ కరేజి : నాకు యుద్ధ ప్రసక్తివొద్దు. శాంతి ప్రసక్తి అంతకన్నా వొద్దు. మీరు పెద్దమనుషులని ఇంతవరకు మర్యాదచేశాను. ఇలాటి అవకతవక మాటలు నా ముందు చెప్పడానికి మీ కేమాత్రం హక్కు లేదు. మీ వంటి శివంగులతో ఇది మొదలు మా కేమాత్రం సంబంధం ఉండకూడదుకూడా.

ఫాదరీ : ఏమమ్మా! కొంచెం శాంతించడం మంచిది. లోకం ఉగ్రూతలూగుతున్నది శాంతికోసం. మీ బండిలో తారట్లాడుతూండే చీడపురుగుల కోసం కాదు. ఇలాటి అఘాయిత్యం ..

మదర్ కరేజి : (అడ్డుపడుతూ) ఏమంటున్నారు? నా బండిలో ఉన్నవి చీడపురుగులా? ఊ' వాటి సహాయంతో మేం జీవిస్తున్నామా? ఇంతవరకూ మా దగ్గరే వుంటూ మేము పెట్టిన తిండి తింటూన్నవారు. ..

ఫాదరీ . అంతే?...ఎప్పుడూ మీ పాట యుద్ధాన్ని గురించే!

వంటమనిషి : (ఫాదరీతో) మీ వంటి వయస్సు మీరినవాళ్ళు ఎలాటి సలహాలూ ఇయ్యకుండా ఉండటం అన్నివిధాలా మంచిది. (కరేజితో) పరిస్థితులు తారుమారవటం మూలాన ఉన్న సరకుధరలు పడిపోకముందే అమ్మి వేయడం మంచిది. ఆలస్యం చేశారా పూర్తిగా మునిగిపోవాలసి వస్తుంది.

మదర్ కరేజి . ఆ! ఆ సలహా నాకు బాగా నచ్చింది. ఆ పని ఇప్పటినుంచే మొదలు పెడతాం.

ఫాదరీ : ఈ వంటమనిషి సలహాఇచ్చాడుగదా అది ఆ పనికి పూనుకుంటున్నారా?

మదర్ కరేజి : ఎందుకో అసూయ మీకు? ఆ సలహా మీ రెందుకు ఇయ్యలేకపోయారు? ఈ పెద్దమనిషి చెప్పటం నా క్షేమంకోసం. ఇక తాత్సారం చేయటమెందుకు? ఇప్పుడే మార్కెట్టుకు బయలుదేరుతా.

(తన దగ్గర అప్పుడున్న పైపు వంటాయనమీద పడేస్తూ అదరా బాదరాగా బండిలోకి అడుగుబెడుతుంది.)

వంట మనిషి : (ఫాదరీతో మెల్లగా) మనలోమాట. ఆవిడ ఇప్పుడు ఇక్కడ లేదు కాబట్టి మొహమోటం లేకుండా ఒక సంగతి చెప్పడం మంచిది. ఫాదరీలు కాలపరిస్థితుల కనుగుణ్యంగా నడుచుకోవటం అవసరం. ఆ తెలివితేటలు మాకులేవు. ఇకముందైనా ఈ రహస్యం మనస్సులో ఉంచుకోవాలి.

ఇతర్లకి సలహాలియ్యాలిన్న ఉత్సాహం మీలో ఉబుకుతూఉంటే రాజకీయపు టెత్తులు కూడా క్షుణ్ణంగా అలవరుచుకోవాలి. ఇప్పుడు మనది కోడిపుంజుల పోరాటం. దానికి మెదుస్తులు ఏమాత్రం పనికిరావు.

పాదరీ : ఇంతవరకు ఏదోవిధంగా ఓపిక పట్టాను. ఇక మీరు నోరు ముయ్యటం అన్ని విధాలా మంచిది లేకపోతే గొంతు పిసికేస్తా... అదే మీవంటి వాళ్ళకి తగిన శిక్ష.

వంటమనిషి : (తొడుక్కున్న జోళ్ళుతీసి శుభ్రంచేస్తూ) ఆ ! ఆ ! మీవాలకం చూస్తుంటే లోకం అంటే ఏమిటో ఇప్పటికీ మీరు గ్రహించినట్లులేదు. ఇకనైన కళ్ళు తెరుచుకున్నారా. ఈ శాంతిరోజుల్లో ఇంతవరకు మీకున్న పాదరీగిరి అనుభవాన్నిబట్టి ఏవూళ్ళోనైనా ఉద్యోగం సంపాదించుకోడానికి అవసరం ఉంది. ఇక నా సంగతా ? నాది వంటపనివృత్తి. ఈ రోజుల్లో జనం మలమల మాడిపోతున్నారు అలాటప్పుడు వంటవాడిపని దొరకడం అసంభవం... అయితేనేం, తెలివితేటలు ఉన్నాయి నాకు. వాటినే అండగా పెట్టుకుని ఎదో ఒకపని సృష్టించుకోగలుగుతా.

పాదరీ : మీకు అలాంటి తెలివితేటలు ఉన్నా వాటిని ఈవిడదగ్గర ఉపయోగించ వద్దని ఇంకోసారి మంచిగా సలహా ఇస్తున్నాను. ఊ ! మీదృష్టిలో వేమ దద్దమ్మనే ! అయినా మానవత్వం నాలో ఇంకావుంది. జనంఅంతా మీ దోవకు చెందినవాళ్లే అయితే ఇక నా ప్రసంగాలు కట్టి పెట్టేస్తా.

(వారకొంత యేవెట్టీ ఆ సమయాన్నే అక్కడ ప్రత్యక్షమవు తుంది పూర్వపు రోజులవయ్యారం, దానికి సంబంధించిన వేషం మాయమయింది. ఇప్పుడు వేసుకున్నది నల్లదుస్తులు. చేతిలోకర్ర వయస్సులో ముడిరింది. మనిషి లావెక్కింది. ముఖం పౌడరుతో బాగా పులుముకొనివుంది. ఈ మార్పు ఇతరులు గుర్తించకుండా వెంట నవుకరు.)

యేవెట్టీ మీరంతా ఎవరు ? ఆమె కనబడటంలేదే !

పాదరీ : (భోగం ఆవిడని గుర్తుపట్టలేక) మీరు ఎవ్వరో కొంచెం తెలుసుకోవచ్చా?

యేవెట్టీ : మీరు నన్ను మరచిపోయినట్లుంది. రీజిమెంట్ కర్నలు భార్యను. మదర్ కరేజి ఎక్కడికి వెళ్ళినట్లు ?

ఫాదరీ : (బండివైపు చూస్తూ) ఏమమ్మోయి! కర్నలు భార్యట. మిమ్మల్ని చూడటానికి వచ్చింది.

మదర్ కరేజి కంఠం. (లోపలినుంచి) కొంచెం ఉండమని చెప్పండి. ఇప్పుడే వస్తున్నా!

యేవేట్టీ : (ఆ కంఠం వినటంతో) నేను యేవేట్టీని.

మదర్ కరేజి కంఠం : ఏమంటున్నావు! నువ్వా! నిజంగా యేవేట్టీ వేనా!

యేవేట్టీ. ఊ! నీ యేవేట్టీ అవునో కాదో నువ్వే కళ్లారచూడు.

(యేవేట్టీని చూడటంతో వంటమనిషి తల ప్రక్కకు త్రిప్పుతుంటాడు. ఇదంతా చూస్తూ)

ఓయ్! పీటర్! పీటర్! ఏమిటా సంకోచం నాకేసి చూడటానికి? ఏం క్షేమంగా ఉన్నావా?

వంట మనిషి : (బిడియంతో) ఎవరో అనుకున్నా? బాగున్నావా యేవేట్టీ?

యేవేట్టీ· అమ్మయ్య! ఇప్పటికన్నా గుర్తుపట్టగలిగావు నువ్వు ఇక్కడుండటం ఆశ్చర్యంగానే ఉంది. ఎక్కడనుంచి రావడం? ఎలా వచ్చావు?

వంట మనిషి. నాలుగు గుర్రాలబండిమీద పెద్ద ఆఫీసర్‌లాగ మా రీజిమెంటునుంచి.

ఫాదరీ : ఏమిటి అలా వ్యంగ్యంగా మాట్లాడుతావు మర్యాదస్తులముందే? (యేవేట్టీతో) ఈయన్ని ఎరుగుదురా? ఈయన అంత చనువుగా మాట్లాడటం చూస్తుంటే మీరు పాతస్నేహితుల్లా ఉన్నారు.

యేవేట్టీ· ఊ! (వంటాయన్ని ఎగా దిగా చూస్తూ) బలిసినట్లున్నావు.

వంట మనిషి : నువ్వా బక్కపలచని వాళ్ళని చూపి చూపి విసికి చటుక్కున ఇక్కడికొచ్చావుకదూ?

యేవేట్టీ : ఎవరెలా ఉంటేనేం? నిన్నుచూశా. అదే పదివేలు. సరేకాని, నిన్ను చూస్తుంటే ఎలాటి ఆలోచనలు పుట్టుకొస్తున్నాయో చెప్పమంటావా?

ఫాదరీ · ఊ! తప్పకుండా చెప్పడమే మంచిది. కాని ఒక్కక్షణం ఆగండి. ఆమె కూడా వస్తుంది వినటానికి.

వంట మనిషి : (కోపంతో) ఉన్న రభస చాలక...

మదర్ కరేజి: (రకరకాల సామానులతో వస్తూ) యేవేట్టీ! యేవేట్టీ! (కౌగలించుకుంటూ) ఈ రావడం ఏమిటి? ! ఆ దుస్తులేమిటి?... (తడి పెట్టుకుంటూ) నీకూ కష్టాలొచ్చాయా తల్లీ!

యేవేట్టీ: ఇవి చూస్తే తెలియదంటే? మా ఆయన ఈ మధ్యనే పోయారు.

మదర్ కరేజి: పాపం!...ఆ ముసలాయనేనా? నా బండిని కొంటానని నీకు మాట ఇచ్చిన ఆ కర్నలేనా?

యేవేట్టీ: ఊఁహూ! ఆయన తమ్ముడు....

మదర్ కరేజి; ఎవరైతేనేం యుద్ధం సూటిగా సాగటానికి తోడ్పడిన పెద్దలలో ఒకరుకదూ.

యేవేట్టీ: కాని ఆ పెద్దలకు నిలకడ ఉంటేగా? అంచేతనే ఈ ఎగుడు దిగుళ్ళల్లో మనంకూడా కిందా మీదా అవుతున్నాం.

మదర్ కరేజి· అది సరేగాని మీ ఆయనవంటి పెద్ద సేనానాయకులు చేతులనిండుగా సంపాదించుకొన్నారుగా.

ఫాదరీ; (వంటాయనతో) మర్యాదస్థులు ఇక్కడ ఉన్న సమయంలో మీరలా జోళ్ళు తీసెయ్యడం మర్యాదకాదు. (యేవెట్టితో) ఈయన్నిగురించి మీకేవో అభిప్రాయాలున్నాయన్నారే. అవన్నీ ఒకసారి బయటపెట్టడం మంచిదనుకుంటా.

వంటమనిషి: (యేవేట్టితో) ఆ గొడవ ఇక్కడికి తీసుకువచ్చి ఇక్కడి ప్రశాంత వాతావరణం చెడగొట్టడం మర్యాదస్థుల లక్షణంకాదని నీకు నా సలహా!

మదర్ కరేజి: యేవేట్టి! యేవేట్టి! ఆ పనిమాత్రం చేయకు. మీ పాతాయన నా స్నేహితుడు. బాధపడతాడు.

యేవేట్టి! ఎవరు? నా పీటరేనా?

వంటమనిషి: పెద్దమనుషులముందు నన్ను అలా పిలవడం బాగాలేదు. నా పేరు లాంబ్ అని నీకు తెలుసుగా!

మదర్ కరేజి: (నవ్వుతూ) పీటర్! పీటర్! అని పిలిస్తేనే చాలా బాగుంటుంది. అంతకన్నా పైప్ పీటరంటే మరీ భేషుగ్గా ఉంటుంది నువ్వు అన్నట్లు యేవేట్టి! ఆ పైపుతో ఎంతమంది ఆడవాళ్ళని పిచ్చివాళ్ళని చేశాడో నీకు

బాగా తెలుసుగా. ఆ పైపు కథాకమీషూ నేనూ చూశాను. జాగ్రత్త పరి చాను ఇప్పుడు.

పాదరీ : అందుకే కాబోలు ఈ పెద్దమనిషి తను వాడటంతో తృప్తిపడక ఇతర్లకూ అందజేస్తూంటాడు.

యేవేట్టి : అది నా కెంతగానో నచ్చినవిషయం. ఆ విషయమై మీరు కొంచెం జాగ్రత్తగా మెలగాలని నా హెచ్చరిక. అదొక పిచ్చి ఆ మనిషికి. దాంతో మా ప్రాంతాల వాడవాడల్లో అతను చేసిన హంగామా మాటల్లో చిత్రించ టానికి సాధ్యమవుతుందా ? ఆ మోహనాస్త్రానికి ఒళ్ళు మరిచిపోయి జీవి తంలో దెబ్బలు తిన్నవాళ్ళు అంతుపంతూలేకుండా ఉన్నారని చెపితే చాలు !

వంటమనిషి : అలాటివాళ్ళల్లో నిన్ను ఒకతెగా చేర్చాలి గాని.... ఆ ఆపదలోనుంచి బయటపడ్డావు అందుకు సంతోషించు యేవేట్టీ !

యేవేట్టి : ఇదిగో మర్యాదస్థులతో మాట్లాడుతున్నప్పుడు ఈ వెకిలితనం ఏమిటి ? జోళ్ళు తొడుక్కోవాలి. నువ్వు మాట్లాడుతూఉన్నది పెద్దమనుషులతో, కొంచెం మర్యాదచూపటం అవసరం... ఈ అవకతవకమనిషిని అప్పుడు గాఢంగా ప్రేమించా. ఆదేసమయంలో ఈ పెద్దమనిషి మరొకతెతో సరస సల్లాపాలు సాగించటం ప్రారంభించాడు. అది అందకత్తె కాదు. కుంటిది. తనపని పూర్తిచేసుకున్నాక పాపం, దానిని గోతిలో పారవేశాడు.

వంటమనిషి : యేవేట్టీ ! అదంతా పాతకథ. దాన్నెందుకు తవ్వటం ? దాన్లో కొంత పీ కవిత్వం. ...

యేవేట్టి : ఇక కట్టిపెట్టు ఆ పురాణాన్ని. (కరేజితో) ఇలాటివాళ్ళని వెయ్యికళ్ళతో కనిపెట్టాలి. లేకపోతే నన్ను చేసినట్లు ఇతర్లని వడినముద్రంలో ముంచే స్తారు.

మదర్ కరేజి . వీళ్ళముందు ఇలా మాట్లాడుతూ కాలం వృధాచెయ్యడం మంచిది కాదు. నాతోకూడా ప్రక్కఊరి బజారుకు రా. అక్కడ ధరలు పడిపోడానికి ముందే ఈ సరుకు వదిలించుకోవాలి.

యేవేట్టి : (వంటమనిషికేసి తీవ్రంగా చూస్తూ) నన్ను ముంచావు తెలుంకోళ్ళ...

వంటమనిషి . (అడ్డువస్తూ) నువ్వు మునగలేదుగా.

మదర్ కరేజి : (కలుగజేసుకుంటూ) ఎందుకీ రగడ? నడుద్దాం పద. మిలిటరీ వాళ్ళతో బాగా పరిచయముందిగా మీకు. అంచేత ఈపనిలో నీ సహాయం చాలా అవసరం....సమయానికి నువ్వు రావడం నా అదృష్టం.

యేవేట్టి : (దృష్టి వంటాయనమీదే ఉంచుతూ) ఇంకా ఏం చేస్తానో తెలుసా?

వంటమనిషి : చూద్దాంగా.

మదర్ కరేజి : (బండిలో ఉన్న కాట్రీనుతో) కాట్రీన్, కాట్రీన్ మనం చర్చికి వెళ్ళనక్కరలేదు. ఇక్కడే ఉండు. మార్కెట్టుకేసి వెళ్ళి ఒక్కక్షణంలో తిరిగి వస్తా. ఈలోపున అన్నయ్య రావచ్చు. వస్తే వాడికి మంచి పానీయం ఇస్తూ కబుర్లు చెప్పుకుంటూ ఉండు.

యేవేట్టి : (ముందుకు నడుస్తూ) ఈ మనిషి ఆరోజుల్లో నా కొంపముంచినా...నా జాతకం మంచిది గనక, ఆ నరకకూపంలోనుంచి బయటపడ్డా. (ఒకసారి వంటాయనకేసి చూస్తూ) నీ పాపాలకు తగినశిక్ష అనుభవిస్తావు. అది వచ్చేది పైనుంచే....

పాదరీ : మంచిమాట అన్నావమ్మా, ఈసందర్భంలో ఒకసంగతి చెప్పటం నా ధర్మం, పాదరీ అవటంమూలాన. "భగవంతుడే న్యాయమూర్తి. పాపులను ఎలా శిక్షించాలో ఆయనకు స్పష్టంగా తెలుసు" అని చక్కగా చెప్పారు మన పెద్దలు. ఇలా మాట్లాడినందుకు ఆ మనిషి నన్ను హేళనచేసి అవమానించాడు. ఇప్పుడైనా నా అంతస్థు గ్రహించి పశ్చాత్తాపపడుతాడనే అనుకుంటా.

(యేవేట్టి వినీ విననట్లు నడుస్తుంది)

వంటమనిషి : ఇవ్వాళ లేవగానే ఎవళ్ళమొహం చూశానో? లేచినప్పటినుంచీ అన్నీ అపశకునాలే! అక్కడే తిండీ తిప్పలూ లేకుండా మలమల మాడిపోయా. ఇక్కడికి చేరుకున్నాక నా ఆకలి తీరుతుందని ఆశపడ్డా ..అడుగు పెట్టానో లేదో ఈ మనిషి ఉపన్యాసాలు దంచిపారేస్తున్నాడు ఆ వికారపు దుస్తులు వేసుకుని....ఈ బెడదనుంచి బయటపడాలంటే నా కాళ్ళకి బుద్ధి చెప్పుకోడం మంచిది వాళ్ళు తిరిగి వచ్చేలోగా.

పాదరీ : ఊ! అలా చెయ్యడమే మంచిదని నా సలహాకూడా.

వంటమనిషి : నా భవిష్యత్తంతా శాంతి వాతావరణంలో ముడిపడిఉంది. మీ బోధలు వింటూంటే తెలిసింది. మానవుడు విలకడగా ఒక గడ్డమీద ఉండేవాడు కాదని. మనిషి ఎప్పుడూ కత్తిచూపి ఇతర్లని హతమార్చడానికే ఉబలాట పడుతుంటాడు. దానిమీదే తన భవిష్యత్తు ఆధారపడి ఉందనుకుంటాడు. మీరు చెప్పేది నిజమో కాదో తరువాత ఆలోచిద్దాం ఇప్పుడు నా ధ్యాసంతా మా కెప్టెన్ మీద : తిండిరాయుడు. సమయానికి తిండి పెట్టకపోయానా కత్తులు నూరుతూ, చిందులు త్రొక్కుతూ ఉంటాడు. పాపం, ఇప్పుడు ఎక్కడ ఉన్నాడో ? ఈ సంధి రాయబారాలు ఆయనతత్త్వానికి బొత్తిగా సరిపడవు.

పాదరీ : ఆ సంగతి నాకూ తెలుసుగా, ఆయనకి కోడిపుంజా అంటే మహాఇష్టం. దాన్ని ఎంత చక్కగా వండావో ఆరోజు! నేనూ తవివితీరా రుచి చూశా నుగా. దానితో మరోకూరకూడా తయారుచేసివుంటే చాలా బాగుండేది .

వంటమనిషి : మీకు అలాటిరుచులు ఇష్టం అన్నమాట నాకు తెలిసివుంటే ..

పాదరీ : ఊహూ! బలవంతం చేశాడు. అంచేత నా దీక్షకు స్వస్తి చెప్పాలసి వచ్చింది.

వంటమనిషి : అంటే మీరూ ఏ గాలికి ఆ చాప ఎత్తుతారన్నమాట,

పాదరీ : కాలం ! ఈ పాడుకాలం నన్ను అలా మార్చివేసింది.

వంటమనిషి . ఆమెను శిసంగి క్రింద జమకట్టి అవమానించావు. అంచేత మీరు ఇక్కడినుంచి మకాం మార్చటం మీ భవిష్యత్తుకు మంచిది. ఆ వహావ్యం ఇప్పుడు మీరు ఆలోచించటం బాగుంటుంది. ..

(బయట సందడి)

పాదరీ : ఆ వచ్చేది అయిలిఫ్‌గా ఉంది.

(సైనికులు ఇద్దరు అయిలిఫ్‌కి సంకెళ్ళువేసి ఆటుకేసి తీసుకువివస్తుంటారు. అయిలిఫ్ మొహం చూడటానికి భయంకరంగా ఉంది అతను అక్కడికి రాగానే వాడికేసిచూస్తూ) ఏమిటోయ్ అయిలిఫ్ ఇలా వున్నావు ?

అయిలిఫ్ : మా అమ్మ ఏది ?

పాదరీ : ఇప్పుడే ఊళ్లోకి వెళ్ళింది. కొంచెంసేపటిలో వస్తుంది.

అయిలీవ్: ఇక్కడ అమ్మ మకాం చేస్తున్నదని వాళ్ళకి తెలిపి అమ్మను చూడ టానికి అనుమతి ఇచ్చారు. ఎంతసేపటికి వస్తుందో?

వంటమనిషి: (సైనికులతో) మా అబ్బాయికి ఇలా సంకెళ్ళ వేశా రెందుకు?

సైనికులలో ఒకడు: మీవాడు మంచివాడైతే ఇలా ఎందు కవుతాడు?

ఫాదరీ: ఏం చేశాడని ఇలా శిక్షించారు?

సైనికులలో ఇంకొకడు: అమాయకులయిన రైతులని అటకాయించాడు. ఆ సందర్భంలో వాళ్ళ ఆడమనిషి చచ్చిపోయింది.

ఫాదర్: (అయిలిఫ్‌తో) ఎందుకలా చేశావోయ్?

అయిలిఫ్: ఒక్కటేనా? అలాటివి ఎన్నో చేశా ...

వంటమనిషి: అవి యుద్ధంరోజులు. ఇప్పుడు సంధి కుదిరిందిగా! ఆ సంగతి మరిచి పోయావుటోయ్, అయిలిఫ్!

అయిలిఫ్. ఏమండోయ్, మీరూ ఆమాటే అంటే ఏం చేస్తానో చూడండి .. అమ్మ వచ్చిందాకా కొంచెం కూర్చుంటా.

సైనికులలో ఒకడు: ఎప్పుడు వస్తుందో? అంతసేపు ఉండటానికి వీలులేదు.

ఫాదరీ: యుద్ధకాలంలో వాడు చేసింది తప్పుకాదు. ఒకసారి వాడు చూపిన సాహసానికి రీజిమెంటు కెప్టెన్ ఎంతో సంతోషించి తనప్రక్కనే కూర్చుండబెట్టుకుని పెద్ద విందుచేశాడు. వాడు చూపిన సాహసం సామాన్యమైనది కాదే. ఆ రోజున వాళ్ళప్రక్కనేవుండి అంతా విన్నానుకూడా! ఆ ధైర్యం చూసైనా వాడిని ఇంతకఠినంగా శిక్షించటం బాగాలేదు.

సైనికులలో మరొకడు: ఆ పప్పులు ఇప్పుడు ఉడకవండి. రైతులకొట్టాలలోపడి వాళ్ళపశువుల్ని దొంగిలించటం సాహసమంటారా?

వంటమనిషి: నన్ను అడిగితే అది తెలివితక్కువపని అంటా.

అయిలిఫ్: (మండిపడుతూ) అంటావులే! ఉన్న తెలివితేటలు చూపిస్తే తిండీ తిప్పలులేకుండా మలమల మాడిపోవాలి. నీ జిత్తులు నాకు తెలియవనుకున్నావా?

వంటమనిషి. నువ్వు వీరుడవే! కాబట్టే ఇలా తలవంచుకుని వుండాలసిన గతి పట్టింది నీకు ఈ సంధిరోజుల్లో!

పాదరీ : వీళ్ళు తొందరపడుతున్నారు. మీఅమ్మ ఇంకా రాలేదు. ఎప్పుడు వస్తుందో మరి ? (సైనికులతో) లోపల ఈ అబ్బాయి చెల్లెలు ఉంది. మీరు అనుజ్ఞ ఇస్తే వీడు లోపలికివెళ్ళి దానిని చూసివస్తాడు.

అయిలిఫ్ : చెల్లి లోపలవుందా ? ఒకగ్లాసు ఘాటుసారాయం తీసుకుని రమ్మని చెప్పండి దానితో.

సైనికుల్లో ఒకడు : (తల అడ్డంగ్రతిప్పుతూ) అదంతా మా దగ్గర పనికిరాదు. ఇప్పటికే చాలా ఆలస్యమైంది. (అయిలిఫ్‌తో) ఇక నడు.

పాదరీ . ఇలా బెట్టుసరిపడితే ఎలాగండి ? .. సరే ! మీ ఉత్తరువులు మీవే ! వాటికి అడ్డు రావటం నాకు ఇష్టం లేదు (అయిలిఫ్‌తో) మీ అమ్మతో ఏం చెప్ప మంటావోయ్ ?

అయిలిఫ్ : ఏం చెప్పమంటారా ? నేను చేసిందానిలో కొత్త ఏమీలేదు. పాతపాటే పాడానని చెప్పండి. (కొంచెం ఆగి) ఊహూ ; అలా చెప్పకండి....

(సైనికులు తొందర పెడుతూంటారు )

పాదరీ : (అయిలిఫ్‌తో) నీతో నేనూ నడుస్తావోయ్ .. కష్టాలలో నేనూ పాలు పంచుకుంటాను.

అయిలిఫ్ : ఈ సమయంలో పాదరీలసహాయం నాకేం అక్కరలేదు

పాదరీ : (అబ్బాయిని సమాధానపరచటానికి) ఓరీ అబ్బాయి ! నువ్వు ఇంకా చిన్న వాడివోయి. అంచేత లోకంసంగతి నీకేం తెలియదు.

(అయిలిఫ్ ఆయన్ని రావద్దని ప్రతిఘటిస్తున్నా బయలుదేరుతాడు సైనికులు అబ్బాయిని నడిపిస్తూంటుంటే)

వంటమనిషి : (వెడుతున్నవాళ్ళని పిలుస్తూ) కొంచెం ఆగండి .. అయిలిఫ్ ! మీ అమ్మ నిన్ను చూడాలని ఎంతో ఆత్రపడుతోంది (సైనికులతో) మీకే విన్నవించుకోటం. ఆవిడకోసం కొంచెం ఓపిక పట్టండి. ఇంకో నిమిషం లోనే వస్తుంది. మీరలా మా కోరిక మన్నించకుండా వెళ్ళటం బాగాలేదు. ఓరేయ్, అమ్మకు ఏం చెప్పేమంటావు ? ..

పాదరీ : (దూరాన్నుంచి) వాళ్ళ అమ్మకు ఏం చెప్పవద్దు. మీరే ఏదో ఒకసంగతి చెప్పాలని ఉబలాటపడుతూంటే అబ్బాయి వచ్చాడు, తిరిగి రేపువస్తాడు అని

చెప్పితే చాలు. అక్కడి సంగతిసందర్భాలు ప్రత్యక్షంగాచూసి చప్పున తిరిగివస్తా. అప్పుడు ఆవిడకు నేనే చెపుతా...

(వంటమనిషి పాదరీమాటలకు మండిపడపోతూ పాదరీని తిరిగి ఇటు కేసి రావద్దని సంజ్ఞచేస్తూ కొంచెం సేపు అక్కడ ఇటు అటూ పచార్లుచేస్తూ కొంతసేపటికి బండిదగ్గరకు వస్తాడు )

వంటమనిషి ; (లోపలికిచూస్తూ) అమ్మాయి ! కాట్రీన్ ? నేను తిరిగివచ్చా. కెప్టెన్ దగ్గర వంటమనిషిని నువ్వు క్రిందటిసారి మీ మకాంలో నన్ను చూసే ఉంటావు. సంధిరోజులు వచ్చాయని నువ్వు ఇప్పుడు బాధపడుతూ ఉండ వచ్చు. ఆ బాధ ఎలువంటిదో నాకు తెలుసు. అమ్మ ఎప్పుడు వస్తుందో ? ఆకలిగా ఉంది. తినటానికి ఏదైనావుంటే కొంచెం ఇచ్చి పుణ్యం కట్టుకో. పత్తె దన్నంచూసి ఎన్నాళ్ళయిందో. ఒక రొట్టెముక్క, దాంతో చిన్న మాంసంముక్క ఇచ్చావా, కొంచెం తేరుకుంటా (లోపలినుంచి ఏం జవాబు రాకపోవటంమూలంగా బండి తలుపుతీసి లోపలికేసి చూస్తూ) ఎందుకమ్మా అలా ముఖం కనబడకుండా కంబళి కప్పుకున్నావు ?

(దూరాన్నుంచి ఫిరంగుల కాల్పులు)

మదర్ కరేజి : (ఆదరా బాదరాగా వస్తూంటుంది. బరువునంచి మోయలేక తికమక పడుతూ బండిముందు వంటమనిషి నిలుచుని లోపలికిచూస్తూ కంగారు పడుతూండడం చూస్తూ) ఏమండోయ్ ! శుభవార్త ! మంచి శుభవార్త తెస్తున్నా. అమాంతంగా మనమీదపడ్డ శాంతిరోజులు అలాగే అదృశ్యమై పోతున్నాయి. ఆ ఫిరంగులసందడి విన్నారుగా. తిరిగి యుద్ధం పెద్దఎత్తున ప్రారంభమవటానికి మంగళసూచకం ఈ సంగతి దోవలో కనబడ్డ పెద్ద మనిషి ఒకాయన చెప్పాడు. మూడుగంటలనుంచి కాల్పులు సాగిస్తున్నా రట. తనే ప్రత్యక్షంగా చూశాడట. ఇంకా నయం. నా సరుకు వాళ్ళకి అమ్మజూపాను కాదు. అంతా నా అదృష్టం. ఈ కాల్పులు ఊళ్ళో ప్రొటె స్టెంటులమీదట ! ఎంతకాలం ఇలా వుంటుందో ఎవళ్ళకు తెలుసు ? ఈ రాజమార్గంలో మనం ఉండటం ప్రమాదం. చప్పున మకాం మరోచోటికి మార్చాలి. (కాట్రీన్‌తో) అమ్మాయి ! అమ్మాయి ! (జవాబురాదు బండిలో నుంచి) ఎంత పిలిచినా జవాబియ్యదేం ? సరుకు బండిలో గబగబ సర్దాలి.

లోపలినుంచి రాదే ఫిరంగులకాల్పులు స్పష్టంగా వినబడుతున్నా : ఏమైంది?
మా కాట్రీన్‌కు ఏమైంది?

వంటమనిషి : కంగారు పడకండి. వచ్చిన ప్రమాదం ఏమీలేదు.

మదర్ కరేజి : ఊహూ : అబద్ధం చెబుతున్నారు. మీ వాలకంచూసి ఆ మాత్రం గ్రహించలేనా ?

వంటమనిషి ; తిరిగి యుద్ధం ప్రారంభమైందా? మంచి శుభవార్త తెచ్చావు. ఈ పళాన బయలుదేరుతేనేగాని చీకటిపడేలోపున మా క్యాంపుకు చేరుకోలేను. కొంచెం ..(సందేహిస్తూ) కొంచెం ఏమైనా ఉంటే ఈ ఆకలిబాధ తీరుతుంది.

మదర్ కరేజి . మరేసంగతి పట్టినట్లుంది ఈ తిండిగొడవతో ; నన్ను మోసగిస్తున్నావు ? అమ్మాయిసంగతి ముందు చెప్పండి.

వంటమనిషి : ఆయిలిఫ్ మిమ్మల్ని చూడటానికి వచ్చాడు. వాళ్ళు మంచి బందోబస్తుతో వాడిని ఇక్కడికి తీసుకునివచ్చారు. ఎంతో బ్రతిమాలుకున్నా వాళ్ళవి. వాళ్లు మీరు వచ్చేటంతవరకు వాడిని ఉండనిస్తేగా.

మదర్ కరేజి : (ఆతృతతో) ఏమిటి ? అబ్బాయి వచ్చాడా ? ఆ రోజున మీ కెప్టెన్ శిబిరంలో చూపినదృశ్యం ఎలా మరచిపోతా : వాడు వీరుడు. కెప్టెన్ ఎలా పొగిడాడు వాడిభుజాలు ఆప్యాయంగా తట్టుతూ - ఇప్పుడు ఎలా వున్నాడు మా వాడు?

వంటమనిషి : అప్పటికి మళ్లేనే తన వీరత్వం ప్రదర్శిస్తూ...

మదర్ కరేజి ; నా బిడ్డ : చిన్నప్పటినుంచి అలాగే ఉండేవాడు. యుద్ధం వాడిని గుటకాయస్వా చేయకుండాఉండటం మన అదృష్టం చిన్నవాడిని చేసినట్లు. అబ్బాయి గట్టివాడు. అలాటివాళ్ళు కలికానికైనా దొరుకుతారా ఈ రోజుల్లో ? ఇక ఆలస్యం చేయకూడదు. మీరూ కాస్త చెయ్యివేస్తే సామాన్లు చకచక సర్దుకుంటా.

(లోపలికి నడుస్తుంది. ఆ పనిలో మునిగితేలుతూ)

ఏం చెప్పాడు ? వాళ్ళ కెప్టెన్‌తో మంచిగా ఉంటున్నాడా ? ఆ తరువాత ఏం చేశాడో చెప్పాడా ?

వంటమనిషి: (ఆ మాటకు అదిరిపోతూ శూన్యంలోకి చూస్తూ) మరో పీరకార్యం చేశానన్నాడు.

(అంతులేని మిలిటరీవాద్యాల ధ్వని వినబడుతూంటుంది.)

మదర్ కరేజి: (బయటికి రాబోతూ) అదంతా తరువాత చెప్పవచ్చు. ఇక మన బండి కదలించాలి.

(ప్రక్కన కంబళి కప్పుకున్న కూతురివి తడుముతూ)

అమ్మాయి! అమ్మాయి! కోపం వచ్చిందా లే! లే! ఆ పాడుశాంతివి ఇక చూడనక్కర లేదులే! ఇక మనకు చేతినిండా పని ఉంటుంది (వంటా యనతో) ఎంత పిలిచినా పలకటంలేదే. ఇప్పు డేం చేద్దాం.

వంటమనిషి. ఆ సంగతి మీరే తేల్చుకోవాలి. చేరుకోటానికి ఆలస్యం చేశానా నా పని పోతుంది. ఎంత తొందరగా అక్కడికి నడుస్తే అంతమంచిది.

మదర్ కరేజి: (కంపిస్తూ) అంటే ఈ సమయంలో నన్ను ఇలా విడిచిపెట్టి పోవాలనేగా మీ మాటల అర్థం? ఫాదరీ! ఫాదరీ ఏరీ? కనబడటంలేదే ఫాదరీ!

వంటమనిషి: ఆయిలిఫ్‌తో ఊళ్లోకి వెళ్ళాడు

మదర్ కరేజి; ఇలాటిసమయంలో నన్ను ఇలా వదలిపెట్టి వెళ్ళడం బాగాలేదు. నాదగ్గర ఉండాలి. నాకు చేదోడుగా ఉండాలి.

వంటమనిషి. నా సంగతి యేపేట్టిదగ్గర విన్నతరువాతకూడా....

మదర్ కరేజి· అందరిముందర అది మిమ్మల్ని అలా అవమానించినా, మీ విజాయితీ నాకు బాగా తెలుసు. తేలుకి కుట్టడమే స్వభావం. అందుకోసం బాధ పడడమెందుకు? మీరు రావాలి నాతోటి!

వంటమనిషి: రానని చెప్పుతానా ఇప్పుడు!...

మదర్ కరేజి: మీ ఆకలి ఎలాటిదో నాకు తెలుసు. అటుచూడండి! అక్కడ! ఆ అలమారులో!....పుచ్చుకుని ఆ ఆకలిమంట చల్లార్చుకోండి - పన్నెండో దళం! ఇంతవరకు నన్ను ఆదుకున్నది అదే. ఇంకోక్షణంలో ప్రొటెస్టెంటులమీద పడబోతోంది. మనం ఎంత తొందరగా ఇక్కడినుంచి వాళ్ళ కేసి చేరుకుంటే అంతమంచిది. అక్కడికి చేరుకున్నాక పీలు చూసుకుని

ఈ రాత్రే అబ్బాయిని కలుసుకోవచ్చు. శాంతిరోజులు నామమాత్రమే, యుద్ధం చకచక సాగిపోతుంది. ఇక మనకు నిత్యకల్యాణం. పచ్చ తోరణం.

(తుదిమాటలు వినడంతో పడుకున్న కాట్రీన్ చప్పున లేస్తుంది కప్పు కున్న కంబళి ప్రక్కకు తోస్తూ)

వంటాయన, కాట్రీన్ బండి లాగుతుంటారు. మదర్ కరేజి పాట పాడుకుంటూ బండివెంట నడుస్తూఉంటుంది.)

మనయాత్ర అద్భుతమైంది. ఎంతో అద్భుతమైంది.

ఉత్తరాదిలో ఉల్మనగరం

బయలుదేరటం అక్కడినుంచి

తిన్నగా దక్షిణాదిలో మేల్చీపట్టణానికి చేరుకున్నాం.

అక్కడినుంచి ఓ పళాన తూర్పుదేశాలకు నడిచాం

ఎక్కడచూసినా మదర్ కరేజి!

కరేజి లేకపోతే బండి సాగుతుందా!

యుద్ధసైనికులు ఆత్రుతతో పిలవడం ఆమెనే,

పుష్కలంగా తిండి పెడుతుంది వచ్చినవాళ్ళకి,

ఇక యుద్ధం, యుద్ధం సంగతా,

ఆ దేవతకు కావలసింది మందుగుండు సామానులు

ఎన్ని పేల్చినా తృప్తిపడుతుందా మరి?

ముఖ్యంగా ఇప్పుడు కావలసింది మనుష్యబలం

అవసరంగా కావాలి అంతులేని జనబలం

రండి రండి, చప్పున రండి!

మీ దళాలని మనుష్యబలంతో నింపండి.

యుద్ధదేవత మీనుంచి కోరేది దీన్నే

మనిషిబలం సమర్పించండి.

ఇప్పుడే కాదు, ఎప్పుడూ కావలసింది ఇదే !
మీ ధర్మం ఇదే ।
మీ కర్తవ్యమూ ఇదే ।
నడవండి, నడవండి, చప్పున నడవండి.
యుద్ధదేవతను సేవించండి.
        మీ ఆస్తి పాస్తులతో
        మీ మనుష్యబలంతో.

# తొమ్మిదో రంగం

రెండుసంవత్సరాల తరువాత 1634 సం॥లో. ఆ సంవత్సరంలో మామూలుగా రావలసిన చలికాలం చాలా ముందుగానే ముంచుకువివచ్చింది. జనం చలికి తట్టుకోలేక ఉక్కిరిబిక్కిరై పోతున్నారు. యుద్ధానికన్నా మరింత విజృంభణ చూపటానికి మహమ్మారి అయిరోపాఖండానంతా ముట్టడించింది. సస్యశ్యామలమైన దేశాలన్నీ ఊసరక్షేత్రాలుగా మారిపోయాయి. యుద్ధం సాగుతున్నది పదహారేళ్లనుంచి. దానిని అరికట్టటానికి ప్రయత్నించిన పెద్దలు కలికానికైనా కనబడటంలేదు. వాళ్ళదృష్టి ఇలాంటి సమయంలో ఇంతో అంతో ఏరుపాననై తేనేం లాభంపొందాలని ఇటు సైనికదళాలు, అటుజనం, యుద్ధాగ్నులకు, అంటువ్యాధులకు ఆహుతులవుతున్నారు. ఇప్పుడు మనం ప్రవేశిస్తున్నది జర్మనుదేశంలో మధ్యప్రాంతాలలోని కొంత ప్రదేశాలలోకి. స్వీడన్ వాళ్ళదే యుద్ధంలో ఇప్పుడు పైచెయ్యి. వాళ్ళదళాలు అలసిసొలసి ఈ చలికాలంలో రాజమార్గం సమీపంలో మకాం చేస్తున్నవి. ఆ దళాల ననుసరిస్తూ వస్తున్న మదర్ కరేజి వ్యాపారం బాగా దెబ్బతింటున్నది. తన వ్యాపారాన్నే మానేసి కూతురితో ఎక్కడైనా నిలకడగా ఉండాలని తాపత్రయపడుతుంది. ఆవిడకు ఇప్పుడు చాలా దగ్గరగా ఉన్న వంటమనిషి ప్లానులువేస్తాడు మదర్ కరేజిని తన దేశానికి తరలించుకొనిపోవాలని అదీ ఒక్కషరతుమీద. కరేజి కూతురిని ఇక్కడే వదిలిపెట్టిరావాలి. ఎలాటి పరిస్థితులలోనూ కూతురిని ఆదుకోవాలని నిశ్చయించుకొనడంమూలాన వంటమనిషి ప్లాను విఫలమవుతాయి. అతను తన దేశానికి వెళ్ళిపోతాడు. కరేజి కూతురు సహాయంతో బండిని ముందుకు కదలిస్తుంది.

(బాగా శిథిలమైన ఆ పరిసరాలు. ఫాదరీ ఇల్లు. ఉదయం ఎటుచూసినా మంచు. దాంతో చలిగాలికి, ఇక అంతేలేదు. బాగా మాసిపోయిన తోలు దుస్తులతో కరేజి, కాత్రీన్, వంటాయన, ఫాదరీ ఇంటికి సమీపంలో ఆపుకున్నబండిలో కూర్చుని ఉంటారు.)

వంట మనిషి : బాగా ప్రొద్దెక్కినా ఇంకా చీకట్లు కమ్మేఉన్నాయి. అంచేతనే కాబోలు ఈ వూళ్లోవాళ్ళు ఎవళ్ళూ బయటికి వచ్చినట్లు కనబడటంలేదు.

మదర్ కరేజ. అదే ఈ వూరి పాదరీఇల్లు. ఉదయం చర్చిగంటలు కొట్టడానికైనా ఆయనఇంట్లోనుంచి బయటికి రావాలిగా. ఆపని పూర్తిచేసుకున్నాకనే వేడివేడిగాఉన్న భోజనం చేయడం ఆయనకు అలవాటు.

వంటమనిషి : ఈ చలిగాలిమూలంగా ఆయనలేవడం, ఈ పనిచూసుకోడం కొంచెం ఆలస్యం అవుతుందని అనుకుంటా.

మదర్ కరేజ : వాళ్ళకుక్క మొరగడం ఇంతకుముందే విన్నా. ఇక ఆయన లేవవచ్చు.

వంట మనిషి : ఆ సందడికి లేస్తాడా అని నాకు సందేహంగా ఉంది.

మదర్ కరేజ : మనం పాటలు పాడుతుంటే ఆ సందడికైనా లేవవచ్చు.

వంట మనిషి : ఈ చలిలో మనం నోరు కదిలించేస్థితిలో ఉన్నామా పాటలు పాడటానికి. (ఇంకా కూతురు నిద్రపోతున్నది, తను గుప్తంగా ఉంచు కున్న రహస్యం కరేజికి చెప్పడం ఇదే మంచిసమయం అన్న ఆలోచన చప్పున బుర్రలో తట్టుతుంది) మా దేశంనుంచి జాబువచ్చింది. అమ్మ కలరావచ్చి చనిపోయింది. ఇంతవరకు అమ్మ చూసుకుంటున్న హోటలు బాధ్యత ఇక నాది. మా పిన్నమ్మ ఈ సంగతంతా తెలుపుతూ దేశదేశాలు తిరగడం కట్టిపెట్టి వెంటనే ఇంటికిరమ్మని వ్రాపింది (జేబులో జాగ్రత్త పరుచుకున్న ఉత్తరంతీస్తూ) ఇదిగో ఆ ఉత్తరం. నువ్వూ ఒకసారిచూడు. మా ఊరు చేరుకోడానికి ఏమాత్రం తాత్సారం చేశానా ఆవిడే ఈ ఆస్తి పాస్తులు గుటకాయిస్వా చేయవచ్చు.

మదర్ కరేజ : (ఉత్తరం తీసుకుని చదువుతూ) నేనూ ఈ వ్యాపారం చూసుకో లేని స్థితికి వచ్చా. యుద్ధంమూలంగా మన వ్యాపారం బాగా సాగుతుందని ఆశపడ్డాను కాని కని విని ఎరగనిరోగాలతో జనం మృత్యువాత పడడం చూస్తుంటే నా ఉత్సాహం నీళ్ళు కారిపోతోంది. పైగా మన సరుకులు కొన టానికి మిలిటరీవాళ్లు రావడంలేదు, ఎలా వస్తారు? ఆర్థికంగా చితికి పోతుంటే? మొన్న కళ్లార చూశాంగా ఈ ప్రాంతాలలో కదులుతూన్న దళాలు తిండీ తిప్పలులేక మలమల మాడిపోతూండడం... ఒకాయన నోట్ల

కట్టలు తెచ్చాడు వాటిని పుచ్చుకుని రెండు కోడిగుడ్లు ఇయ్యమని ఉప్పు బస్తా కొంటానికి ప్రక్కవూరిరైతు మంచి ఖరీదుచేసే నాగలి ఇచ్చి పోయాడు. ఈ నాగలితో ఎలాటి పొలాన్ని దున్నగలనో తెలియకుండా ఉంది! సారవంతమైన భూములని చూసుకునేవాళ్ళు లేక అవన్నీ ముళ్ళ దొంకలతో పనికిమాలిన వవుతున్నాయి. ఈ ప్రక్కవూళ్ళరైతులు ఆకలి తీర్చుకోడానికి వాళ్ళబిడ్డలనే తినివేస్తున్నారనే వార్తలు వింటూంటే బేజా రెత్తుతోంది దూరానఉన్న పట్టణాలలో మతాచార్యులుండే స్థావరాలని కొల్ల గొడుతూ ఉన్నారట బందిపోటుదొంగలు.

వంటమనిషి : ఇలాటి దుర్భిక్షం మరికొంతకాలం సాగితే లోకమే తలక్రిందులై పోతుంది.

మదర్ కరేజి : ఇలాటి దేశాలమీదుగా ప్రయాణం చేస్తుంటే మనం బండిని నరక లోకానికి తోసుకుని వెడుతున్నామా అనిపిస్తోంది. మన మింక స్వర్గసుఖాలు అనుభవిస్తామని ఈ పెద్దలు ప్రగల్భాలు చెప్పుకోటమెందుకో? ఈ దుర్భర స్థితి చూస్తుంటే ఈ వ్యాపారానికొక నమస్కారం చెప్పి ఏదో ఒకచోట తల దాచుకోడానికి ఏదో ఒక చిన్నఇల్లు చూసుకుంటే బాగుంటుందని తోస్తాంది. అప్పుడే మనశ్శాంతి వుంటుంది మనకు ..

వంటమనిషి : నువ్వు నా వెంట వచ్చెయ్యి మా హోటలు చూసుకుంటుందాం. దాంతో నీకు మనశ్శాంతి తప్పక లభిస్తుంది. నిన్నరాత్రే ఈ విషయమై ఒక నిర్ణయానికి వచ్చాను. నువ్వు నా వెంట రా. అలా నువ్వు రావటానికి ఇష్టపడకపోతే నే నొకడ్నే తిన్నగా వెడుతా. ఇవ్వాళే!...

మదర్ కరేజి. (కాట్రీన్ మేలుకోడం గుర్తిస్తూ) అమ్మాయి! కాట్రీన్!! ఇలా రావే!

వంటమనిషి. దానిని ఎందుకు పిలుస్తావు?

మదర్ కరేజి. దానితో ఈ విషయం సంప్రదించటం అవసరం. కొంచెం ఓపిక పట్టండి. అది ఇంకోనిమిషంలో వస్తుంది.....

(కాట్రీన్ తను పరుంటివున్న చోటునుంచి వస్తుంది.)

అమ్మాయి! నీ కొక శుభవార్త చెప్పాలే. వంటాయనా నేనూ వాళ్ళ దేశం వెళ్లాలనుకుంటున్నాం. వాళ్ళఅమ్మ నడుపుతూండే హోటలు అతని

స్వాధీనంలోకి వచ్చింది. వాళ్ళఊరు పెద్దదట. అక్కడ ఎంతోమందితో పరిచయం చేసుకోడానికి నీకు మంచి అవకాశముంటుంది. తెలివితేటలుగల నీవంటిపిల్లలు ఈ అవకాశాన్ని బాగా ఉపయోగించుకోవచ్చు మనకూ స్వంతఇల్లు అనేది వుంటుంది. ఆవూరూ ఈవూరూ ఇక తిరగనక్కర లేదు. నువ్వు అంతదూరం వెళ్ళటానికి ఇష్టపడకపోతే ఇంతకుముందు మన మున్న స్వీడను దేశానికైనా తరలటం మంచిది. (కూతురికి సంజ్ఞ చేస్తుంది వంటాయన్న ప్లానుకు ఒప్పుకోమని) ఏమంటావు? ఆయనతో వెళ్ళటానికి మనం నిశ్చయించుకున్నట్లే కదూ!

వంటమనిషి: (కరేజి చెవిలో) నీతో ఒకసంగతి ఏకాంతంగా చెప్పాలి. అది కొంచెంసేపు లోపల దానిపని చూసుకుంటూ ఉండడం మంచిది.

మదర్ కరేజి: (పిల్లతో) ఆయనతో వ్యాపారవిషయాలు సంప్రదించాలి. అమ్మాయి! లోపలికి వెళ్ళు

(కాట్రీన్ లోపలికి నడుస్తుంది)

వంటమనిషి: దాన్ని పంపివేయమన్నానని నువ్వేం అనుకోవద్దు నిన్ను నా వెంట రమ్మని ఎందుకు అడిగానో కొంచెం తాపీగా ఆలోచించు తరువాత ఈ విషయంలో మనమధ్య ఎలాటి మనస్పర్థలు ఉండకూడదు .. అది మన వెంట రావడానికి వీలులేదు ఈవిషయం ఎందుకు నొక్కిచెపుతున్నానో నీకూ అర్థమయిందనే అనుకుంటా ..

(వెనుకనుంచి కాట్రీన్ వీళ్ళమాటలు వింటూంటుంది)

మదర్ కరేజి (ఉద్రేకంతో) ఏమంటున్నావు? అది మనవెంట రాకూడదనేగా నీ కోరిక!

వంటమనిషి ఎందుకలా ఎదురుప్రశ్న వేస్తావు? మా వూరు అమ్మాయి వుండటానికి తగినచోటు కాదు. ఇల్లు చాలా ఇరుకు. ఇద్దరికిమాత్రమే సరిపోతుంది. అదీకాక మూడోమనిషివుంటే బోలెడు చిక్కులు. నా సలహా బండిని దాని కిచ్చేసి మనమిద్దరం మాదేశం వెళ్ళడం మంచిదని

మదర్ కరేజి: మీ దేశం తీసుకువెడితే దానికి అక్కడ తగినవరుడు దొరుకుతాడని నా ఆశ.

వంటమనిషి. నువ్వలా అంటుంటే నాకు నవ్వు వస్తోంది. దానికేమిటి? వరుడు

దొరకటమేమిటి ? అదీ ఈ వయస్సులోనా ? అదీకాక అది మూగది. గుడ్డిది కూడా.

మదర్ కరేజి : (కోపంతో) నోరుముయ్యి. అంత బిగ్గరగా మాట్లాడితే...

వంటమనిషి : ఊ ! బిగ్గరగా కాకపోతే చెవిలోనే ఊదుతాలే ! హోటలుకు వచ్చే వాళ్లు దానికేసి చూశారా ! ఆ తరువాత హోటలు భవిష్యత్తు ఏమవుతుందో నువ్వే ఆలోచించు.

మదర్ కరేజి : నువ్వు అలా బిగ్గరగా మాట్లాడడం ఏం బాగాలేదు.

వంటమనిషి : (సంభాషణ మార్చటానికి పావరీ ఇంటికేసి చూస్తూ) అమ్మయ్య ! వాళ్ళఇంట్లో ఇప్పుడు దీపం వెలుగుతోంది. అంటే ఆయన లేవాడన్న మాట ! వాళ్ళదృష్టి నాకర్షించటానికి ఇంక మనం పాటలూ పదాలూ ప్రారంబిద్దామా ?

మదర్ కరేజి : నువ్వు అలా సంభాషణ మార్చటం బాగాలేదు. అమ్మాయిని ఇక్కడ ఒంటరిగా బండితో వదిలేసివెళ్ళడం నేను ఒప్పుకోను. అది బండి లాగలేదు. అంతేకాదు. ఈ యుద్ధం అల్లకల్లోలం విని అది హడలి పోతోంది. రాత్రిళ్ళు కనుకుపట్టటం లేదు. నిద్రపోతున్నా పీడకలలు. దాంతో గావుకేకలు పెడుతూ ఏడకిపోతూండడం చూస్తూనే ఉన్నాంగా. చుట్టుప్రక్కలవాళ్ల కష్టాలుచూస్తూ అది క్రుంగిపోతోంది. గుండుదెబ్బలు తిన్న నోరులేనిజంతువు మనదోవలో దాని నాశ్రయిస్తే అది దానిని ఎలా హత్తుకున్నదీ మనం కళ్లారా చూశాం.

వంటమనిషి : ఆ ! నాకు తెలుసు దానిజాలి . కాని హోటలు చిన్నది.... ఈ గొడవ ఇప్పుడెందుకు ? ఆయన్ని పిలుద్దాం. (తిరిగి ఇంటికేసి చూస్తూ) అయ్యా ! ఇంట్లోఉన్న పెద్దల్లారా ! పిన్నల్లారా ! మేం పాటగాళ్ళం. వాడవాడల్లో, ఎండల్లో, వానల్లో, చలిరోజుల్లో, మంచురోజుల్లో మా పాటలు పాడు కుంటూ జనాన్ని సంతోషపెడుతుంటాం వాళ్ళు ఇంతో అంతో ఇచ్చి మా ఆకలిబాధ తీరుస్తూంటారు సాలొమోన్, జూలియస్ సీజర్ మొదలైన మహానుభావులున్నారు. వాళ్లు లోకోద్ధరణానికి ఎంత త్యాగంచేసినా లోకులు ఏ కోశానా అర్థం చేసుకోలెకపోయారు. వాళ్ళంటే మాకు ఎంతో భక్తి. వాళ్ళ ఆత్మశాంతికోసం, వాళ్ళ గొప్పతనం మనదేశాలవారు అర్థం చేసు

కవి భక్తివినయాలు వాళ్ళకు చూపటానికీ కొన్నిపదాలు స్వయంగా కట్టాం. అవి మీకు వినిపించాలని ఉబలాటపడుతూ ఉన్నాం. మీరు వీటిని విన్నారంటే మే మెలాటి మనుషులమో మీకు అర్థమైపోతుంది. చలికాలం. గడగడ వణకిపోతున్నాం దానిని తట్టుకోలేక. మీరే మా కష్టాలుచూసి మమ్మల్ని ఆదుకుంటారు.

"వినదగుమాటలు చెప్పెద మిపుడు
విశదముగా వినుడూ

అనుభవమున చెప్పిన పరమార్థం
ఆకళించుకొనుడూ బాబూ
ఆచరించి మనుడూ, బాబూ

పది దివ్యాజ్ఞలు పరిపాలించిన
పరమ పవిత్ర చరిత్రులైనా,
వీరాగ్రేసరులైనా,
విజ్ఞానాంబుధులైనా.
త్యాగమూర్తులైనా,
అరయగ తత్త్వవేత్తలైనా,

ఘనులగు మానవులెపుడూ,
సుఖమును పొందుట అరుదూ,
కుత్సిత మతులకు, క్రూరకర్ములకు,
కుక్షింభరులకు, కులటలకూ,
స్వార్థపరులకు, సంఘద్రోహులకూ,
వంచనపరులకు, వదరుబోతులకు,
నియమరహితులకు, నీతి విహీనులకు,
ఇతరుల కిడుములు పెట్టు దుష్టులకు,
ఈలోకము సుఖకరములుగా,
ఇంతెందుకు వారిదే పెత్తనమూ-

భూతభవిష్యము లెరిగినవాడు
అతడే సాలొమోన్ సామ్రాట్టు

జగతికి తెలిపిన ఘను డతడే
జనన మరణముల గుట్టూ తెలిపినవాడు
ఇంత తెలిపినా ఈలోకంలో
ఏమి గడించే దతడూ.

అవమానంతో. ఆక్రోశిస్తూ
అతను బ్రతుకును ఈదాడు
అతను పోయిన వెనుకనే
లోకం అతని ఘనతను గుర్తించింది
అట్టి మహాత్ములే పూజనీయులనీ
అమరజీవులనీ తలచండీ."

ఏమందోయ్! మహామహా ప్రమాదకరమైంది ఈ లోకం. మా పదాలు నొక్కిచెప్పేది ఇదే. కాని మనిషి దీనిని లక్ష్యపెట్టడు. అతనికి కావలసింది చీకూచింతా లేకుండా కాలిమీద కాలువేసుకుని కూర్చోడం. సకాలానికి పొట్ట నింపుకోటానికి తిండి. అదీ వేడివేడిగా ఉండాలి. ఎముకలనే పీల్చివేస్తుందే ఈ చలికాలంలో ఉదాహరణకు నన్నే తీసుకోండి. మలమల మాడిపోతున్నా నాకు ఈసమయంలో కావలసింది కడుపునిండా తిండి. నేనూ సైనికుడ్నే! రణరంగాలలో వీరుడిగా పోరాడాను. కాని యుద్ధం నాకు ప్రసాదించింది ఆకలిబాధ. దోపిళ్లుచేస్తూ పొట్ట పోసుకోడం కన్నా ఇలా దేశదిమ్మరిగా తిరుగుతూ కాలం గడపటమే మంచిది. ఏమంటారు?

"ధీరోదాత్తుడు సరసహృదయుడూ
అరయ జూలియస్ సీజరూ
అతని ఆజ్ఞలకెదురు చెప్పుటకు
అందరు మిక్కిలి వెరతురూ
చివరకు సీజరు అనుచరబృందమే
చంపెను అతనిని క్రూరముగా
అయినను అతని వీరకృత్యములు
అవనిని నిలిచెను స్మరణీయముగా

ఘనుడగు సీజరు మృతజీవనుడే
అనుపమ వీరుడే విక్కుముగా.''

(మెల్లగా) ఇంత వాగుతున్నా వాళ్ళు మనకేసి చూడటంలేదే. (బిగ్గరగా) ఏమండోయ్! ఇంటి యజమానిగారూ! ఇంట్లోఉన్న పెద్దల్లారా! పిన్నల్లారా! మీరంతా జీవనరథం లాగడంలో ఈ శౌర్యప్రతాపాలు ఏం ఉపయోగపడతాయని అనుకోవచ్చు. ఊరికే తిష్టవేసుకుని హాయిగా కూర్చోవాలనేగా మీకోరిక? దీనికి సమాధానం చెప్పండి.

''సోక్రటీసు కథ తమ కందరకూ
సాకల్యముగా తెలియునూ
సత్యశోధకుడు, శాంతమానసుడు.

అతిగంభీరుడే అయిననూ
విషపానముచే అసువ్వులు బాసెను
ముష్కరుల బలవంతంచే
తదనంతర మాతని తత్వముగురించి
ప్రపంచం కీర్తించే
ఘనుడు సోక్రటీస్ అమరజ్యోతిగ
మనుజలోకమున ప్రకాశించె.''

ఊ! ఆత్మశక్తి అలాటివాళ్ళలోనే ఊకలు వేస్తుంటుంది. ఆ దివ్యశక్తే లేకపోతే ఈ జీవితం వ్యర్థం. హాయిగా జీవించాలనుకున్నవాళ్లకి ఇదంతా అక్కరలేదు. కాని అక్షరాలా స్వార్థత్యాగంఅనేదే సద్గుణం. మార్కెట్లల్లో దొరికే చౌకవస్తువు కాదు. కష్టభూయిష్టమైంది.

''దయాశీలియై సాటిమనుజునకు
దుస్తుల నిచ్చెను మార్టినూ
త్యాగమే సర్వోత్కృష్టధర్మమని
జగతిని అతడు చాటెను
సకల త్యాగంచేసిన మార్టిను
సుఖముగ తనువును త్యజించె
సదయుడు మార్టిను

చిరంజీవియై
స్థలకాలములను జయించె.''

అలాటివారే చిరంజీవులు ఇక మా సంగతో? విజాయితీగలవాళ్ళం. దొంగిలించం. హత్యలు చెయ్యం, ఇతర్ల ఇళ్ళు తగలబెట్టం. అంచేత క్రింది స్థాయిలోనే ఉండిపోవాలసి వచ్చింది మా విజాయితీయే మమ్మల్ని కాపాడు తూంటుంది మంచికన్న చెడ్డకే లోకంలో మంచి చలామణి వుంది.

అయ్యల్లారా! మాకేసి చూడండి. ప్రభువు లోకానికి ప్రసాదించిన దివ్యాజ్ఞలు పదింటిని తూ చ, తప్పక నిలువబెట్టుతున్నాం. అని ఇంతవరకు ఆకలిదప్పులవి తీర్చాయి కావు. మీరా! నిప్పులకుంపటిదగ్గర తిష్టవేసుకుని కూర్చున్నారు. ఆకలి! భరింపలేనంత ఆకలి! మా ఆకలి నగమైనా తీర్చారా మీకు పుణ్యం ఉంటుంది.

''పరోపకార పరాయణులారా
ప్రేమమూర్తులౌ ప్రజలారా
వీనుల విందుగ పదములు పాడెడి
వీధిగాయకుల గమనిస్తారా
వారిక్షేమమును గుర్తిస్తారా
ఘనులగు మహనీయుల చరితలనూ
గానము చేయుటే మావృత్తి
సరసముగా చతురోక్తులతో
సన్మార్గమునూ దుర్మార్గమునూ
శోధించుటే మావృత్తి
మేడలు మిద్దెలు ఘన వాహనములు
మెండుగ మేము కోరగలేదూ
కూడు గుడ్డా కలిగిన చాలును
కలిమిగల దొరల కరుణయేచాలును
సర్వజీవులకు సకలప్రజలకు
సుఖశాంతులే మా ధ్యేయం
ప్రజారంజమే ప్రజాభ్యుదయమే
ప్రతిపదమున మా లక్ష్యం.

ఏమందోయ్, పెద్దల్లారా! పిన్నల్లారా! ఇంతకన్నా మరేం విన్నవించు కోమంటారు. మా పాటల్లో, మా పదాల్లో, మా వ్యాఖ్యానాల్లో? లోపల చలి మంటల ముందర కాలిమీద కాలువేసుకుని కాలక్షేపం చేస్తున్న పెద్దల్లారా! పిన్నల్లారా! ఈ చలిబాధకు ఓర్చుకోలేక పోతున్నాం. పైగా ఆకలి. చెప్ప రానంత ఆకలి. మీరు కాకపోతే మరెవ్వళ్ళకి చెప్పుకోమంటారు మా బాధ?

కంఠం: (పాదరీ ఇంటినుంచి) ఇంకా బయటే ఉన్నారా? మా ఇంట్లోకి అడుగు బెట్టండి. వేడివేడిభోజనం తయారుగా ఉంచాం మీకోసం.

వంటమనిషి: (కరేజితో) అక్కడికి నడుద్దాం రా. వాళ్ళు ఎంతో అప్యాయంగా పిలుస్తున్నారు వేడివేడి అన్నం పెడుదామని

మదర్ కరేజి: అమ్మాయిని వదిలిపెట్టలేను. మనలో ఒకళ్ళసంగతి ఒకళ్ళకి బాగా అర్థమైపోయింది ఏమంటావు చెప్పు? అదేనా నీ ఆఖరుమాట?

వంటమనిషి: ఊ! తాపీగా నువ్వు ఆలోచించుకో.

మదర్ కరేజి: ఇంక ఆలోచించటం అనవసరం.

వంటమనిషి: అలా జవాబియ్యటం బాగాలేదు. అయినా అదే నా ఆఖరుమాట. అందులో ఇక ఏ మార్పూ లేదు. నేనిలా అంటుంటే నాలో మానవత్వం లేదని నువ్వు అనుకోవచ్చు. నాది చిన్నహోటలు ఈ సంగతి ఇలావుంచి అక్కడికి వెడదాం రా. వాళ్ళు అలా పిలుస్తుంటే మనం వెళ్ళకుండా ఉండడం మర్యాదకాదు. ఆలస్యం చేశామా అక్కడిభోజనం చల్లబడి పోతుంది ...

మదర్ కరేజి: అమ్మాయినికూడా తీసుకుని వెడదాం.

వంటమనిషి: ఊహూ! ఇక్కడే ఉండనియ్యి వాళ్ళు మనకు పెట్టేదాన్లో కొంచెం దానికి జాగ్రత్త పరుచుకుందాం. ముగ్గురం ఓ పళాన అక్కడికి వెడితే వాళ్ళు భయపడుతారు.

(లోపల కాట్రీన్ చడీ చప్పుడూ లేకుండా తన సామాను సర్దుకుని మూట కట్టుకుంటుంది వాళ్ళకేసి చూస్తుంది వాళ్ళు అక్కడ వుండేగా! భోజనంకోసం పాదరీ ఇంటికి ఎప్పుడో వెళ్లారు. ఆ సంగతి పసికట్టింది. బండిచక్రాలలో ఒకదానిమీద వంటాయన చినిగిపోయిన లాగు ఉంచు తుంది. మరోచక్రంమీద తన తల్లి కోటూ భద్రపరుస్తుంది. దాంతో తన

పని ముగిసినట్లు. వాళ్ళు తిరిగి వచ్చేలోపుగా తను చక్కజేసుకున్న మూటతో బండి దిగుతూంటుంది. . )

మదర్ కరేజి : (గిన్నెనిండా భోజనంతెస్తూ ఈ దృశ్యం చూస్తూ హడలిపోతూ) ఏమిటే అమ్మాయి అదంతా ! దేవుడు శిక్షించాడా, లేక లోకం వెలివేసిందా నిన్ను...(గబగబ కూతురిదగ్గరకువచ్చి ఆపిల్ల చేతిలోనున్న మూట లాక్కని) దీన్లో ఏముందే. (మూట విప్పిచూస్తూ) ఏమిటి ! నీసామాన్లు మూటకట్టుకున్నావా ? అంటే మా మాటలు నువ్వు విన్నావన్నమాట. ఆ పాడుహోటలుకు నువ్వు లేంది రానని స్పష్టంగా చెప్పానుగా ! మన ముద్దరం ఆ మనిషి హోటలుకు ఏమాత్రం పనికిరాం.

(చక్రాలమీదఉన్న వంటాయన లాగు. తనచొక్కా చూస్తూ)

నువ్వు నిజంగా తెలివితక్కువదానివే! నువ్వు వెళ్ళిపోయాక వీటిముఖం చూస్తాననుకున్నావా ?

(కూతురిని గట్టిగా హత్తుకుని ముందుకు నడవనియ్యదు )

నువ్వు లేకపోతే అతనివెంట ఎన్నటికీ వెళ్ళను. అతనిదోవ అతనిది. మనదోవ మనది మనకు బండివుంది. అదే మనప్రాణం. దాన్నివిడిచి ఎక్కడికీ వెళ్ళను తల్లీ ! ఆ వంటమనిషి సామాన్లు బయట పారవెయ్యి.

(తనే లోపలికి నడిచి ఆ పని పూర్తిచేస్తూ చక్రంమీదఉన్న లాగుతీసి క్రింద పడేస్తుంది )

అతనికి మన వ్యాపారంతో ఎలాటిసంబంధం లేదు ఇక మరెవర్నీ మన మధ్యకు రానియ్యను. చలికాలం ! అయితేనేం ? ఎండాకాలం, వాన కాలంమల్లే ఇదికూడా దానిపని పూర్తిచేసుకుని వెడుతుంది. బండికాడి జాగ్రత్తగా పట్టుకుంటే ఈ మంచూ ఆ చలిగాలీ మనలనేం చేయవు

(తల్లీ, కూతురూ బండికాడి పుచ్చుకుని బండిని ముందుకు లాగుకుంటూ నడుస్తుంటారు

వంటమనిషి ఫాదరీ ఇంట్లోనుంచి బయటికి వచ్చేటప్పటికి ఎండి ఉన్న స్థలంలో కనబడ్డవి తన మురికిగుడ్డలు.

ఆసరికి బండి ఎంతోదూరం తూర్పుకేసి వెళ్ళింది. వంటాయన అటు కేసిచూస్తూ క్రింద పడివున్న తన సామాను పుచ్చుకుని తన ఊరికేసి పడ మటిమార్గములో నడుస్తూంటాడు )

## పదో రంగం

1635 సం॥ లో. ఒక సంవత్సరకాలం మదర్ కరేజి వాళ్ళకూతురు కాట్రీన్ బండివి ఈడ్చుకుంటూ దేశదేశాలు చుట్టుతూ ఉంటారు ఎక్కడ చూసినా క్షామం. మహామ్మారి. జనం పడుతూన్నబాధకు అంతేలేదు. అంత టితో పరిపోతేగా :

మత ధర్మోద్ధరణకోసం ప్రారంభించబడ్డ సంగ్రామం సాగిపోతూ ఉన్నది. జనసంఖ్యలో సగంభాగం ఆ యుద్ధపిశాచానికి బలి కావలసి వచ్చింది. ఇతరదేశాలకన్నా బాగా దెబ్బతిన్నది జర్మనుదేశం. అక్కడి సస్యశ్యామలమైన భూభాగాలు ఇప్పుడు ఊసరక్షేత్రాలుగా మారిపోయాయి.

(జర్మనీదేశంలో మధ్యప్రాంతాలలో రాజమార్గంలో. మదర్ కరేజి. కాట్రీన్ బండి లాగుతూంటారు దోవకు ఇరుప్రక్కల రైతుల ఇండ్లు. అటునుంచి ఎవళ్ళో పాడుతూన్న కంఠం వినబడుతూంటుంది.)

పాట పాడుతున్నాయన కంఠం :

తోట నడిమధ్య చక్కచేశాడు.
గులాబి మొక్క నాటాడు
మంచి ఎరువు వేశాడు
ఇంకా చేయాలసిన పోషణ చూసుకున్నాడు

మార్చినెల వచ్చింది
దాంతో చలికాలం పూర్తయింది

మొగ్గవేసింది గులాబిమొక్క
పూలు పూసాయి.

ఎండలకు, వానలకు,
చలికి, మంచుకు
మొక్క తట్టుకుంది

అంతులేని శక్తి మొక్కలో ఉంది
అంతులేని బలం దానికి ఇస్తున్నది అదే.

వసంతకాలం, ఎండాకాలం
వాటిదోవన చడీచప్పుడూ లేకుండా మాయమయ్యాయి.
తిరిగి చలికాలం :
అంతులేనంత చలి :

మంచు కురుస్తున్నది :
చలిగాలి వీస్తున్నది :

ఇక తుపానులకు లెక్కే వుండేగా :
ఉరుములకు, మెరుపులకు అంతేలేదు

పెద్దపెద్ద చెట్లు కూలిపోతున్నాయి
జనం చలికి తట్టుకోలేక పోతున్నారు

అయితేనేం గులాబిమొక్క నిలిచింది.

మొగ్గలు వేస్తున్నది.
పూలు పూస్తున్నాయి.

మేం కొట్టాలు కట్టుకున్నాం.
గడ్డితో.
ఆకులు అలాలతో.

ఈ రోజుల్లో
మాకు ఆశ్రయమిస్తున్నాయి

అవే. ఆ గడ్డి కొట్టాలే
ఈ చలినుంచి
ఆ తుపానునుంచి

ఇంకేం ప్రమాదం మాకు?
ఇంకేం భయం మాకు?

మా కొట్టాల్లో ఉన్నప్పుడు.

(ఆ కంఠనాదం మదీర్ కరేజికి కాత్రీన్‌కు అంతులేని మనశ్శాంతిని ప్రసాదించింది. ఇలాటి దుర్భిక్షకాలంలో అంతా పోగొట్టుకున్నా ఈ బీద రైతులకు ఆశ్రయమిచ్చినవి వాళ్ల కట్టుకున్న గడ్డికొట్టాలు. తల దాచుకొన

టానికి ఇల్లు అనేది ఉండటంమూలాన బయటిబాధలు మరిచిపోవటానికి వాళ్ళకి అదృష్టం కలిగింది.

తల్లీ, కూతురు ఇప్పుడు నడుస్తూఉన్నది ఈ దుర్భరమైన చలికాంలో. తమకే అలాటి కొట్టమో, అది కాకపోతే ఒక గుడిసో ఉండివుంటే ఈ చలిబాధనుంచి తరుణోపాయం ఉంటుంది. అప్పుడు ఈ దేశాలు తిరగడం మానెయ్యవచ్చు :

ఆ గ్రామంనుంచి ముందుకు బండిని లాగుతూఉన్నసమయంలో వాళ్ళ ఆలోచనలు అవే అవే తమనిలకడ జీవితానికి పునాది వేయగలవని కలలు కంటూ ఉన్నారు తల్లీ, కూతురూ ముందుకు కదులుతూ.)

# పదకొండవ రంగం

మరో సంవత్సరం కాలగర్భంలోకి దొర్లుకుని పోతూన్నది. 1636 సం॥ జనవరినెల. జర్మనీ మధ్యప్రాంతాలలో ఇంకా యుద్ధం సాగుతూనే ఉంది. క్యాథలిక్కు మతస్థుడయిన చక్రవర్తి దళాలు ప్రొటెస్టెంటు మతస్థుల కేంద్రనగరమైన హాలేనగరంమీద దాడి వెడలటానికి పెద్ద ఎత్తున ప్లానులు వేసుకున్నాయి.

ఆ పరిసరాలజనులు ఎదుర్కొంటూన్న యాతనకు భరించలేక రాళ్లూ రప్పలూ కంట తడిబెట్టుకుంటూండడం గుర్తించవచ్చు మదర్ కరేజి కూతురు క్యాట్రిన్‌ని ఈ ప్రాంతాలలో పోగొట్టుకుంటుంది. అయినా సరే తనే బండిని లాగుకుంటూ ముందుకు వెడుతూఉంటుంది.

యుద్ధం ముగిసేసూచనలు కనబడటంలేదు.

(హాలేనగరం సమీపంలో ఒక బీదరైతుల ఇంటిముందర బండి ఆగుతుంది. చీకటి రాత్రి. ఆ ఇల్లు చూస్తుంటే అందులో ఉంటున్న రైతు కుటుంబం ఎంత బీదతనం అనుభవిస్తుందో తెలుసుకోవచ్చు ఆ ఇంటికి చేరువలో అడవి. ఆ అడవిలోనుంచి కొత్తగా ఆఫీసర్‌పదవికి వచ్చిన యువకుడు ఆయుధప్రాణులైన ముగ్గురు సైనికులని వెంటబెట్టుకు రైతు ఇంటికేసి వస్తుంటాడు.)

యువ ఆఫీసర్ : ఇక్కడ ఎవళ్ళనందడి వినబడకూడదు. మనరాకని పసికడుతూ ఇక్కడివాళ్ళు ఎవళ్ళయినా అరిచారా వాళ్ళని వెంటనే మీ ఈటీలతో పొడిచి వేయండి.

సైనికులలో ఒకడు, అలా అంటారెందుకు? మనకుతోడు ఎవళ్ళయినా కావాలంటే వాళ్ళతలుపులు తట్టాలిగా.

ఆఫీసర్ : తలుపు తట్టిన చప్పుడుకేమీ ఫరవాలేదులే. కొట్టంలో పశువులు ఆ చప్పుడుకు కంగారుపడవచ్చే. అంతే! అంతే! మరేప్రమాదం ఉండదు.

(సైనికులు రైతు ఇంటిముందుకువచ్చి తలుపు తట్టుతారు. రైతుభార్య తలుపు మెల్లగాతీస్తూ వాళ్ళని చూడడంతో హడలిపోతూ గావుకేక లేస్తుంది.

ఒకసైనికుడు ఆవిడనోరు గట్టిగా మూస్తాడు. మిగిలిన ఇద్దరూ లోపలికి నడుస్తుంటారు.)

లోపలినుంచి మగవాళ్ళ కంఠాలు : ఏమైంది? ...ఏమైంది? ...వచ్చింది ఎవళ్ళు?

(లోపలికి నడిచిన సోల్జర్లు రైతుని, అతని కొడుకుని బలవంతంగా బయటికి లాక్కుని వస్తుంటారు.)

ఆఫీసర్ : (దృష్టి ఇంటిముందున్న బండిమీద....బండిముందు కూర్చున్న కాట్రీన్ వైపు వ్రేలుచూపుతూ) ఊ! ఈ మనిషినికూడా!

(సోల్జరు బండిదగ్గరకు వస్తుంటాడు)

(లోపలినుంచి రైతుని, అతని కుమారుడిని సోల్జర్లు బయటికి తీసుకుని రావడం చూస్తూ) ఇంట్లోఉన్నది వీళ్ళేనా?

ముసలిరైతు : ఊ! వీడు మా అబ్బాయి.

రైతుభార్య : (బండినిచూపుతూ) ఆ బండిలోఉన్నది మూగపిల్ల. వాళ్ళఅమ్మ సామాన్లు కొనుక్కోటానికి ఊళ్ళోకి వెళ్ళింది.

ముసలిరైతు : వాళ్ళు బేరసారాలు చేసుకునేవాళ్ళు. జనానికి కావలసినవస్తువులు చౌకగా అమ్ముతుంటారు.

రైతుభార్య : ఊరూరూ తిరుగుతూఉంటారు వాళ్ళబండితో.

ఆఫీసర్ : ఏమిటా అధికప్రసంగం! ఏమైనా సందడిచేశారా మా ఈసెలకి మీ ప్రాణాలు బలి ఇయ్యవలసివస్తుంది. ఊళ్ళోకి దోవ చూపటానికి మాకు సహాయం కావాలి.

(రైతు అబ్బాయివంక చూస్తూ) ఓయ్, నువ్వు మావెంట రావాలి.

రైతుకొడుకు : ఊహూ! నాకు దోవ తెలియదు, ఈ చీకట్లోనా!....

సైనికుల్లో ఒకడు ; (నవ్వుతూ) ఏళ్ళు పైబడ్డా పసిపాప!...నీకు దోవ తెలియదూ?

రైతుకొడుకు : ఊహూ! మీరు క్యాతలిక్కులు. మీకు ఏమాత్రం సహాయం చేయడం మా కిష్టంలేదు.

సైనికుల్లో రెండోవాడు : (ఆఫీసర్‌తో) వింటున్నారా వీడి వాగుడు! మనకు సహాయం చేయడట.

ఆఫీసర్ : ఈ భడవ అలా వాగుతూంటే చూస్తూ ఊరుకున్నారా?

(సైనికుడితో) ఓయ్! దాంతో కొట్టు.

(సైనికుడు ఈటెతో గుచ్చుతాడు.)

రైతుకొడుకు. (గట్టి దెబ్బతిని పడిపోతూ) నేను మీవెంట వచ్చినా వాళ్ళు హత మారుస్తారు.

సైనికుల్లో మొదటివాడు : ఆ! ఒరేయ్. అలా దోవలోకి రావాలి.

(కొట్టాంకేసి నడుస్తూ లోపలనున్న పశువులవి లెక్కపెడుతూ. తిరిగి ఆఫీసర్ దగ్గరకువస్తూ) రెండు ఆవులు, ఎద్దు ఒకటి (అంటూ క్రిందపడ్డ అబ్బాయిని లేవనెత్తుతూ) నువ్వు మాకు సహాయపడకపోతే విన్నే కాదు. మీ పశువుల్ని కూడా ఇప్పుడే హతమారుస్తా. జాగ్రత్త!

రైతుకొడుకు : నన్ను చంపివెయ్యి. (బతిమాలుతూ) మా పశువులజోలికిమాత్రపి పోవద్దు.

రైతుభార్య : (శోకంపెడుతూ) అయ్యో! అయ్యో! కెప్టెన్ దొరా! పశువులకేసి వెళ్ళకండి. అవికూడాపోతే ఇంక తిండిలేక చావాల్సివస్తుంది.

ఆఫీసర్ : మీ అబ్బాయిని మావెంట పంపకపోతే వెంటనే వాటిని చంపేస్తాం.

సైనికులలో మొదటివాడు. ఆ ఎద్దుతో మొదలుపెడతా.

రైతుకొడుకు : (ముసలి తలిదండ్రులకేసి దీనంగా చూస్తూ) వీళ్ళవెంట వెళ్లాలసిందేనా?

(తల్లి తల ఊపుతుంది)....సరే! పదండి.

రైతుభార్య. (ఆఫీసర్ తో) ఈ గండంనుంచి మమ్మల్ని గట్టెక్కించినందుకు ఎంతో కృతజ్ఞులం...

(చర్చిలో నేర్చుకున్నపాటాలు ఇంకా ఇంకా వల్లించబోతూంది. ముసలి రైతు వారిస్తుంటాడు)

సైనికుల్లో మొదటివాడు : ఏమిటా నాటకం? మీ ప్రాణాలకన్నా ఆ ఎద్దే మీకు ఎంతో ఎక్కువని తెలిసేట్టుంటే ..

(రైతుకొడుకు ఆ చీకటిలో దోవ చూపుతుంటే ఆఫీసర్ సైనికులు వాడి ననుసరిస్తూ ముందుకు కదులుతుంటారు.)

మునలిరైతు : వీళ్ళు ఊళ్ళోకి వడిచప్పుడూ లేకుండా వెడుతూ ఉండటంచూస్తుంటే మన ఊరికి ఏదో పెద్ద ఆపత్తు వచ్చేటట్లు ఉంది.

రైతుభార్య : నాకూ అలానే తోస్తోంది. ఇప్పుడేం చేద్దాం ?

మునలిరైతు . (ఇంటికప్పుకు విచ్చెనవేసి పైకి ఎక్కుతూ) ఊరిమీద పడటానికి వచ్చినవాళ్ళు వీళ్ళేనా . చూస్తా .

(వలుప్రక్కల కలయచూస్తూ)

ఇంతరాత్రిపూట ఆ అడవిలో సందడిగా ఉందే ; ఆ సందడేమిటో, ...వెలుతురుగా ఉంది కూడా ; ..ఆ ! ఫిరంగులు స్పష్టంగా కనబడు తూన్నాయి ..అమ్మయ్యో ! సైనికులు ! ఒకళ్లా ఇద్దరా !....పెద్దపెద్ద దళాలు అక్కడ మకాం చేసినట్లుంది...మన ఊళ్ళోవాళ్ళకి ఈ గుట్టు తెలుసో లేదో ? ..

రైతుభార్య : ఊళ్ళో దీపాలు కనబడుతున్నాయా ?

మునలిరైతు : ఊఁహూ ! ఏం కనబడటంలేదు. మనవాళ్లు గాఢనిద్రలో ఉంటారు ఈ అర్ధరాత్రిలో.

(క్రిందికి దిగివస్తూ) ఈ దళాలే ఈ సమయాన్ని ఊరిమీద పడ్డాయా, ఇంకేం వుంది ?

రైతుభార్య : ఊరి కాపలావాళ్లు ఈ గుట్టు పసిగట్టి ఉంటారనుకుంటా.

మునలిరైతు : కాపలావాళ్ళు మేలుకునివుంటే వాళ్ళచేతఉండే కొమ్ముబూరాలు కన బడుతూ ఉండాలిగా.

రైతుభార్య . ఇప్పుడు ఇక్కడ మనవాళ్ళు ఎవళ్లయినా ఉండివుంటే ..

మునలిరైతు . ఆ మూగ అమ్మాయితప్ప మరెవళ్ళూ లేరే !

రైతుభార్య : మనం ముసలాళ్ళం. ఈ ఆపత్కాలంలో ఏ సహాయం చేయలేని స్థితిలో ఉన్నాం.

మునలిరైతు : ఊ !

రైతుభార్య : ఊ ! మనవాళ్ళకి రాబోయేప్రమాదం చెప్పటానికి ఈ కటికచీకట్లో మనం నడవలేం....

మునలిరైతు: ఇటు శత్రువులమురాలు అంతు పంతూ లేకుండా ఉన్నాయి.

రైతుభార్య: మనవాళ్లకేం సహాయం చేయలేకుండా ఉన్నామే వీళ్ళగుట్టు ఇంతో అంతో తెలిసినా? . ఇప్పుడేం చెయ్యాలి?

మునలిరైతు: మనమేం చేయలేం. చడీ చప్పుడూ కాకుండా కూర్చోవాలి. లేక పోతే వీళ్ళు చీల్చి చెండాడుతారు.

రైతుభార్య: నగరంమీద పడటానికిపోతూ మన ఇంటిమీద పడుతారేమో కొంప ముంచి?

మునలిరైతు: ఆ! ఏ అఘాయిత్యం చేసినా చేయవచ్చు.

రైతుభార్య: (బండిలో అలా కూర్చునివున్న కాట్రీన్ కేసి చూస్తూ) పిల్లా! పిల్లా! మేం ఈ సమయాన చేయగలిగింది దేవుణ్ని ప్రార్థించడం. రాబోయే రక్త పాతం ఆపటానికి మేమేం చెయ్యలేనిస్థితిలో ఉన్నాం. పాపం! నువ్వు మూగపిల్లవు. నోరుతెరిచి మాట్లాడలేవు...అయినా కొంచెం తీరికగా కూర్చుని ప్రార్థనచేయడం నీకూ తెలిసేవుండాలి. నీవంటివాళ్ళు నోరుతెరిచి చెప్పలేకపోయినా దేవుడు తప్పక వింటాడు నీ ప్రార్థన. నేనూ ఉన్నానుగా నీతో కలిసి ప్రార్థన చేయడానికి...

(రైతుభార్య, మునలిరైతూ మోకరిస్తుంటారు. కాట్రీన్ బండినుంచి దిగివచ్చి వాళ్ళవెనుక ఉండి అలా చేస్తుంది )

"మా తండ్రీ, స్వర్గలోకంలోఉన్న తండ్రీ! మా ప్రార్థన విను. మా ఊరికి వీళ్ళమూలంగా ఎలాటిప్రమాదం రాకుండాచూచే బాధ్యత ఇక నీదే! మా వాళ్లంతా గాఢనిద్రలో ఉన్నారు. రాబోయే ఆపద కాస్తయినా వాళ్ళకు తెలియదు. వాళ్లని చప్పున లేపు తండ్రీ! నువ్వు లేపితే తప్పక లేస్తారు. కోటబురుజులమీదికెక్కి సంగతి తెలుసుకుంటారు. కత్తులూ, కటారులూ పుచ్చుకుని ఈ కటికచీకట్లో నీశక్తితో ఈ శత్రుదళాలను చెల్లాచెదరు చేయ గలుగుతారు. అలాటి అదృష్టం మా వాళ్ళకు కలిగించు ప్రభూ!

(రైతుభార్య తను చేస్తున్నప్రార్థన అపుతూ కాట్రీన్ వెనుకకువస్తూ ఆ పిల్లతరపున)

"తండ్రీ! వీళ్ళఅమ్మ ఊళ్ళోకి వెళ్ళింది. ఆవిడని రక్షించాలసినబాధ్యత కూడా నీదే!"

(తిరిగివెళ్ళి తను ఉన్నచోటనే మోకరిస్తూ)

"ప్రభూ! నీ దివ్యశక్తి మా కావలావాళ్లని వెంటనే మేల్కొల్పాలి. ఆలస్యమైతే విషమిస్తుంది....

"తండ్రీ! ఇంకో కోరిక. ఊళ్ళోఉన్న మా మరిదిని మరచిపోవద్దు. వాళ్లకు ఉన్నది నలుగురు పిల్లలు. వాళ్ళు అమాయకులు. వాళ్లకి ఎలాటి ప్రమాదం రాకుండా చూసుకునేభారం నీదే. పాపం! వాళ్లకు ఇప్పుడు రాబోయేప్రమాదం ఏమాత్రం తెలియదు....

(కాత్రీన్ తన మూగస్వరంతో ఏమేమో అంటుంటుంది.)

"తండ్రీ! మావాళ్ళ చిన్నవాడికి రెండేళ్ళే. పెద్దవాడికి ఏడు....

(ఆ సమయంలో కాత్రీన్ బుర్రలో ఏం తోచిందో మోకరించుకున్నది వణకిపోతూ చప్పున లేస్తూంటుంది.)

"ప్రభూ! ప్రభూ! స్వర్గలోకంలోఉన్న మా తండ్రీ. మా ప్రార్థన కొంచెం శ్రద్ధతో ఆలకించాలి. అప్పుడే మమ్మల్ని ఆదుకోగలుగుతావు.... అలా వినటానికి ఓపిక లేకపోయిందా మాకు అధోగతే!...

ఇప్పుడు మా దగ్గర ఈటెలు లేవు. మరే ఆయుధాలూ లేవు. ఈ అసహాయస్థితిలో మమ్మల్ని మేమే నమ్మలేకపోతున్నాం. నువ్వే మా ఆస్తిపాస్తులు చూసుకోవాలి. మా పూరిఇంటిని, పశువులనీ నీ స్వాధీనం చేస్తున్నాం. అంతేకాదు తండ్రీ! మా పూరికావలా నీ పైనే వేస్తున్నాం. శత్రువు పెద్ద బలగంతో మా పూరి ప్రహరీగోడలని కూలగొట్టబోతున్నాడు....

(ప్రార్థన ఈవిధంగా జరుగుతూన్నసమయంలో కాత్రీన్ చడీచప్పుడూ లేకుండా అక్కడినుంచి బండిలోకివెళ్ళి ఏదో తనదుస్తుల్లో దాచుకుంటుంది తప్పుకు ఆనించివున్న నిచ్చెన ఎక్కి పై కప్పుమీదికి చేరుకుని అటు ఇటూ పారచూస్తుంటుంది.

రైతుభార్య మిగతా ప్రార్థనఘట్టం సాగిస్తూఉంటుంది.)

"ఊళ్ళో పిల్లలని, పెద్దలని ఒకకంట కనిపెట్టు. వాళ్ళనేకాదు. ఇంకా నీ కరుణాకటాక్షం ఆశిస్తూన్న జీవకోటి ఎంతో వుంది. వాటినికూడా మరిచి పోవద్దు తండ్రీ! మా తప్పులు క్షమించు. మేం-ఇతర్ల తప్పులని క్షమిస్తాం. ఇక సెలవా, తండ్రీ....

(మునలిరైతు భార్య అంటున్నమాటలని నొక్కి-నొక్కి- పలుకుతూ ఉంటాడు ఇక్కడ.

అక్కడ ఇంటి కప్పుపైన కా్రటీన్ కూర్చుని తను దుస్తులలో దాచుకుని తెచ్చుకున్న ఢంకామీద శబ్దంచేస్తూ ఉంటుంది.)

రైతు భార్య: (ఆ సందడికి చేస్తున్న ప్రార్థన ఆపుతూ కప్పుపైకి చూస్తూ) "ప్రభూ! ప్రభూ! మూగపిల్ల అక్కడ ఏం చేస్తున్నదో ఒక్కసారి చూడు....

మునలి రైతు: (పైకి చూస్తూ హడలిపోతూ) ఆ పిల్లకు మతి పోయినట్లుందే!

రైతు భార్య: నువ్వు చప్పున పైకిఎక్కి దానిని క్రిందికి లాక్కురా.

(రైతు తను ఉన్నచోటినుంచి లేచి నిచ్చెన ఎక్కటానికి కదులుతాడు. అతను అక్కడికి చేరుకునేలోపునే కా్రటీన్ క్రింది నిచ్చెన పైకి లాక్కుని కప్పుమీద ఉంచుతుంది.)

రైతు భార్య: అది మనకు తప్పక ప్రమాదం తెస్తుంది.

మునలి రైతు: (పిలుస్తూ) మూగపిల్లా! ఆ ఢంకామోత వెంటనే ఆపివెయ్యి.

రైతు భార్య: (గుండెలు కొట్టుకుంటూ) ఈ క్యాతలిక్కుదళాలు ముందు మన మీదికే ముంచుకుని వస్తాయి.

(కప్పుపైన ఢంకా మోగుతూంటుంది.)

మునలి రైతు: (క్రింద పడివున్న రాళ్ళు తీసుకుని) నువ్వు ఆపకపోయావా ఈ రాళ్ళు నీ మీద రువ్వుతా! దిగు! క్రిందికి దిగు చప్పున!

రైతు భార్య. ఏమిటీ ఈ విడ్డూరం! పరాయివూళ్ళవాళ్ళని తల దాచుకోటానికి మా ఇంటిముందర చోటు చూపినందుకు నువ్వు చేస్తున్న ఉపకారం ఇదా! దిగు! దిగు! వెంటనే దిగు నిచ్చెన క్రిందికివించి. వీళ్లు వచ్చారా. మమ్మల్ని చీల్చి చెండాడుతారు. ఇక మాకు పుట్టుగతులు ఉండవు.

(కా్రటీన్ ఊరికేపిమాస్తూ మరింత గట్టిగా ఢంకా మ్రోగిస్తుంది)

రైతు భార్య: (భర్తతో) ఈ దేశదిమ్మరులు మన ఇంటిదగ్గరికి వచ్చినప్పుడే చెప్పా వాళ్ళకి మన ఇంటిదగ్గర చోటు ఇయ్యవద్దని. నువ్వు నామాట వింటేనా! ... ఇప్పుడు చూస్తున్నావుగా... వాళ్ళకేం శత్రువులు మనలని అటకాయించి మన గొడ్లని కాజేస్తే!

*

**ఆఫీసర్ :** (ఊళ్లోకి వెళ్ళటానికి బయలుదేరినాయన ఈ సందడివింటూ ఆదరా బాద రాగా వస్తాడు. అతనివెంట రైతువాళ్ళ కుర్రవాడు, సైనికులూ పరుగెత్తు కుంటూ వస్తారు పై దృశ్యంచూస్తూ పెద్దగొంతు చేసుకుంటూ రైతు, రైతు భార్యకేసి తీవ్రంగాచూస్తూ) ఏమిటీ మీరంతా షరీకయి చేస్తున్న ఈ రగడ? ముక్కలు ముక్కలుగా నరుకుతాం మిమ్మల్ని అందరిని ...

**రైతు భార్య :** కెప్టెన్‌దొరా! కెప్టెన్‌దొరా! తప్పు మాదికాదు. మా కళ్ళల్లో దుమ్ము కొట్టి ఆ పిచ్చిది పైకి ఎక్కింది. పరాయిమనిషి.

**ఆఫీసర్ :** నిచ్చెన ఎక్కడ?

**ముసలి రైతు :** పైన.

**ఆఫీసర్ :** (పైకి చూస్తూ) ఓయ్! ఆ వాద్యం క్రింద పడెయ్యి వెంటనే. ఇది నా ఆర్డర్!

(కాత్రీన్ మరింత గట్టిగా ఢంకా బాదుతుంది)

చెప్పింది వినబడటం లేదూ!

(రైతుకుటుంబంవంక చూస్తూ)

ఎలాటి చప్పుడు చేయమని మీరంతా మాట ఇచ్చారు ఇది చూస్తుంటే మీకు బ్రతకాలని ఆశ వున్నట్లులేదు.

**ముసలి రైతు :** ప్రక్క అడవిలో చప్పు దవుతున్నది. ఎవళ్ళో చెట్లు నరికివేస్తు న్నారు. మీరు ఆర్డరుఇస్తే ఒకకొమ్మ వాళ్ళదగ్గరనుంచి తెచ్చి ఈ పిచ్చి దాన్ని పైనుంచి క్రిందికి లాగేస్తా....

**సైనికుల్లో ఒకడు .** (ఆఫీసర్‌తో) మీ కొక మంచిసలహా ఇస్తా. (చెవిలో ఏదో ఊదుతాడు. ఆఫీసర్ తల ఆడిస్తాడు) ఇదిగో! ఇదిగో! ఇంటిమీదఉన్న అమ్మాయి! మీరు బీదవాళ్ళు. మంచి బహుమానం ఇస్తారు ఆఫీసర్‌గారు. వెంటనే క్రిందికిదిగి మావెంట ఊళ్ళోకి రా. మీ అమ్మనుచూపు. మీ పంట పండుతుంది.

(కాత్రీన్ ఢంకా మరింత గట్టిగా కొడుతూఉంటుంది.)

**ఆఫీసర్ :** (సైనికునితో) నీ పథకం పని చేస్తున్నట్లు కనబడటంలేదు. ఏదో ఒరి గిస్తావనుకున్నా.

(తనే పైకి చూస్తూ)

ఇదిగో అమ్మాయీ! మాట ఇస్తున్నా మిలిటరీ ఆఫీసర్‌ని. ఇచ్చినమాట నిలుపుకునేవాణ్ణి

(కాట్రీన్ తల అడ్డంతిప్పుతూ విరామంలేకుండా ఢంకా వాయిస్తుంది)

సైనికుల్లో ఇంకొకడు: అలా అది చప్పుడుచేస్తుంటే ఊళ్లోవాళ్లు మేలుకుంటారు. ఇక దీనిచప్పుడు ఏవిధంగానైనా ఆపాలి.

ఆఫీసర్: మనమూ దానికన్నా రెట్టింపుచప్పుడు చేద్దాం....సరే! దేంతోచేస్తే బాగుంటుంది?

సైనికుల్లో ఒకడు: కెప్టెన్ ఆర్డర్లు మనం ఎలాటిచప్పుడూ చేయకూడదని. వాళ్ళ ఆర్డర్లు మీరు అతిక్రమించటమా?

ఆఫీసర్: నీది మట్టిబుర్రోయ్! రెజిమెంటువాళ్ళ ఆర్డర్లు ఇలాటిసమయంలో యుద్ధ నాదం చేయవద్దని. ఆ చిన్నవిషయం అర్థంకాకపోతే ఎలా? ...సామాన్యపు వాద్యాలు నిరక్షేపంగా ఉపయోగించవచ్చు మనం.

ముసలి రైతు: ఇప్పుడు చప్పుడుచేయడం అవసరమని మీకుతోస్తే గొడ్డలి పుచ్చు కుని (దగ్గరఉన్న కలపమామలు చూపుతూ) వీటిని కొడతా.

ఆఫీసర్: ఊ! మంచి ఆలోచన. వెంటనే ఆపని ఆరంభించు.

(ముసలిరైతు గొడ్డలితెచ్చి మాను కొడుతూఉంటాడు)

ఇంకా గట్టిగా కొట్టాలి. నీ బలమంతా ఇప్పుడు చూపకపోయావా నీ ప్రాణాలకే ముప్పు.

(కాట్రీన్ వాళ్ళమాటలు వినటానికి తన ఢంకా మెల్లగా కొడుతుంది. ఆ తరువాత ఊళ్ళోకిచూస్తూ తనపని మరింత పెద్దఎత్తున చేస్తూఉంటుంది)

ఆఫీసర్: (రైతుతో) బలంగా కొట్టడంలేదు. (సైనికుల్లో ఒకనితో) నువ్వు చేయి వెయ్యి.

ముసలి రైతు: ఇంట్లో ఉన్నది ఒకటే గొడ్డలి. (తను కొట్టడం ఆపుతాడు)

ఆఫీసర్: ఇక మనం చేయాలసింది ఇంటి కప్పుకు నిప్పు పెట్టడం. కప్పు మంట లతో కాలిపోతుంది.

ముసలి రైతు: ఆపనిచేస్తే ప్రయోజనంలేదండి. మాది గడ్డికప్పు. మంటలు ఊళ్లోకి బాగా కనబడుతాయి. అప్పుడు మీ గుట్టు వాళ్ళకు తెలిసిపోతుంది.

(కాట్రీన్ తనపని యథాతథంగా చేస్తూ వాళ్ళకేసిచూస్తూ పకపక నవ్వుతుంది.)

ఆఫీసర్: దానికి భయం లేనట్లుంది. మనల్నిచూసి నవ్వుతుందా? (సైనికులతో) దాన్నిచూస్తూ ఊరుకుంటారేం? . నేనే కాలుస్తా . క్రిందపడి చస్తుంది... గుండు సామాను తీసికురిరా.

(ఒక సైనికుడు సామాను తీసుకురావటానికి పరుగెత్తుతాడు. కాట్రీన్ మరింత గట్టిగా మ్రోగిస్తుంది)

రైతు భార్య ఏమండోయ్ కెప్టెన్‌దొరా! నేనొక మంచిసలహా ఇస్తా. అదిగో! అదే వాళ్లబండి. దానిని మా గొడ్డలితో చితకగొట్టామా బాగా సందడవుతుంది - ఆపిచ్చిపిల్ల దానినిచూస్తూ క్రిందికి దిగివస్తుంది - ఈ బండితప్ప మరే ఆస్తిపాస్తులు వాళ్ళకు లేవు.

ఆఫీసర్: (రైతు కొడుకుతో) ఆ పని నువ్వే ప్రారంభించు.

(పైకి చూస్తూ)

ఓ పిల్లా! నువ్వు ఆ వాయించడం వెంటనే కట్టిపెట్టకపోయావా, మీ బండిని ముక్కలుగా కొట్టించేస్తా....చెప్పింది వింటున్నావా?

(రైతుకొడుకు బండికేసివచ్చి గొడ్డలితో మెల్లమెల్లగా కొడుతూఉంటాడు)

రైతు భార్య: (పైకిచూస్తూ) ఆపుతావా లేదా! ఇక ఏం చేస్తామో చూడు.

(కాట్రీన్ క్రింద చప్పుడు వినటంతో హడలిపోతూ గావుకేక వేస్తుంది. కాని ఢంకా మోగించడంమాత్రం మానింది కాదు.)

ఆఫీసర్: ఆ భడవలు ఇంకా రాలేదే! అక్కడినుండి మందుగుండు సామాను తీసుకుని రావటానికి ఇంతసేపా?

అక్కడఉన్న సైనికుడు: కంగారుపడకండి! ఊళ్ళోవాళ్ళు ఈ పిచ్చిదాని ఢంకా విన్నట్లు లేదు. వినివుంటే అటుమంచి కాల్పులశబ్దం వినబడేది.

ఆఫీసర్: (ఇంకొకసారి పైకిచూస్తూ) ఎంత మంచిగా చెప్పుతున్నా మా మాట వినటంలేదు. ఇక గుండుసామాను ఉపయోగిస్తా. ఆ పని చేయకముందు

ఇంకొకసారి చెబుతున్నా. ఇదే కడపటి హెచ్చరిక. ఆ ఢంకా వెంటనే క్రింద పడెయ్యి.

రైతు కొడుకు: (తను చేస్తున్నపని అమాంతంగా ఆపివేస్తూ బండి కప్పుమీది పలక ఊడతీసి క్రిందికితోస్తూ) ఓ అమ్మాయి! గట్టిగా బాదు! ఇంకా గట్టిగా బాదు!....ఇంకా గట్టిగా! నీ బలమంతా చూపాలి. లేకపోతే మా వూరు మంటల్లో కలిసిపోతుంది.

(ఆ మాటకు సైనికుడు మండిపోతూ ఈటితో వాడిని బావగొడుతాడు. పైనుంచి కాత్రీన్ దీన్నంతాచూస్తూ, ఏడుస్తూ తనపని మరింత తీవ్రంగా చేస్తుంటుంది)

రైతు భార్య. (కొడుకు అవస్థచూస్తూ ఏడుస్తూ) ఏమిటయ్యా! అలా మా వాడిని కొడతావు? ..వాడిప్రాణం పోతే....

(వెళ్ళిన సోల్జరు మందుగుండు సామానుపెట్టె మోసుకుని గబగబ పరుస్తూ వస్తుంటాడు.)

ఆఫీసర్: (పైకి చూస్తూ) గురిపెడుతున్నా! గురిపెడుతున్నా!

(ఈలోపున పెట్టితెరిచి గుండు తుపాకిలో అమర్చుతుంటాడు సోల్జరు.)

ఇదిగో! ఇదే కడపటి హెచ్చరిక! ఆ వాయించడం ఆపుతావా లేదా.

(కాత్రీన్ మరింత గట్టిగా కొడుతూ ఏడుస్తూఉంటుంది)

(సోల్జరుతో) కాల్చండి!

(సోల్జరు తుపాకి పైకి గురిపెట్టి నొక్కుతాడు. ఒకగుండు కాత్రీన్ రొమ్ముకు తగులుతుంది. దానికి లెక్కచేయకుండా మరింతబలంతో ఢంకా మ్రోగిస్తుంది.)

ఏం మంచిదెబ్బతిన్నా ఆపటం లేదా?

(సోల్జరు మరోగుండు ఉపయోగిస్తాడు. అదేసమయంలో ఊళ్లోనుంచి ఫిరంగుల మ్రోతలు వినబడుతుంటాయి. వాటితో ఊళ్ళో చర్చిలనుంచి గంటలు మోగుతాయి రాబోయేప్రమాదం ఊళ్ళోవాళ్ళకి తెలపటానికి. దాంతో ఊళ్లో అంతులేని సందడి)

సైనికుడు: ఈ పిచ్చిపిల్ల పట్టుదలే నెగ్గింది!



# పన్నెండో రంగం

యుద్ధంలోగాని, అలాటికోవకు చెందిన మరే సంగ్రామంలోగాని విజయం పొందాలంటే దానివెంటవచ్చే ప్రమాదం ఎదుర్కోడానికి సిద్ధంగా ఉండాలి. ఇంతకాలంనుంచి మనము చూస్తున్న ఈ యుద్ధం సామాన్యమైంది కాదు. దానిలక్ష్యం దానికోసం పనిచేస్తున్నవాళ్ళని ఆహూతి గొనడం! యుద్ధం గమ్యంలేనిది. మారేళ్ళు సాగని స్త్రీమాత్రం యుద్ధానికి లెక్కాపక్కా! దానిలో దెబ్బతినేది సామాన్యపు మనిషి.

(రంగస్థలం క్రిందటి రంగంలోనిదే ఇంకా తెల్లవారలేదు. ఢంకాల శబ్దం, బూరాలనాదం దూరాన్నుంచి వినబడుతూంటూంది. సైనికదళాల నడక సందడికూడా వినబడుతూ ఉంటుంది.

పాడయిపోయినబండి, దానిముందు మదర్ కరేజి కూతురు శవం, కరేజి శవందగ్గర మోకరించి కూర్చునిఉంటుంది చుట్టుపక్కల రైతు కుటుంబాలు ఆవిడచుట్టు నిలబడి ఆ విషాదదృశ్యం చూస్తుంటారు.)

ముసలి రైతు: ఏమమ్మో! మీరు వెంటనే ఇక్కడినుంచి వెళ్ళిపోవాలి. మిలిటరీ దళాలు కదులుతూ ఉన్నాయి.. వాళ్లని తప్పుకుని ఎలా నడవగలుగుతావో ఒంటరిగా.

మదర్ కరేజి : నా తల్లి మరణించలేదు అది ఎప్పటికీ మరణించదు. అలసిపోయి ఇప్పుడు నిద్రపోతూఉన్నది.

నిద్రపో తల్లి, హాయిగా నిద్రపో.
నా తల్లి నిద్రబోతూన్నది
ఆ! ఆ సందదేమిటి ·
ఆ! ఆ కప్పుమీది సందడేమిటి!

ఆ చప్పుడికి లేస్తున్నారు
ఇరుగు పొరుగులవారు లేస్తున్నారు
ఆ సందడికి
ఆ కప్పుగడ్డి సందడికి

అమ్మాయి ఆనందిస్తున్నది
వాళ్లని మేలుకొలిపినందుకు
సంతోషిస్తున్నది

బీదవాళ్ళు వాళ్ళు
చింపిరి బట్టలతోనే
పరుగెత్తుతున్నారు

తల్లీ! నీవి పట్టుబట్టలు
దేవదూతలు వాడుతూండేదుస్తులు
ఆ దివ్యమైనవాటినే చక్కజేసుకున్నావు
నీ ప్రయాణానికి

ఇరుగు పొరుగులవాళ్ళకి తినటానికి తిండిలేదు
రొట్టెలు దొరికినా పనికిరానివి
పాపం! అవేం చాలుతాయి వాళ్ళ ఆకలి తీర్చుకోటానికి

ఇక నీకా!
మంచిమంచి తినుబండారాలు
ఇతర్లకి అందుబాటులోలేని భోజనపదార్థాలు
తల్లీ! నచ్చాయియా ఇవన్నీ.
పాతవని వాటికేసి చూడవా?

ఒకమాట చెప్పు?
పలుకే బంగారమా తల్లీ!
నిద్రపో! తల్లీ నిద్రపో

సందడి! సందడి! తిరిగి సందడి!
ఆ గడ్డి కప్పుపైన సందడి!
అంతులేని సందడి!

ఒకడు పొలంలో నిద్రబోతున్నాడు
ఇక రెండోవాడు? ఎక్కడ ఉన్నాడో?
వాడు ఎక్కడుందీ ఎవళ్ళకు తెలుసు?

(తనచుట్టూఉన్న వాళ్ళకేసిచూస్తూ) చూడండి! అమ్మాయి నిద్రపోతూ న్నది. చీకూ చింతా లేకుండా నిద్రపోతున్నది. (ముసలిరైతు భార్యవంక చూస్తూ) మీ బావమరది పిల్లలసంగతి చెప్పారు కాదేం? అక్కడ ఇంట్లో వాళ్ళంతా క్షేమంగా ఉన్నారనుకుంటా.

ముసలి రైతు: (కంట తడిపెట్టుకుంటూ) ఆ సరుకులకోసం ఊళ్ళోకి వెళ్ళకపోతే ఇలా జరిగేది కాదమ్మా!

మదర్ కరేజ్: అంత గట్టిగా మాట్లాడకండి. అమ్మాయి గాఢనిద్రలో ఉంది.

రైతు భార్య: నిద్రపోవడంలేదు. మీరే కళ్ళారా చూస్తూఉన్నారుగా!....చని పోయింది. ఎప్పుడో చనిపోయింది.

ముసలి రైతు: మీ ప్రాణాలు దక్కించుకోటానికి వెంటనే ఇక్కడినుంచి కద లడం మంచిది. వాళ్ళ తోదేళ్ళకన్నా చెడ్డవాళ్ళు...మరేం అఘాయిత్యం చేస్తారో మీరు ఇక్కడ ఉంటే....దోపిడిదొంగలు! ...

మదర్ కరేజ్: (లేస్తూ) మీరు అన్నది నిజమే! (తిన్నగా బండిలోకి ఎక్కుతుంది. లోపలినుంచి కంబళితెచ్చి శవంమీద కప్పుతుంది.)

రైతు భార్య: మిమ్మల్ని ఆదుకోటానికి ఎవళ్ళయినా ఉన్నారా? అక్కడికే వెళ్ళితే బాగుంటుంది.

మదర్ కరేజ్: ఊ! వాడు ఉన్నాడు. మా పెద్దవాడు అయిలిఫ్!

ముసలి రైతు: అలా అయితే తిన్నగా అక్కడికే వెళ్ళండి. పిల్ల అంత్యక్రియల సంగతి మీరేం బాధపడకండి. ఆ తతంగం చూసుకోటానికి మేం ఉన్నాం.

మదర్ కరేజ్: ఆ పనికి చాలా ఖర్చు అవుతుంది. (తన ఒడిలోనుంచి సంచితీస్తూ సొమ్ము ముసలిరైతుకు ఇస్తుంది. ముసలి రైతు వాళ్ళకొడుకూ కాత్రీన్ శవాన్ని అక్కడినుంచి మోస్తుకుని వెడుతారు.)

రైతు భార్య: (కరేజిపట్ల సానుభూతి చూపటానికి తల నమ్రతతో వంచుతూ) మీరూ తొందరగా వెళ్ళడం మంచిది.

(అక్కడినుంచి కదులుతుంది)

మదర్ కరేజ్. ఇక ఒక్కదాన్నే బండి లాగాలనుకుంటా. లోపల సరుకులేదు.

అంచేత దానిని లాగడం అంత కష్టం కాదు. ప్రక్క దేశాలకువెళ్లి అక్కడ నా బేరసారాలు చూసుకోవాలి.

(బండికాడె పుచ్చుకుని ముందుకు కదులుతుంది. ఢంకాల మ్రోతలకు బూరాల నాదానికి అంతేలేదు. దాంతో సరిపోతేగా ! నడుస్తూన్న సైనికులు పాడే పాటలగురించి ఇక చెప్పాలా)

సైనికులు : అదృష్టం వాంఛించేవాళ్లు
ప్రమాదాలకు తట్టుకుంటుండాలి.

యుద్ధం, యుద్ధం అంటే సామాన్యమైందా ?
దానికి అంతులేని ఆకలి
ఆ ఆకలి తీర్చుకోడానికి కదులుతుంది
కనబడినవాళ్ళందరిని పొట్ట బెట్టుకుంటుంది.
యుద్ధం ఒకరోజా ;
రెండురోజులదా ఈ తమాషా ?

నూరేళ్లు సాగుతూంటుంది
దెబ్బ తినేవాడు మామూలు మనిషి
అలాటిమనిషికి లాభం ఉంటుందా ?

యుద్ధం, యుద్ధం, నూరేళ్ళు సాగే యుద్ధం

దెబ్బ తినేవాడు మామూలు మనిషి
వాడి తిండి అధ్వాన్నం
వాడి దుస్తులు కాజేస్తారు
జీతంలో సగం దళం మింగేస్తుంది.

మంచిరోజులు వస్తాయని భ్రమపడుతారు
మంచిరోజులా ? ఎలా వస్తాయి మంచిరోజులు

దళం, దళం కదులుతూ ఉంటుంది.

మదర్ కరేజి : (ఆ సందడి అటువున్న పరిసరాలకు బండిని ఈడ్చుకుంటూ)
నన్ను మీ వెంట రానీయ్యండి,
వసంతకాలం వస్తూన్నది

మేలుకో, మేలుకో, క్రైస్తవుడా!
మంచు కరిగి పోతూన్నది
మృతదేహాలు విశ్రాంతి తీసుకుంటున్నాయి
చావనివాళ్ళ విషయం బాధపడకు
వాళ్ళకు కాళ్ళు ఉన్నాయి,
అవి కదులుతూ ఉంటాయి
ముందుకు ఎప్పుడూ ముందుకే.

